*S.V University Oriental Series – No 13*



సాధారణ సంపాదకుడు
ఆచార్య ఎస్ శంకరనారాయణన్, ప్రముఖ, ప్రాచ్య
డైరెక్టర్, యస్ వి యు ఓ. ఆర్. ఇన్‌స్టిట్యూట్

తరిగొండ వెంగమాంబ విరచిత

# జలక్రీడా విలాసము

(యక్షగాన నాటకము)



పరిష్కర్త
డా॥ కె జె కృష్ణమూర్తి, ఎమ్.ఏ, పిహెచ్ డి.
రీడర్ ఇన్ తెలుగు
యస్ వి యు ఓ. ఆర్. ఇన్‌స్టిట్యూట్



శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ
ప్రాచ్య పరిశోధనాలయము
తిరుపతి
1985

# FOREWORD

Tarigonda Vengamāmba a Saint-Poetess (c 1730 to 1817 A D ) a native of Tarigonda, near Vāyalpādu, Chittoor District, Andhra Pradesh, was a staunch devotee of the Lord Sri Venkateswara of the Tirumala Hills She had composed many works, about twenty in number The list of her works includes some major works like *Śri Bhāgavatam*, *Śri Venkatāchala Māhātmyam*, *Vāsiṣṭha Rāmāyanam*, etc and the minor works like the *Visnu Pārijāta*, *Ramā Parinaya*, *Śivanātaka*, etc The present work the *Jalakrīdā Vilāsa* is one of her minor works It is a Yaksagāna Nāṭaka having Lord Śrī Krsna's Bālakrīdā for its theme This work is being published for the first time by Dr K J Krishnamoorthy, Reader in Telugu, Sri Venkateswara University Oriental Research Institute, who has specialised in the works of Tarigonda Vengamāmba This edition is based on the palm-leaf manuscript of the collection of Sri Venkateswara University Oriental Research Institute I am happy now that this edition is being brought out by the Oriental Research Institute as an offering to the world of scholars

I wish Dr K J Krishnamoorthy to bring out his editions of Tarigonda Vengamāmba's other works in due course

**Dr S Sankaranarayanan,**
*Director,*
Sri Venkateswara University
Oriental Research Institute

TIRUPATI,
12th September, 1985

# విషయ సూచిక

# పీఠిక

## 1 ప్రక్రియ

ఆంధ్ర వాఙ్మయమున 'యక్షగాన' మను సారస్వతప్రక్రియ మిగుల విశిష్టమైనది ఆ విశిష్టతకు కారణములు అనేకములు వానిలో ముఖ్యమైనవి ఈ క్రిందివి

1 యక్షగానము తెలుగునందలి దేశిసాహిత్యరూపములను సమగ్రముగా పుణికి పుచ్చుకొని మధుర కవితలలో అగ్రగణ్యమై అలరుచుండుట

2 యక్షగానము శ్రవ్యములలో శ్రవ్యము, దృశ్యములలో దృశ్యమునై, ఆ యుభయ ప్రయోజనములచే బాల గోపాలమునకు ఆనంద దాయకమగు నపూర్వ కళా స్వరూపముగా విలసిల్లుచుండుట

3 యక్షగానము పేరునకు సాంస్కృతికమైనను, కాలక్రమమున గీర్వాణ రూపకముల ప్రభావితమైనను, అది అంతస్స్వరూపమున తెలుగు వాఙ్మయ వ్యక్తిత్వమును ఉద్దీపింపజేయు స్వతంత్ర సారస్వత ప్రక్రియగా నుండి, తరువాతి కాలములలో తమిళ కర్ణాటభాషలయందు వెలువడిన యక్షగానములకు ఆదర్శమగు ఒజ్జబంతిగా వెలసి యుండుట

4 యక్షగానము వైవిధ్యమువలని విస్తృతి, సమన్వయమువలని ఏకరూపత, ప్రయోజనమువలని ప్రశస్తి — అను లక్షణముల మూలముగా ఆంధ్రమున ఏ యితర సాహిత్యశాఖకు తీసిపోని పేరుపెంపులను గడించి యుండుట

తెలుగున యక్షగాన మెంత విశిష్టమైనదో దాని పుట్టుక అంత విచిత్రమైనది ఆదిలో అది దేవతారాధనకై ఉద్దిష్టమైన ప్రత్యేక గాన పద్ధతిగా ఆవిర్భవించినది 'యక్షుల' యొక్క గానము యక్షగానము యక్షులు గంధర్వ, విద్యాధరాదులవలె దేవయోనులు[1] (Demi-gods) వారల అధిపతి కుబేరుడు అతడు 'ధనదుడు'[2] కావున యక్షజాతి లక్ష్మికి కుదురనగ యగుట సహజము

1, 2 చూ అమరకోశము, 1వ కాం , 11 శ్లో మరియు 68 శ్లో
(వావిళ్ల ముద్రణ – 1938)

తెలుగు దేశమందలి జక్కుల కులమునకు చెందినవారె కన్నడ దేశమున 'ఎక్కలగాణ్రాలు' పేరి ప్రసిద్ధి. కర్ణాటవాఙ్మయమున ఎట్టి ప్రచారము కన్పట్టుచున్నది. వాటిలో అభినవ పంప'డను బిరుదు వహించిన నాగచంద్రుడు (క్రీ. 12వ శతాబ్ది) రచించిన మల్లినాథ పురాణములో "కలహంసాదియైన తుమ్మెద ఝంకారం కమలదళయు యైన లక్ష్మిని కీర్తిస్తూ పాడే 'ఎక్కలె' గానంతో సొంపు ఎక్కింది అలా"[1] అన్న వాక్యము వ్రాసియున్నది. ఇందలి ఉపన్యాసమును బట్టి కన్నడ దేశపు 'ఎక్కలు' లేక 'ఎక్కలగాణ్రాలు' మన జక్కుల వలెనె లక్ష్మీ ప్రశస్తిని గానమొనర్చెడు గానపర గాయకులని స్పష్టమగుచున్నది.

'యక్షు'లనువారు బౌద్ధయుగమునకు పూర్వకాలమున ఉత్తర దేశమునుండి ఉత్తరాపథమో, మరేదిక్కుననో వలసవచ్చి, క్రమముగా కర్ణాటాంధ్రదేశముల వ్యాపించి యుండిరనియు, నేడు తెలుగునందున్న జక్కులు, ఎక్కల గాణలు అట్లు స్థిరపడిన ఆ యక్షుల సంతతియై యుండిరనియు పండితుల అభిప్రాయము[3]

జక్కులవారు తమ కులదైవమగు కనకమహాలక్ష్మి మాహాత్మ్యమును ఉద్దేశించి పాడెడి పాటలు ప్రాతలలో భక్త్యుద్రేకమును రేకెత్తించెడి ప్రత్యేక దేశీయ ఫణితిలో నృత్యసహితముగా ఆలపింపబడుచుండెడివి. ఇట్టి ఉద్రేకజనకమగు గానఫణితి నేడును కొన్ని తావుల కనవచ్చును. శివరాత్రివంటి పర్వదినములలో శ్రీశైలాది పుణ్యక్షేత్రములందు జరిగెడు ఉత్సవములలో, జాతరలలో జక్కులవారో, లేక వారి ననుకరించిన మరికొందరో యక్షగంధర్వాది విచిత్ర వేషములను ధరించి అటువంటి గేయములను పాడ యాడినపుడు[4] వారి 'ఆటపాటలు' లక్ష్మీ ప్రశస్తికములు ఆటలుగా అలరింపజొచ్చెను. 'జక్కుల పాట' చరిత్రలో దీనిని తొలిదశగా భావింపవచ్చును.

1 చూ. 'కన్నడ యక్షగానాలు' (వ్యాసం), శ్రీముట్నూరి సంగమేశం, భారతి 1956 ఫిబ్రవరి సంచిక, పుట 67

2 చూ. 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర' ప్రథమ భాగము, పుటలు 13 మరియు 14, డా. యస్వీ. జోగారావు ఎమ్.ఏ., పి.హెచ్.డి.

3 చూ. కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారి 'క్రీడాభిరామ' పీఠిక, తృతీయ ముద్రణము పుట 104

4 "ఆడుచు గంధర్వ యక్షవిద్యాధర, రాదులై పాడెదు నాడెడువారు"

(Contd. in next page)

అటు పిమ్మట ఆ 'పాటం బాణీలో' మరికొన్ని పౌరాణిక గాథలు, క్షేత్ర మహిమలు అజ్ఞాతకవుల నోళ్లనుండి అవతరించి విరివిగా ప్రచారమునంది పండితులను సైతమాకర్షింప గల్గినవని[1] అట్లు పండితుల దృష్టి నాకర్షించుటతో

— పండితారాధ్య చరిత్ర, ప్రథమ ముద్రణము, పర్వతప్రకరణము, పుట 43

ఈ గ్రంథము క్రీ శ 13వ శతాబ్దికి చెందిన రచన పై ద్విపదలో పాల్కురికి కవి సూచించిన యక్షవేషధారణ నేడాంధ్రదేశమున కారణాంతరములచే అంతరించి పోయినను అది కన్నడదేశ యక్షగానప్రదర్శనములలో ఈనాటికిని నిలిచియుండుటను కన్నులార గాంచవచ్చును కన్నడదేశ యక్షగాన శాఖలో "యక్షగాన బడగతిట్టు బయలాట" (North Style of Yaksagāna) అనునది మిక్కిలి ప్రాచీనమైనది ఈ ప్రదర్శనములలో పాల్గొను పాత్రములు ఇంచుమించు అన్నియు చాలవరకు ఒకే విధముగు వేషధారణగలవై కన్పట్టును ఆ వేషధారణలో ముఖ్యముగా ఇట పేర్కొనదగినవి వెడల్పాటి ఉష్ణీషములు (headdresses) ఇవి రావియాకు ఆకృతి గలిగి మిగుల విశాలములై పైకి మొనదేలియుండును వీటిలో పెద్దవారి యుష్ణీషములకు "ముండాసు" అని, పిన్నలు ధరించు వాటికి "కేదగె ముందలె" అనియు కన్నడమున పేళ్లు

See 'Yaksagāna A Dance Drama of India' (1977)
by Martha Bush Ashton & Bruce Christie, Page 54

పైన పేర్కొన్న శిరోవేష్టనములు పాల్కురికి సోముని (క్రీ శ 13వ శతాబ్ది) నాటికే యుండినవనుటకు, పారంపర్యముగా వచ్చుచున్న కన్నడ యక్షగాన (బడగతిట్టు బయలాట) సంప్రదాయమే ప్రత్యక్ష సాక్ష్యము .

1 "కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున (గాంధారమున ?) యక్షగానసరణి"

— భీమఖండము, 3వ ఆశ్వా , 65 ప

'గంధర్వులు దక్షవాటీ క్షేత్రముయొక్క కీర్తిని ('గాంధార' గ్రామమున ?) యక్షగాన సరణిలో కీర్తించుచుందు'రని పై పంక్తియొక్క తాత్పర్యము

భీమఖండముయొక్క రచనాకాలము క్రీ శ 1430 ప్రాంతము చూ కీ శే పింగళి లక్ష్మీకాంతంగారి 'ఆంధ్రసాహిత్య చరిత్ర', పుట 349

పై సీసపాదములో 'గాంధారమున' అనునది సరియైన పాఠమని, అదియే కవి ప్రయుక్తమై యుండునని నేనూహించుచున్నాను గంధర్వులు కీర్తించునది గాంధర్వముననే గనుక మరల 'అట్లు' చెప్పుటలో పునరుక్తియేగాని, విశేషమేమియు లేదు అట్లుగాక, శ్రీనాథ మహాకవి 'యక్షగాన సరణి'ని గూర్చి పేర్కొనుచు, ఆ సరణి 'గాంధారగ్రామము'నకు చెందియున్నట్లు పై పద్యపాదమున సూచించెనని భావించుట మిగుల సమంజసము

ఈ క్రింది ఆంగ్ల వాక్యములు కూడ పై ఊహను బలపరచుచున్నవి

(Contd in next page)

'ఏక్కుల పాటలు' 'యక్షగానము' అనెడు సాంస్కృతిక నామధేయమును సంపాదించెను. ఈ తీరున 'ఏక్కులపాటల' ప్రత్యేక శైలి 'యక్షగాన' మను పేర ప్రసిద్ధి పొందియుండెను. ప్రాణప్రతిష్ఠనందు ప్రయత్నించుచుండిన (క్రీ. 13, 14 శతాబ్దుల మధ్య) కాలముననె ఆ పేరు అటు కన్నడమునకు ప్రాకి యుండును. ఇది సులభముగా ఇంచుమించు క్రీ.శ. 15వ శతాబ్ది పూర్వార్ధము పర్యంతము ఈ దశాపరిణతిగా గుర్తింపవచ్చు.

తెలుగులో యక్షగానరచన క్రీ.శ. 14వ శతాబ్దము నుండియు కొనసాగినట్లు స్పష్టమైన నిదర్శనము లున్నను[1] ఆ రచనలు నేడు లభ్యములైనవి కావు. క్రీ.శ. 15వ శతాబ్ది ఉత్తరార్ధమున రచింపబడిన ఒకటి రెండు యక్షగానముల పేర్లు మాత్రము వినబడుచున్నవి. ప్రోలుగంటి చెన్నశౌరి రచించిన 'సౌభరి చరితము (ఏక్కుల కథ)' అట్టివానిలో నొకటి. వెల్లంకి తాతంభట్టు కవిచింతామణిలో ఉదాహరించిన 'లక్ష్మీకల్యాణము' మరియొకటి.

> "He (K S Karanth) suggests that its earliest form was Gāndhāragrāma, which developed into Ekkalagāna, and finally evolved into a style known as Yaksagāna
>
> Karanth believes Ekkalagāna to be a musical style derived from Gāndhāragrāma because both are thought to share the same characteristics — that either the fifth note of the rāga scale was not used or the style used only five notes of the usual eight—note rāga scale In addition, the Gāndhāra note, (the third note) of a rāga scale and the probable śruti note of Gāndhāragrāma was also the sruti note for Ekkalagāṇa"
>
> — 'Yakṣagāna A Dance Drama of India' (1977), by Martha Bush Ashton & Bruce Christie, Page 20

1 1) పదకవితా పితామహుడైన తాళ్ళపాక అన్నమాచార్యుడు (క్రీ.శ. 1408–1503) సంకీర్తన లక్షణము(సంస్కృతము)న యక్షగానములందలి పదములను గూర్చి పేర్కొనియున్నట్లు ఆయన మనుమడగు చిన తిరుమలయ్య (క్రీ.శ. 1495–1553) తన 'అనువాదము' నందలి ఈ క్రింది పద్యమున తెల్పియున్నాడు

(Contd in next page)

పోగా, క్రీ. శ. 16వ శతాబ్దినుండి రచింపబడిన యక్షగానములు నేటికిని లభించుచున్నవి. వాటిలో చక్రపురి రాఘవాచార్యుని విప్రనారాయణచరిత్ర, కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయము, దినకరా ఓబయమంత్రి గరుడాచల విలాసము, తాళ్ళపాక అక్కమహాదేవి ఓద్గ్యాసము మున్నగునవి ప్రశస్తములు. అటుపిమ్మట ఆ యొరవడిలో అనేక యక్షగానకృతులు వివిధ ప్రాంతములలో విరివిగా వెలసి ఆ వాఙ్మయశాఖను పరిపుష్టము గావించినవి. ఇట్లు యక్షగాన రచనలు ఉందుబాటులోనికి వచ్చిన దశను మూడవ దశగా పరిగణింపదగును. ఇది ముఖ్యముగా క్రీ. శ. 19వ శతాబ్ది వరకు కొనసాగినది. ఈ సుదీర్ఘ దశలో యక్షగాన రచనా, ప్రదర్శనములపై ప్రభావమును ప్రసరింపజేసిన రెండు ముఖ్య ఘట్టములు కలవు. ఒండొకటి కూచిపూడి భాగవతుల 'పండితపోషణము', రెండవది తంజావూరు నాయకరాజుల 'రాజపోషణము'.

పై రెండు ముఖ్య ఘట్టములు కొంచెము వెనుకముందుగా క్రీ. శ. 17వ శతాబ్ద్యారంభకాలమున తటస్థించినవి. ఒందు మొదటి ఘట్టము యక్షగానమునకు అభినయ శాస్త్రానుగుణమగు గౌరవమును ప్రసాదింపగా, రెండవది సంస్కృత నాటకపు మెరుగులను ఆపాదించినది. ఈ రెండింట ప్రభావము యక్షగాన చరిత్రలో మరొక మలుపును సృజించినది. అప్పటినుండి యక్షగానములు 'పారిజాతము'గా, 'కలాపములు'గా, 'భాగవతము'గా, 'యక్షగాన నాటకములు'గా,

"గీ. యక్షగానపదంబులు నవ్విధమున
సముచితానేకవిధ తాళ సంగతులను
నవరసాలంక్రియా సవర్ణంబు లగుచు
నురునని హరికీర్తనాచార్య ఁడనియె"

— సంకీర్తన లక్షణము (తెనుగు), 66 వ.

చూ. 'తాళ్ళపాకవారి లఘుకృతులు' (1936), పుట 149

11) "నాదృష్టిలో 14వ శతాబ్దమునకు చెందిన యక్షగాన మొకటి తాటాకులలో మూల్గుచున్నది"

— 'యక్షగాన వాఙ్మయము' (1973), పుట 7,
డా. బిరుదురాజు రామరాజు, ఎమ్. ఏ., పిహెచ్. డి.

అన్వేషించినచో తాటాకులలో అజ్ఞాతవాసము చేయుచున్న ఇట్టి రచన లింకెన్నో బయల్పడు అవకాశము కలదు.

'యక్షగాన ప్రబంధములు'గా పలుతెరగుల పర్యాయనామములతో ఉల్లేఖనీయముగా వెలువడినవి. 'యక్షగాన' వాఙ్మయశాఖ పరిణత ఫలముల నొసంగుచుండిన యీ కాలమున (క్రీ శ 18, 19 శతాబ్దముల నడుమ) నెందరో యక్షగాన కవులు, కవయిత్రులు విలసిల్లిరి. అట్టివారిలో కావ్యకళాధిష్ఠితయైన కవయిత్రి తరిగొండ వెంగమాంబ.

## 2 రచయిత్రి

వెంగమాంబ ప్రాచీనకవయిత్రుల కోవలో కాలక్రమమున చిట్టచివరి రచయిత్రి. ఈమె జీవితయాత్ర క్రీ శ 1750-1850 సంవత్సరముల నడిమి నూరేండ్ల కాలమున కొనసాగినట్లు స్థూలముగా నిర్ధారింపవచ్చును[1]. ఆ కాలములో సహస్ర చంద్ర దర్శన మొనర్చిన ఈమె[2] దాదాపు 85 సంవత్సరములు జీవించి యుండును. ఈ కవయిత్రి పుట్టుకచే చరితార్థమైన గ్రామము తరిగొండ. ఇది చిత్తూరు మండలమున[3] వాయల్పాడుకు ఉత్తరముగా నాలుగుమైళ్ళ దూర

1 i) "The Dwipada Bhagavatham ద్విపద భాగవతము also was written by a poetess who was living in the year 1840''
—సి పి బ్రౌను దొరగారి తెలుగు–ఇంగ్లీషు నిఘంటువు (1862), పీఠిక పుట XII

పై పలుకులు నిస్సంశయముగా ద్విపద భాగవత రచయిత్రియగు తరిగొండ వెంగమాంబ నుద్దేశించి రచించినవే. ద్విపద భాగవతము ఈ కవయిత్రి అపరవయస్సున రచించిన రచనలలో నొకటి.

ii) తరిగొండ వెంగమాంబ క్రీ శ 1730–35 సంవత్సరముల నడిమి కాలమున జన్మించి, క్రీ శ 1817 ఈశ్వర సంవత్సరమున పరమపదము నొందియున్నట్లు ఇటీవల నూతనముగా లభించిన యాధారముల సాహాయ్యమున ఈ పరిష్కర్తచే "తరిగొండ వెంగమాంబకృతులు — సమగ్ర పరిశీలనము'' అను సిద్ధాంత వ్యాసమున నిరూపింపబడినది.

2 తరిగొండ వెంగమాంబ సహస్రచంద్రదర్శన మొనర్చిన విషయమును ఆమె ప్రశిష్యయగు వెంగమ్మగారిచే, తాను తిరుపతి కొండ కేగినపుడు వినియున్నట్లు విద్యావాచస్పతి విక్రాల రామచంద్రాచార్యులుగారు "తరిగొండ వేంగమాంబా విజయము'' (1932) అను గ్రంథమున పేర్కొనియున్నారు. చూ పుట 80

3 చిత్తూరుజిల్లా యేర్పడక పూర్వము (అనగా క్రీ శ 1911కు ముందు) తరిగొండ గ్రామము, తత్పరిసర ప్రాంతములు కడప మండలములో చేరియుండినవి.

మును సుప్రసిద్ధి. ఈ గ్రామనామ మేర్పడుటకు కారణముగ చెప్పెడు గాథ యొకటి కలదు[1]

ఇప్పటికి కొన్ని శతాబ్దముల క్రిందట రాయదుర్గమను ప్రాంతమున తీవ్ర క్షామము సంభవింపగా, ఆ ప్రాంతపు అధిపతియై యుండిన చిట్వేచర్ల రామానాయుడను నాతడు సపరివారముగా ఆ యూరు వదలి ఈనాడు తరిగొండ యున్న ప్రదేశమునకు వచ్చెను. అప్పుడా ప్రాంతము తృణకాష్ఠజలసమృద్ధిగలిగి వాసయోగ్యముగా గన్పట్టెను. అందుచే ఆ గ్రామస్థులెల్లరు (ప్రస్తుతమిప్పుడున్న పేరు గల) ఆ చుట్టుపట్ల ప్రాంతమును కొంత కాలము వసింప నిశ్చయించిరి. ఒక నాటి యుదయమున రామానాయుని ధర్మపత్ని కుండలో పెరుగు చిలుకుచుండగా సాదు మాటిమాటికి కవ్వమున కేదియో తగులజొచ్చెను. పరిశీలింపగా అది యొక నున్నని నల్లరాయి. ఆమె దానిని వెలికి తీసి పడవైచినను మరల నదే రాయి కుండలో ప్రత్యక్షమగుచుండెను. ఈ విచిత్రమును భార్యవలన నెరిగిన రామానాయుడు అదేదో 'దైవమాయ'యై యుండునని భావించెను.

ఆరాత్రి స్వప్నమున నాతనికి లక్ష్మీనృసింహస్వామి కనిపించి తా నచట సాలగ్రామ శిలారూపమున పెరుగు చిలుకు కుండ (తరికుండ)లో వెలసినట్లును, అందువలన తన నచట ప్రతిష్ఠింపవలసినదనియు ఆదేశించెను. అందుకు వలయు ధనము ఆ ప్రాంతమునగల 'నూరేళ్ల గవి' యనుచోట లభించుననియు స్వామి సూచించెను. రామానాయు డా ధనముతో నచట లక్ష్మీనృసింహాలయమును నిర్మించెను. ఇట్లు, తరికుండ యందు వెలసిన దేవుడు ప్రతిష్ఠితుడైన గ్రామమగుటచే, ఆ యూరికిని 'తరికుండ' అను సంకేత మేర్పడెను. ఆ 'తరికుండ'యే క్రమముగా 'తరిగుండ'యై, జన వ్యవహారమున 'తరిగొండ'గా స్థిరపడెను.

తరతరములుగ తరిగొండలో నివసించుచుండిన కుటుంబములలో కానాలవా రొకరు. వారు నందవరీక శాఖీయులు, వాసిష్ఠ గోత్రులు. ఆ వంశీయుడైన

1. చూ. 1) శ్రీ మహాభక్త విజయము (1966), పుటలు 400–404
— శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి

11) శ్రీ తరిగొండ వెంకమాంబ జీవిత రత్నాకరము, పుటలు 1–5
— రామిసెట్టి రంగయ్య

కానాల కృష్ణార్యుడు వెంగమాంబయొక్క తండ్రి, తల్లి మంగమాంబ ఈ పుణ్య దంపతుల నోము ఫలముగ జన్మించిన వెంగమ్మ బాల్యము నుండియు భక్తిభావన, ఆధ్యాత్మిక ధోరణి గలిగి మనస్విగా మసలుకొనుచుండెడిది తల్లిదండ్రు లామె భక్తి భావనకు తొలుదొలుత మురిసినను, రాను రాను వైరాగ్య ధోరణితో కూడిన ఆమె వింత వర్తనము మాత్రము వారికి నచ్చక పోయెను అందుచే వారామెకు ఆనాటి సాంఘికాచారము ప్రకారము బాల్యముననే వివాహము గావించిరి వరుడు శ్రీవత్స గోత్రజుడగు ఇంజేటి వెంకటాచలపతి పెండ్లియైన కొలది కాలముననే అతడు విధివశమున అకాలమృత్యు నొందగా వెంగమాంబలో బీజప్రాయముగ అణగియున్న భక్తివైరాగ్యధోరణి ప్రబుద్ధము కాదొడగినది ఈ జన్మాంతర సంస్కారము సుబ్రహ్మణ్యయోగి యను ఆధ్యాత్మిక గురువర్యుని ఉపదేశ ప్రభావమున చక్కని సాధనామార్గములలో వికసించి, అచిరకాలముననే వెంగమాంబను బ్రహ్మజ్ఞానిగా నొనర్చినది

ఇట్లు కడు చిన్నవయస్సుననే ఆత్మవేత్తయైన వెంగమాంబ తన అనుభూతులను రచనలద్వారా సామాన్య జనులకు సుబోధకమగు భాషలో లోకమున కందింప సంకల్పించెను ఒకవైపు పూర్వాచార పరాయణులు కల్పించెడి ఇక్కట్టులను ఏకాకిగా ఎదుర్కొనుచునే మరొకవైపు రచన వ్యాసంగమును నిర్వహించిన వెంగమ సాహితీ మూర్తిమత్త్వము (Literary Personality) నిరుపమానము! వితంతువయ్యు సువాసినీ వేషమున వర్తించుచుండుటచే పుష్పగిరి పీఠాధిపతి ఆ యూరికి వచ్చి, సభ చేయించి వెంగమాంబను పిలిపించి ప్రశ్నించెను స్వాములవారితో వినయ పూర్వకముగా మాటాడుచునే, ఆయనను వాదమున నిరుత్తరుని గావించిన వెంగమాంబయొక్క సుజ్ఞాన విశేషమున కెల్లరు అచ్చెరువందిరి చివరకు ఆ స్వాములవారామె నభినందించుచు వెడలిపోయిరి

ఐనను, మొండివైఖరిగల తరిగొండ గ్రామణులు కొందరు, వెంగమ్మను వెలివేయవలసినదనియు, లేనిచో తాము వారి కుటుంబమును కులమునుండి బహిష్కరించి ఆంక్షలు విధింతుమనియు ఆమె తండ్రిపై ఒత్తిడి కల్గించుచుండిరి తత్ఫలితముగా వెంగమ పుట్టినిల్లు వదలి తరిగొండ లక్ష్మీనృసింహాలయమును చేరెను కాని, అచ్చటను ఆమె కాటంకము లెదురైనవి ఆలయమందలి యాంజనేయ విగ్రహము చాటున ధ్యానసమాధినిమగ్నయై యుండగా ఒకనా డచటి యర్చ

కుడు వెంగమాంబను గాంచి, యసూయపడి, కోపముతో తంబురాకులపెట్టె యావలకు [illegible]ను ఏకాగ్రతకు భంగము కలుగగా, నామె కన్నులు తెరచి చూచెను ఆ చూపుల తీవ్రతకు తాళజాలక భీతిల్లి, పూజారి యామె పాదములపై బడి తన తప్పిదమును క్షమింప వేడుకొనెను ఈ సంఘటన మూలమున, ఆటనుండి వెడలిపోవలసినదిగా స్వామి తనను ఆదేశించినట్లుగ భావించి, వెంగమ ఆ యూరును శాశ్వతముగా వీడి, సుప్రసిద్ధమగు వేంకటాచలపుణ్యక్షేత్రమును జేరెను

ఆ కాలమున హాథీరాంజీ మఠాధిపతిగా నుండిన మహంతు వెంగమాంబ గొప్ప భక్తురాలని గుర్తించి ఆమె యుండుటకు ఒక కుటీరమును చూపించి, దేవస్థానమునుండి యామెకు దినవెచ్చము పంపు నేర్పాటు గావించెను తదుపరి కొన్నాళ్లకు తాళ్లపాక చిన్నన్న వంశీయుడొకరు తమ యింటి ప్రక్కనున్న చిన్న మిద్దె యింటిని వెంగమాంబ నివసించుటకై యొసగెను ఆ యింటి పొరుగున నున్న అక్కారామయ్య దీక్షితు లనెడు అర్చకు డామెకు నిర్హేతుకముగా కష్టములు కల్గించుచుండెను[1] అట కొంతకాలముండి, అంతరాత్మ ప్రేరణచే ఆయమ తిరుమలకు పండ్రెండు మైళ్ల ఉత్తరముగా నున్న తుంబురుకోనయను అరణ్య ప్రదేశమును జేరి, అచటి కొండగుహలో కొన్ని వత్సరములు తీవ్ర తపస్సాధన గావించెను

వెంగమాంబ తుంబురు కోననుండి తిరుగ తిరుమల చేరిననాటనుండి ఆమె మహానుభావత సర్వులకు విదితమయ్యెను తులసీ సుమమాలికలను సమర్పించు నిమిత్తము, కర్పూర హారతి నొసంగుటకు 'ఆనందనిలయము' సన్నిధి కామె నిత్యము వచ్చుచు పోవుచుండునపుడు సేవకుడు మొదలుకొని అర్చకుని వరకు గల ఆలయ పరివారమంతయు ఆమె యెడల మిగుల భక్తి శ్రద్ధలతో మెలగుచుండిరి వెంగమాంబ ప్రతివత్సరము జరిపెడి నృసింహజయంత్యుత్సవముల వైభవమునను, భక్తివేదాంతభావ గర్భితములైన రసప్రచనలవలనను ఆమె కీర్తి తెలుగుదేశము నలుగడల వెన్నెలవలె అలముకొనెను ఆనా డామె మఠము 'అష్టఘంటము'[2]

1 చూ శ్రీ తరిగొండ వేంకమాంబ చరిత్రము (1916), పుటలు 39, 40
— శ్రీరంగప్రకాశదాస విరచితము

2 "శ్రీవేంకటాచల మాహాత్మ్యమను గ్రంథమును వ్రాసిన పరమభక్తురాలు పూజ్య మాతృశ్రీ తరిగొండ వెంగమాంబగారివద్ద ఎనిమిది ఘంటములలో నొక ఘంటమును నిర్వహించిన చంద్రశేఖరపిళ్లె విశ్వనాథపిళ్లకు ముత్తాత"

(Contd. on next page)

అను పేర ఎనిమిదిమంది బ్రాహ్మణసంతర్పణ నిరంతరము సందడిగా నుండుచు, దర్శనీయమగు పవిత్ర సారస్వత కేంద్రముగా ప్రకాశించుచుండినది.

వెంగమాంబ లేబ్రాయమునందే వేంకటాచలము చేరినందున ఆమె రచనలలో ఏ రెండు మూడో తప్ప, తక్కిన కృతులన్నియు ఆ పుణ్యక్షేత్రమునందే అవతరించినవి. ఆ 'కవితాతపస్విని'యొక్క ఉపలబ్ధ లేఖిని నుండి వెలువడిన రచనలలో ఇదివరకు తెలియవచ్చినవి ఈ క్రిందివి.[1]

| | | |
|---|---|---|
| 1 | నారసింహాంకిత శతకము | (పద్యము) |
| 2 | నారసింహ విలాస కథ | (యక్షగానము) |
| 3 | శివనాటకము | ( ,, ) |
| 4 | రాజయోగసారము | (ద్విపద) |
| 5 | కృష్ణనాటకము | (యక్షగానము) |
| 6 | పారిజాతాపహరణము | ( ,, ) |
| 7 | రమాపరిణయము | (ద్విపద) |
| 8 | చెంచునాటకము | (యక్షగానము) |
| 9 | శ్రీకృష్ణమంజరి | (మంజరీద్విపద) |
| 10 | శ్రీరుక్మిణీనాటకము | (యక్షగానము) |
| 11 | గోపికానాటకము | ( ,, ) |
| 12 | శ్రీభాగవతము | (ద్విపద) |

ఈ వాక్యములు కార్వేటినగర వాస్తవ్యులు, పండితులు, నవతితమవృద్ధులు, ఇటీవలనే కీర్తిశేషులునైన మధురకవి ముకుందదైవజ్ఞులు (ముకుందపిళ్లగారు) రచించిన "రక్షమాం శరణాగతం" (1973) అను సంస్కృత శతకముయొక్క తొలిపలుకునందలివి. పై పంక్తులలో పేర్కొనబడిన చంద్రశేఖరపిళ్ల శతక రచయితయగు ముకుందదైవజ్ఞులకు మాతామహుడు. ఈ చంద్రశేఖరపిళ్ల బాల్యమున ఇంటిలో తనకేర్పడిన వైమనస్యము వలన నెవ్వరికి తెల్పక కార్వేటినగరప్రాంతమునుండి నేరుగా తిరుమలకేగి, క్రమముగా తరిగొండ వెంగమాంబగారి సన్నిధిని 'అష్టఘంటముల'లో నొకడుగా కుదురుకొనెనని ముకుందదైవజ్ఞులుగారు నాతో చెప్పియున్నారు.

1 చూ. A Descriptive Catalogue of the Telugu Manuscripts in the G O M Library, Madras, Vol IV (1936), పుటలు 1328, 1329.

13 శ్రీ వేంకటాచల మాహాత్మ్యము (పద్యము)
14 అష్టాంగ యోగసారము (పద్యము)
15 ముక్తికాంతా విలాసము (యక్షగానము)
16 ఆధ్యాత్మ కీర్తనలు (గేయము)
17 వాశిష్ఠరామాయణము (ద్విపద)

పైన పేర్కొనిన కృతులలో కొన్ని నేడు లభ్యములు. లభ్యములైన వాటిలో కొన్ని తాళపత్రములనే హస్తగ్రంథములు. ఈ హస్తగ్రంథములలో ముద్రణ భాగ్యమునకు నోచుకొన్నవి కొన్ని. ఆ కొన్ని కృతుల ముద్రిత ప్రతులు కూడ నేడు అరుదుగా లభించుచున్నవి. ఇది యిట్లుండ, వెంగమాంబ గారియొక్క రచనయైన ఈ జలక్రీడావిలాస యక్షగానము ఇటీవలనే లభ్యమైనది. దీనితో ఈ కవయిత్రి రచన లిప్పటికి పదునెనిమిది యని తేలును.

## 3. రచన

1 వ్రాతప్రతి

ఈ యక్షగానము యొక్క తాళపత్ర ప్రతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థ గ్రంథాలయమున గలదు. దీనిసంఖ్య 7627. ఈ ప్రతి స్వరూప వివరణ యిది:

కొలతలు 41.5 సెం.మీ. × 3.5 సెం.మీ. 54 తాళపత్రములు. పుటకు 6 పంక్తులు. పంక్తికి దాదాపు 100 అక్షరములు. వ్రాత స్పష్టమైనది. అక్షరదోషము లంతగా లేవు. ఒకటి రెండు చోటుల కొద్దిగ శైథిల్యమున్నను గ్రంథ సమగ్రతకు భంగము లేదు. లేఖకుని పేరు, లేఖన కాలము మొదలగునవి యుండెడి చివరి (55వ) పత్రము నశించినది.

కనుక, ఈ వ్రాత ప్రతి లేఖకుని పేరును, లేఖన కాలమును స్థూలముగా నూహించుటకు ఒక వీలు కలదు. ఈ ప్రతిని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థకు విక్రయించినవారు కీ.శే. మానవల్లి రామకృష్ణ కవిగారు. వారే క్రీ.శ. 1935-36 సంవత్సరములలో మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము వారికి, తాము సేకరించుకొని యుండిన వెంగమాంబ రచనలగు విష్ణుపారిజాత,

రమాపరిణయమును 'కాపీ' చేసికొనుటకు ఏర్పచ్చినవారు[1] మరియు వారే ఈ కవయిత్రి రచించిన 'తరిగొండ నృసింహ శతకము'ను S V O Journalలో ప్రప్రథమముగా ప్రకటించిరి[2] ఇటన్నిటిని బట్టి ఆలోచింపగా, మానవల్లి కవి గారు ఈ కవయిత్రి రచనల ప్రతులను కొన్నిటిని ఒకచోటనుండి సేకరించి యుందురని తోచుచున్నది వారు సేకరించిన ఆ ప్రతులలో విష్ణుపారిజాతము చివర వ్రాయసకాని పేరు, లేఖన కాలము, రమాపరిణయము చివర లిఖించిన కాలము మాత్రము క్రింది రీతుల తెల్పబడియున్నవి

విష్ణుపారిజాతము లేఖకుడు తరిగొండ వెంగమ్మగారికి మునిమనుమడగు గిరి డిమి[ట్ట] గంగాధరప్ప కాలము క్రీ శ 1896వ సం॥ జూలై నెల 16వ తేదీ

రమాపరిణయము కాలము హేవిళంబి సంవత్సర కార్తీక శుద్ధ షష్ఠి (అది క్రీ శ 1897 అక్టోబరు నెల 31వ తేదీ ఆదివారముతో సమానము)

కావున ప్రస్తుత జలక్రీడా విలాస ప్రతిని సైతము పై గంగాధరప్పయే క్రీ శ 1896-1897 సంవత్సరముల మధ్యకాలమున వ్రాసియుండవచ్చునని నిశ్చయింప వచ్చును

వెంగమాంబ ద్విపద భాగవతావతారికలో తా నంతకుముప్పు రచించిన పదునాల్గు గ్రంథముల పేర్లను పెర్కొనినది ద్విపద భాగవతానంతరము ఆమె వేంకటాచల మాహాత్మ్యమును రచించినది[3] ఇక, ముక్తికాంతా విలాస, వాసిష్ఠ

---

1 చూ A Triennial Catalogue of The Telugu Manuscripts in the G O M Library, Madras, Vol VI (1949), పుటలు 2261, 2269

2 చూ Journal of Sri Venkateswara Oriental Institute, Vol V, No 1 (1944) పుటలు 1—16

3 సీ 'దారునిర్మితమైన నారూఢిఁ బల్కించు, గాయకపురుషుని కరణిగాను
పురుషోత్తముఁడు దయాపూర్ణుఁడై నా జిహ్వ, యందుఁ దా వసియించి యరుదుగాను
పలికించుఁ గావున భాగవతపురాణ, మమర నే ద్విపదకావ్యంబుగాను
ద్వాదశస్కంధముల్ తగఁజెప్పి హరికి నే, నర్పించి శ్రీవేంకటాద్రిమహిమ
గీ మవనిపై రమ్యపద్య కావ్యంబొనర్చి శ్రీనివాసునికే సమర్పింపమంటి"
— శ్రీ వేంకటాచలమాహాత్మ్యము, 1ఆశ్వా, 22ప (వావిళ్లముద్రణ–1914

రామాయణాము లీ కవయిత్రి చివరి రచనలగుటచే వాటియందలి వస్తుతత్త్వ, రచనా రీతులు లాక్షణికాంశములు కాక్పన ప్రకృత కృతియగు ఒక్కడా విలసిల్లు వేంకటాచల మాహాత్మ్య, ముక్తికాంతా విలాసములకు నడిమికాలమున రచింపబడినట్లు నిర్ణయింపవచ్చును

## 2 కథాసంవిధానము

ఈ కృతి వెంగమాంబ తుది రచనలలో నొకటై యుండుటే గాక, వస్తుతత్త్వము ననుసరించి, రచనా కౌశలమును బట్టి ఆమె సృజించిన యక్షగానములలో అగ్రగణ్యమై ఎంచబడుచున్నది ఈ కృతికి బమ్మెర పోతనామాత్యుని భాగవతమందలి దశమస్కంధ పూర్వభాగము ఆధారము ఈ భాగము దాదాపు 1800 గద్య పద్యములతో విస్తరిల్లియున్నది అందుండి వెంగమాంబ ఆవశ్యకమనుకొన్న ఆయా భాగములను గ్రహించి, వాటిని నాటకోచితముగా తీర్చిదిద్ది, 'కలికి కృష్ణుని' బాల్య లీలలను కడుమనోజ్ఞ రీతిని స్వేచ్ఛగా గానమొనర్చినది

కంసుడు దేవకీవసుదేవులకు రథము నడపుట మొదలుకొని, శ్రీకృష్ణుడు జలక్రీడలాడుచున్న గోపికలను కరుణించువరకుగల కథాంశము లిందు గలవు వీటిలో కొన్ని మిగుల విపులముగా వర్ణింపబడినవి కొన్ని కథాంశములు సంగ్రహముగా తెలుపబడినవి మరికొన్ని నామమాత్రముగా పేర్కొనబడినవి ఈ కథాంశము లన్నింటిలోను చివరిది, ఈ కథకు శిఖరాయమానమైనది జలక్రీడా (గోపీవస్త్రాపహరణ) ఘట్టము గనుక, ఈ నాటకమునకు 'జలక్రీడా విలాస'మను పేరు సార్థకమై యున్నది

ఇందలి కథా సంవిధానమున వెంగమాంబ కడు స్వాతంత్ర్యమును ప్రదర్శించినది భాగవత దశమస్కంధ పూర్వభాగమందలి కథలలో కొన్నిటిని మాత్రమే ఈమె స్వీకరించినది అట్లు స్వీకరించిన వాటిలో అత్యంత విపులముగ వర్ణించిన ఘట్టములు మూడు అందులో నొకటి శ్రీకృష్ణావతార ఘట్టము ఇది—కంసుడు తేరుద్రోలుట మొదలుకొని పురోహితుడు శ్రీకృష్ణుని జన్మఫలమును చెప్పుటయను సన్నివేశము వరకు — ఈ యక్షగానమున ఇంచుమించు మూడవవంతు విస్తరించి యున్నది రెండవది- బాలకృష్ణుడు గోకులమున జేయు దుడుకు పనులు, గోష

కాంతల ఫిర్యాదులు, వలసపోయెదమని యశోదతో పల్కుటలు — పిటస్నిటితో ఈ గ్రంథమున దాదాపు ఒకొక్క మూడవ వంతు పరిమితిలో విస్తరిల్లి యున్నది వస్త్రాపహరణము–గోపికలు జలక్రీడలాడుచుండగ శ్రీకృష్ణుడు వారి చేలముల నపహరించిన ఘట్టము

పూతనాసంహరణము, శ్రీకృష్ణుడు ఆవులించి వదన గహ్వరమున బ్రహ్మాండమును చూపించిన ఘట్టము, గోపికలు పార్వతీవ్రత మాచరించుట — అనునవి ఇందు విపులీకరించబడిన మరికొన్ని సన్నివేశములు

శకటాసురభంజనము, తృణావర్తవిదళనము, బలరామ కృష్ణుల నామకరణము, మృద్భక్షణ సన్నివేశము, యమళార్జున భంజనము, కాళియమర్దనము — మున్నగు సన్నివేశములను ఈ కవయిత్రి నాతివిస్తరముగ, నాటకానుకూలముగ వర్ణించినది వత్సాసుర, బకాసుర, అఘాసురాది రాక్షసుల సంహరించుట, (అనంతర కథంగా) బ్రాహ్మణస్త్రీల రక్షించుట, గోవర్ధనోద్ధరణము, చాణూర కంసాది దుష్టుల దునుమాడుట, వారిధిమధ్యమున ద్వారక గట్టుట, అష్టభార్యలయందు పెక్కండ్రు పుత్రుల గనుట – అను అంశములు ఇందు కొలది మాత్రము సూచింపబడినవి

ఇక ఈ కవయిత్రి స్వీకరింపక వదలిన భాగవత కథాంశములలో శ్రీకృష్ణ బలరాముల బాలక్రీడాభివర్ణనము, యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతము, నందాదులు బృందావనమునకు వచ్చుట, శ్రీకృష్ణుని చల్దులు, బ్రహ్మ గోవత్సములను, గోపబాలురను అంతర్ధానమొనరించుట, బలరాముడు ధేనుకాసుర, ప్రలంబాసురులను వధించుట, కాళియుని పూర్వకథ, గోపగోపికా జనమును కార్చిచ్చు చుట్టుకొనుట, శ్రీకృష్ణుడు దావాగ్నిని మ్రింగుట, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత ఋతువర్ణనలు — ముఖ్యమైనవి. ఈ ఘట్టములను వెంగమాంబ నాటకీయతా దృక్పథముతో పరిత్యజించినది

౬. కవితా విశేషములు

ఈ యక్షగానమందలి కవితా విశేషములలో మొదట పేర్కొనదగినవి ఇందలి స్వరూపవర్ణనలు వాటిలో ముఖ్యమైనది శ్రీకృష్ణావతార వర్ణనము ఇది సంస్కృత

భాష

ఈ కృతి యందలి భాష శిష్టము, సరళము, సుందరము నెత్తని తత్సమములు మేళవించిన తెలుగు పలుకుల సొంపు ఇందలి భాషకు సహజాలంకారమై ఒప్పుచున్నది. సంబరము, కరుకు, నిర్వాకము, బాధ్యము, భూతకి, సళుకు, నిండా, సుళ్ళుమాటలు, చురుకు — వంటి మాండలిక ప్రయోగములు, కుసిలించు, దిండీలు, కప్పురపాటు, ఉడ్డుగుడుచు, కరకరి, తీడుకొను, గారడము — వంటి ప్రౌఢ ప్రయోగములు, బహుసుండు, పరబిడ్డలు, ఘనపట్టుచెర – వంటి స్వాభావిక సమాసములు, పెడతించు, పలికించు, ఫాలార్చాబ్జుడు — వంటి నూతన ప్రయోగములు, మొగముగంటలు జూచుకొనుట, సిగపట్టుబిరము, బ్రతుకులు బంగారమై పొల్చుట, తాను గొప్పులు చేటనీరు గ్రోలును — వంటి లోకోక్తులు ఈ యక్షగానము యొక్క యాపాట్ల అన్వర్థముగా అందగించియున్నవి.

వెంగమాంబ ఈ నాటకమున భాషావిషయమై కావించిన నూత్నప్రయోగ మొకటి ప్రశంసింపదగియున్నది. ఆయా పాత్రలకు ప్రయుక్తమైన వ్యావహారిక భాషతో ఈ కవయిత్రి ఇందు పాత్రోచితమగు వైవిధ్యమునేగాక, వయసును బట్టియు వైవిధ్యమును ప్రదర్శించినది. 'అవ్యక్తం బాలభాషితం' అను సూక్తి ననుసరించి బలరామకృష్ణులను ముద్దులొలికెడు 'బాలభాష' (ముద్దు మాటలు)లో మాటాడించి, ఆటపాటలలో, సంభాషణలలో సరిని ఉన్న తెలుగు బాలకులుగా తీర్చిదిద్దినది (చూ పుటలు 51–55, 91–94, 108–113, 117–121, 124–127)

ఇక, ఇందలి పాత్రోచిత వ్యావహారికమునకు పురోహితుని మాటలు చక్కని యుదాహరణము. నందగోపునకు కుమారుని జాతక ఫలమును వివరించు ఆ ఘట్టమున పురోహితుడు "జననీ జన్మసౌఖ్యానాం" అను శ్లోకమును చదివి, ఆ శ్లోకమునకు వివరణగా వక్కాణించిన "యుష్మకు సిద్ధాంతం ఫలించుచున్నది గనుక, జన్మసౌఖ్యంబున్ను, కుల వంశ వర్ధనానం ఉయ్యటందుకున్ను, పూర్వజన్మ పుణ్యాచయము తెలియుటకున్ను నాకు తోచినట్లు కొస్సగా వివరించి చెప్పినాను" ఇత్యాది వాక్యములు ఆ కవయిత్రికి గల వ్యావహారిక కౌశలమును చూచాయగా సూచించుచున్నవి (చూ పుట 37)

అందువలన, వెంగమాంబ వాసిష్ఠ రామాయణము వంటి వేదాంత గ్రంథమునకు వ్యాఖ్యను వ్రాయదలపెట్టియుండినచో అది తాళ్లపాక పెదతిరుమలాచార్యుల 'భగవద్గీతా వ్యాఖ్య' వలె ఆహ్లాదకారియై యుండెడిదని భావింపవచ్చును.

ఈ కృతులయందలి వస్తువిస్తారములలో ఎన్నో సుందరములైన సంస్కృత శ్లోకములు, చూర్ణికలు ఎన్నదగినవి రచింపబడియుండుట భాషాగతముగ మరియొక్క విశేషము. ఇట్టి భాషావైచిత్రివలనను, పెక్కురీతుల ఛందోవైవిధ్యము చేతను ఈ యక్షగాన శైలి చమత్కారకమై, రసానుగుణముగా నివదించచున్నది.

5 ప్రవైశిష్ట్యము

"కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతల" అన్నట్లు, దేశీయ రచనావిశేషములలో యక్షగానము రమ్యము. యక్షగానములలో నెల్ల రమ్యతరములు ఈ 'కవితా తపస్విని' కృతులు[1]. ఈ కృతులలో మిగుల కమనీయమైనది ఈ జలక్రీడా విలాసము.

ఈ ఇతివృత్తమును గైకొని, తెనుగున యక్షగాన రచన చేసిన వారిలో 'అక్కయ ప్రధానుడు' ఒక్కడుగా గనబడుచున్నాడు.
(చూ. అనుబంధము 11)

1 i) "In this branch of literature Vengamāmba occupies a prominent place. No doubt there are some poets and poetesses who composed Yakṣagānas. But nobody has written half-a dozen Yakṣagānas as Vengamāmba. These works reveal not only her proficiency in Sāhitya, but in Sangīta also, as Yakṣagāna is a combination of the two arts."

— N. Venkata Rao

See: *The Madras University Journal*, Vol. XXX No. I, Page 24

ii) "ఆమెవలె ఎన్ని యక్షగానము లింత సమర్థముగా రచించిన కవయిత్రులు లేరు సరికదా కవులు అరుదు."

— ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, ద్వితీయ భాగము, పుట 116

— డా॥ యస్. వి. జోగారావు, ఎమ్. ఏ., పిహెచ్.డి.

ఇందు సవరింపబడిన వానిలో మొదటివి వ్రాత దోషములు. ఇవి లేఖకుని భ్రాంతిచేతనో, ఏమరుపాటునను, [illegible] ప్రతిలో చోటుచేసికొనినవి. వీటిలో అధికాక్షరములు, అక్షర లోపము, ఒకదాని కింకొకటి వ్రాయుట, గుణింతమునకు సంబంధించిన దోషములు, పునరుక్తులు, ఒక పద్యమును మరొక పద్యముగా పేర్కొనుట, ఒక పద్యముతో, దరువుతో ఇంకొక పద్యమును కలిపి వ్రాయుట — మున్నగు రకములుగా నున్నవి. ఇట్టివి సముచిత రీతిని సవరింపబడినవి.

ప్రాచీన లేఖన సంప్రదాయమునకు చెందిన వలపలగిలక, నిండుసున్నకు తరువాతి హల్లు ద్విత్వమునొందియుండుట, (అంన్న, అంమ్మ — ఇత్యాదులలోవలె) అనుస్వారక ద్విత్వములకు, (మంన్మథుడు, బ్రంహ్మ, చింన్నాను — ఇత్యాదులలోవలె) అనునాసిక సంయుక్తములకు పూర్వమున పూర్ణబిందువు వ్రాయుట — మొదలైనవి రెండవ తెగకు చెందును. ఇవి నేటి వ్రాతపద్ధతి కనుగుణముగా సవరింపబడినవి.

ఈ యక్షగాన ప్రతిలో ప్రధానముగు గేయభాగముగాక, రక్కసదానియందు ఎక్కువగా ద్విపద, ఎడనెడ కందము, తేటగీతి, ఆటవెలది, అరుదుగ సీసము, చంపకమాల, మత్తేభము వంటి పద్యములు నెలకొనియున్నవి. ఒకే లేఖిని నుండి వెలువడినను పద్యములందలి భాష గేయములయందలి భాషకన్న ఎక్కువగా యతి, గణ, ప్రాసాది ఛందోనియమములకు కట్టుబడియుండుటవలన ఆ రెంటి భాషా స్వరూపములో ఇంచుక భేదము గోచరించుట సహజము. ఈ సహజత్వమును మనసున నిడుకొనియే ఇందు పరిష్కరణ కొనసాగింపబడినది. ఉదాహరణమునకు 'యకారంబును, వు, వూ, వో, వౌ లను దెలుఁగు మాటలకు మొదట లేవు'[1] అను లాక్షణిక నియమము పద్యభాగమున కన్వయించునట్లు, వ్యావహారిక భాషా ప్రచురమగు గేయభాగమునకు అనువు పడదు. అందువలన 'వున్న, వూరు, వొకడు, వరి' వంటి మాటలు గేయభాగమున యథాతథముగా చూపబడినవి. ఇక, 'చంతకు, జప్పవమ్మ, జారనీక, జాతావే' — వంటివి అర్థదృష్ట్యా 'చెంతకు, చెప్పవమ్మ, జేరనీక, జేతావే' — ఇత్యాదిగా సవరింపబడినవి.

1. చూ. బాలవ్యాకరణము, సంజ్ఞాపరిచ్ఛేదము, సూ. 17

ఇచ్చట ఈ గేయ భాగమును గూర్చి చెప్పదగిన ముఖ్యాంశ మింకొకటి కలదు ఇందలి దర్వులు, ఏలలు మొదలుగునవి చాలవరకు దీర్ఘాక్షరములతో తీగసాగిన తీరున లిఖింపబడినవి అట్టి దీర్ఘములచే కొన్ని యెడల శబ్ద స్వరూపము మారి, అర్థస్ఫూర్తి క్లిష్టత నొందినది అందుచే అట్టి దీర్ఘములు అర్థావగతికి అవకాశ మిచ్చునంతమేర, ఆ గేయపు నడకకు అనుగుణముగా సవరింపబడినవి మొత్తము మీద ఇట్టి స్వల్ప సవరణలు ఈ కవయిత్రి ప్రయోగించిన వ్యావహారిక భాషా స్వరూపపు పరిధి నతిక్రమింపక, కడు మెలకువతో కావింపబడినవి

## 3 పూరణాలు

తాళపత్ర ప్రతిలో అచ్చటచ్చట కొన్ని శిథిల భాగములు కలవు అట్టి శిథిల భాగములలో, వాటి ముందు వెనుకల ఉన్న పదముల సందర్భ బలమునుబట్టి పూరింప వీలయినవి మాత్రము పరిష్కర్తచే పూరింపబడినవి అట్లు పూరించిన ఆ భాగములు చదరపుకుండలీకరణములలో నిర్దేశింపబడినవి శైథిల్యము లేకున్నను, లేఖకుని ఏమరుపాటువలననో, లేక అతని కాధారమైయుండిన అసలు మాతృకలో ఆ చోట్ల శిథిలమై యుండినందుననో, మరే కారణము చేతనో ఈ ప్రతిలో అక్కడక్కడ కొన్ని అక్షరములు, పదములు, సంధివచనములు లోపించిన చోటులు కన్పట్టుచున్నవి కాని, అట్టివి సకృత్తుగా నున్నవి అట్టి స్థలములు కూడ పరిష్కర్తచే పూరింపబడినవి అవి కేవలపూరణములు అట్టి చోటులు పూరితభాగములకు మామూలు కుండలీకరణము లుంచబడినవి కావున, అవి మూల భాగములు కానని గ్రహింపవలెను అట్లే ఈ గ్రంథము నందలి 'ఇష్టదేవతా ప్రార్థన' వంటి ఉపశీర్షికలను (sub headings) పరిష్కర్త చేర్చినవిగా భావింపవలెను

ఇటుపిమ్మట పేర్కొనవలసినవి విరామ చిహ్నములు తాళపత్ర లేఖనమున నిలువు గీతయే విరామ చిహ్నము ప్రకృత పరిష్కరణలో కామా, సెమికోలను, తలక్రిందు కామాలు, అడ్డగీత (hyphen), ఆశ్చర్యార్థక చిహ్నము మొదలైనవి ఆవశ్యకమైన చోటుల గుర్తింపబడియున్నవి ప్రధానముగా ఇది నాటకము గాన "అనిరి, పలికె, అనుచున్నాడు, పలికిరి" — ఇత్యాది వచ్యర్థక క్రియలు వచ్చినచోటు లన్నింట స్పష్టప్రతిపత్తికై 'కోలను' తరచుగా వాడబడినది

## 4 వివరణలు

ఈ యక్షగానమందలి కొన్ని పదప్రయోగములు, అర్థవిశేషములు వివరణాపేక్షములై యున్నందున, వాటికి ఆ యా పుటలలో అధోజ్ఞాపికల (Foot notes) రూపమున సముచిత రీతిని వివరణలు సమకూర్చబడినవి. అవసరమైన చోట్ల ఆ వివరణములకు నిఘంటువులు మొదలగు ఆకరములు సైతము చూపబడినవి.

## 5 ప్రత్యంతరము

ఈ నాటక మీ విధమున పరిష్కరింపబడి, దీని ముద్రణ పనులు పూర్తియై, ముగియుచుండిన సమయమున ఈ గ్రంథమునకు మరియొక తాళపత్రప్రతి లభించినది. ఇది కర్నూలు యస్. టి. బి. సి. కళాశాల ఆంధ్రోపన్యాసకుడైన శ్రీయుత పైడిపాటి జయరామరెడ్డి, ఎమ్. ఏ., గారు సేకరించిన తాళపత్రగ్రంథ సంచయమున "జలక్రీడలు" — అను పేరుతో నున్నది. ఇది చిత్తూరు మండల మందలి యొకానొక గ్రామమున సేకరింపబడినది. దీనికి 'P ప్రతి'యను సంకేత ముంచబడినది. ఈ P ప్రతియందును వ్రాయసకాని వక్కణ (లేఖకుడు, కాలము, మున్నగు వివరములు) గల చివరి యాకు లోపించినది.[1] ఈ ప్రతితో ప్రకృత ప్రతిని పరిశీలించి చూడగా, రెండిటియందలి రచనా స్వరూపము (text) — లేఖకుల దోషములు నటుంచి — ఇంచుమించు ఒకే తీరుగా నుండుట గోచరించినది. ఈ P ప్రతిలో లభించిన పాఠాంతరములు, శిథిలభాగ పరిపూరకములగు పాఠములు ఈ గ్రంథము చివరి (1)వ అనుబంధమున నీయబడినవి. ఈ రెండవ తమ ప్రతిని పరిశీలింప నొసంగిన సహృదయ మిత్రులు శ్రీ జయరామరెడ్డిగారికి పరిష్కర్త మిగుల కృతజ్ఞుడగుచున్నాడు.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థ ప్రచురించిన తరిగొండ వెంగమాంబ కృతులలో ఈ జలక్రీడా విలాసము మూడవది. మొదటిది శ్రీ తరిగొండ నృసింహశతకము. [1] శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు సంపాదించి ప్రకటించినది.[1] రెండవది కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పరిష్కరించిన రమాపరిణయము (ద్విపద కావ్యము).[2] 'ఆ పరితోషా ద్విదుషాం' అన్నట్లు, ఈ

1. చూ. *Journal of Sri Venkateswara Oriental Institute*, Vol V, Part II (1944), పుటలు 1—16

2. చూ. శ్రీ వేంకటేశ్వర లఘు కృతులు (1948), పుటలు 169—191

పరిష్కరణ కార్యమునకు చరితార్థతను ప్రసాదించునది సహృదయులగు ప్రాజ్ఞుల ఆమోదమె

6 కృతజ్ఞతలు

ఈ మధురకవి రామకృతిని పరిష్కరించుటలో ప్రధాన ప్రోత్సాహకులైన సహృదయులు ఆచార్య బిరెడ్డి చెన్నారెడ్డి ఎమ్.ఏ., పిహెచ్.డి. (Ex-Director S V U O R Institute) గారికి నా కృతజ్ఞతాభివందనములు. ఈ యక్షగానము నందలి భాషావిశేషములను గూర్చి, ఎక్కువ ఆంచలిక పదముల అర్థములను గూర్చి తెలియజేసిన సహృదయ వతంసులు ఆచార్య జి. యన్. రెడ్డి, ఎమ్.ఏ., ఎమ్.లిట్., పిహెచ్.డి. (Professor & Head Dept of Telugu Studies, S V University) గారికి నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు. ఈ గ్రంథమీ రీతిగా వెలుగు చూచుటలో ముఖ్య కారణులైన సహృదయులు ఆచార్య యస్. శంకరనారాయణన్ ఎమ్.ఏ., పిహెచ్.డి. (Director, S V U O R Institute) గారికి నా కృతజ్ఞతాభివాదములు.

ఈ గ్రంథప్రచురణ కనుమతించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాధికారులకు, దీని నిట్లు ముచ్చటగా ముద్రింపజేసిన యస్. వి. యూనివర్సిటీ ప్రెస్ ఉద్యోగులు శ్రీ కె. వి. ఎన్. రాజు (Foreman), శ్రీ వి. ఆర్. సోమశేఖర్ (Deputy Foreman) గార్లకు, తదితర సిబ్బందికి నా ధన్యవాదములు.

సిద్ధార్థి శ్రీకృష్ణజయంతి
తిరుపతి,
15–8 1979

[illegible] కృష్ణమూర్తి

# తరిగొండ వెంగమాంబ

## విరచిత

# జలక్రీడా విలాసము

## ఇష్టదేవతా ప్రార్థన

ఉ శ్రీ రమణీ మనోరమణ। చిన్మయ। విశ్వశరీర। ఘోరసం
సారలతాలవిత్ర। నవసారసనేత్ర పవిత్ర। భక్తమం
దార। కృపాంతరంగ। పరతత్త్వము నీవని నమ్మి, ముక్తికై
కోరి భజింతు నిన్ను తరిగొండ నృసింహ। దయాపయోనిధీ।

### దర్వు, నాట రాగం, ఝంపె తాళం

శ్రీరుక్మిణీలోల। — శృంగార సుఖలీల।
కారుణ్య రసమూల। — కనకరుచి చేల।
సూరిజన నుతశీల। — సురుచిర గుణజాల।
ఘోరదనుజవిఫాల। — గోపాల బాల। ॥జయ జయా॥ 1

పరిపూర్ణ విజ్ఞాన। — భావదివ్యధ్యాన।
పరవశాత్మాధీన। — భక్త సంతాన।
సురమునీంద్ర నిధాన। — శోభితాహిశయాన।
పరమాంబరస్థాన। — బ్రహ్మాభిధాన। ॥జయ జయా॥ 2

వరద। తరిగొండపుర — వాస। శేషగిరీశ।
వరనీల సంకాశ। — వనధిజాధీశ।
పరమాత్మ। జగదీశ। — [పాధుహృ][1] దయనివేశ।
ద్విరదరిపు మదనాశ। — దేవదేవేశ। ॥జయ జయా॥ 3

---

1 ఈ శిథిలపూరణ ఈ కవయిత్రి రచించిన 'విష్ణుపారిజాత' యక్షగానమునందలి ఇదే దరువు ననుసరించి చేయబడినది

## మధ్యమావతి రాగం, ఆది తాళం

నందనందన ! తే నమో నమో ॥పల్లవి॥

సా, నందహృదయ ! తే నమో నమో
నందనందన ! తే నమో నమో ॥నందనందన॥ ॥ఉ ప॥*

నా[రాయణ !][1] పరిపూర్ణ సుధాకర (వద)[2]
నా ! మాధవ ! తే నమో నమో
నారద సనకసనందన నుతపద
నలినయుగళ ! తే నమో నమో ॥నందనందన॥ 1

సమర విభీషణ ! సజ్జన పోషణ !
విమలచరిత ! తే నమో నమో
కమనీయాం [గ ! వికా][3] ర విరహిత ! వి
నమదుద్ధర ! తే నమో నమో ॥నందనందన॥ 2

వర తరిగొండ నివాస ! పరాత్పర !
నరమృగవర ! తే నమో నమో
గురుతర పన్నగ గిరినాయక ! బహు
నరపూజిత ! తే నమో నమో ॥నందనందన॥ 3

వ అని యిష్టదేవతా ప్రార్థనంబు జేసిన తదనంతరంబున

## విఘ్నేశ్వరుని రాక

ద్విపద శ్రీపార్వతీ గర్భ — సింధు చంద్రుండు
పాప విముక్తుండు — భక్తావనుండు
సకల విఘ్నహరుండు — సామజాస్యుండు
ప్రకట విజ్ఞాన సం — పన్నుడై, విమల

---

* ఉ ప అనగా ఉపపల్లవి

1, 3 శిథిలపూరణలు 2 కేవల పూరణము

ఈ మూడును 'విష్ణుపారిజాతము' నందు గల ఇదే గేయము ననుసరించి పూరింప బడినవి.

నాగోపవీతంబు — నవ్యమౌంజి[యును]
బాగొప్ప ధరియించి — ప్రబల మూషకము
పై నెక్కి మురియుచు — పాలాశదండ
మూనికెగా బట్టి — యుదరంబు మీద
తుండ మల్లాడ, కాం — తుల నొప్ప చంద్ర
ఖండంబు శిరముపై — కర మొప్పచుండ
సలలిత పాశాంకు — శములు ధరించి
యలరార తరిగొం[డ — హరియైన] శేష
గిరివాసుడగు బాల — కృష్ణులవయున (?)[1]
విరివిగా వినవచ్చె — విఘ్నేశ్వరుండు

## ఆట తాళం

గణనాయకుడు వచ్చెనూ, నటింపుచు
 గణనాయకుడు వచ్చెనూ ॥పల్లవి॥

గణనాయకుడు వచ్చె — గజ్జె లందెలు మ్రోయ
ఘణఘణామని మొల — ఘంటలు గదలగ ॥గణనా॥ ఉ ప॥

ముజ్జగముల కాది — మూలము తానని
బొజ్జల్లాడింపుచు — భూరితేజముతోడ ॥గణనా॥ 1

వేడుకగా జల — క్రీడా విలాసము
నాడాడ వృద్ధిజే — యదలంచి ముదముతో ॥గణనా॥ 2

వర తరిగొండ ని — వాసుడు వేంకట
గిరివాసుడగు బాల — కృష్ణ చర్యలు జూడ ॥గణనా॥ 3

ఇట్లు వచ్చిన గణేశ్వరునకు నమస్కరించి, స్తోత్రంబు జేసెద

---

'బాలకృష్ణులవయున' (లీలలను) అను అధ్యాహారముతో అర్థమును సమన్వయించు కొనవలెను

## గణనాయక స్తుతి

### దర్వు, ఆట తాళం

గణనాయ[కా శరణు, గణనా] యకా శరణు
గణనాయకా శరణు, గణనాయకా ! ॥పల్లవి॥

శ్రీ శివవరపుత్ర ! — చిరతర ఘనచిత్ప్ర
కాశ ! మమ్మేలు శ్రీ — గణనాయకా ! ॥గణ॥ 1

భవరోగ సంహార ! — భక్త చిత్త విహార !
కవిజన మందార ! — గణనాయకా ! ॥గణ॥ 2

మునిజనపా[లన ! — మూషక వాహన !]
ఘన సుగుణసంతాన ! — గణనాయకా ! ॥గణ॥ 3

నీరధి గంభీర ! — నిగమ గోచర ! విశ్వ
కారణ విగ్రహ ! — గణనాయకా ! ॥గణ॥ 4

అలరార నిను నమ్మి — నటువంటి మాపాల
కలిగియుండుము నీవు — గణనాయకా ! ॥గణ॥ 5

తాపత్రయంబును — తలగించి మము [బ్రోచి]
కాపాడవయ్య ! శ్రీ — గణనాయకా ! ॥గణ॥ 6

తలగక నిఘ్నకా — రుల ద్రుంచి, బ్రహ్మ స
త్కృశలో నన్నుంచు శ్రీ — గణనాయకా ! ॥గణ॥ 7

ఆరూఢీ తరిగొండ — హరికి సోదరియైన
గౌరి కుమార ! శ్రీ — గణనాయకా ! ॥గణ॥ 8

అని ప్రార్థింపుచున్న సమయంబున మరిన్ని కొందరు నచ్చి, 'స్వామీ ! నీ వెవ్వరు ? నీ యభిధానం బెయ్యది ? జననీ జనకి సహోదరాదు లెవ్వ ?' రనిన విఘ్నేశ్వరుం డిట్లనుచున్నాడు

అమలసుశాంతాత్ముడగు హిమనగరాజు
గన్న కూతురు నన్ను గన్న తల్లి

గుణిగాకనే యుండి గుణగణాకర శక్తి
కలితుడైనట్టి శంకరుడు తండ్రి
పరగ షణ్ముఖ వీరభద్రు లిద్దరు సహో
దరులు, జాహ్నవి మారుతల్లి మాకు
మైనాకు డొకమేనమామ, శ్రీ తరిగొండ
హరి యొక్క మేనమామయ్యె, నిట్టి

గీ వరుస లేమన్న, మా తల్లి వరుసచేత
నతడు మామయ్యె, నొకతల్లియైన గంగ
వరుసచేతను తరిగొండ నరమృగేంద్రు
డమర మాతాత యయ్యె నో యనఘులార!

గీ అజుడు మును సృష్టి బుట్టించునపుడు నన్ను
పూజగావింపగా వృద్ధినొందె సృష్టి
గాన, పూజించువారి విఘ్నముల నణతు
నందుచేతను విఘ్నేశుడంద్రు నన్ను

వ అనిన విని వారు సంతసించి విఘ్నేశ్వరునకు షోడశోపచార పూజలు సమర్పించి
మ్రొక్కి, హే లంబోదరా! శ్రీమన్ నృసింహార్పితంబుగా నా యొనర్పం
బూనిన[1] జలక్రీడా విలాసంబను కృతి నుద్ధరింపవలయునని ప్రార్థించిన
సమ్మతించి విఘ్నేశ్వరుండు సకల విఘ్నకారుల నుద్దేశించి యిట్లనుచున్నాడు

## గణేశ్వరుని ఆజ్ఞ

### దర్వు, ఆది తాళం

చేరరాకు డిందు విఘ్నకారులారా!
నే నా, ధరమైతి కృతికి విఘ్నకారులారా! ॥పల్లవి॥
మీరెల్ల నాయాజ్ఞ విఘ్నకారులారా!
యింక, మీరేరు హెచ్చరికె విఘ్నకారులారా! ॥చేర॥ 1

---

1 'ఇంజేటి వెంగమాంబ యొనర్పంబూనిన' — అని గ్రహింపదగినది

క్రూరములు విడిచి విఘ్నకారులారా !
దూరమున జనుడీ విఘ్నకారులారా ! ॥చేర॥ 2

కలికికృష్ణు[1] డిచట విఘ్నకారులారా !
నాటకంబు సల్పవచ్చు విఘ్నకారులారా ! ॥చేర॥ 3

ఘనతరిగొండాధిపుడు[2] విఘ్నకారులారా !
వింతగా నిందె జూచి విఘ్నకారులారా ! ॥చేర॥ 4

వ అని యిట్లు విఘ్నకారుల నియమించి, యీకృతి రచియింపుమని గణేశ్వరుం డాజ్ఞాపించిన, మహాప్రసాదంబని తదనంతరంబున గోపాల ప్రార్థనంబు చేసెద

## బాలగోపాల స్మరణము

### దర్వు

బాలగోపాలం భజే, హే మానస !
బాలగోపాలం భజే ॥పల్లవి॥

బాలగోపాలం — భర్మసుచేలం ॥బాలగో॥ ॥ఉ ప॥

శ్రీసతిలోలం — భాసురచేలం ॥బాలగో॥ 1
మన్మథాకారం — మందరోద్ధారం ॥బాలగో॥ 2
నిగమసంచారం — నిర్జరాధారం ॥బాలగో॥ 3
కౌస్తుభాభరణం — కంససంహరణం ॥బాలగో॥ 4
తరిగొండాధీశం — తరణి సంకాశం ॥బాలగో॥ 5

వ అని యిట్లు బాలగోపాల స్మరణంబు జేసి, యీకృతి రచియించెద

---

1 'మనోజ్ఞుడగు కృష్ణుడు' అని భావము 'కలికి' అను విశేషణమునకు 'మనోజ్ఞమైన' అని యర్థము (చూ శబ్దరత్నాకరము, పుట 159)

2 'ఘనతరిగొండాధిపుని' అని ద్వితీయావిభక్త్యంతముగా ఉండదగును

### జలక్రీడా విలాసము

ద్విపద శ్రీ విఘ్ననాథుని — క్షేత్రపాలకుని
ఆ వనందుర్గను — హరుని, సద్గురుని
దలచుచు, పూయిష్ట — దైవతంబనగ
నలర మమ్మేలు చౌ — డాంబను గొలిచి
ఆ వరాహస్వామి — నా హయానమని
శ్రీవాణి నా విరిం — చిని, శ్రీవివాసు
నలమేలు మంగమ్మ — నలర నుతించి
లలి జలక్రీడావి — లాస సత్కృతిని
శృంగారముగ విర — చించి యుంజేటి
వెంగమాంబిక భక్తి — విశ్వాస మొదవ
శ్రీ తరిగొండ నృ — సింహుడనంగ
ఖ్యాతిగా వెలయు వేం — కట గిరీంద్రునకు
తనియ సమర్పింప — దలచె! తత్క్రమము
జమలెల్ల విను డతి — సంతోషముగను

## కథా ప్రారంభము

చిరమతియగు పరీ — క్షిన్నరేంద్రుండు
సురుచిరాత్మకుడైన — శుకునకు మ్రొక్కి
పరగ శ్రీ కృష్ణుని — బాల్యలీలలను
తిరమైన దయతోడ — దెలుపవే! యనిన
నా పార్థివేంద్రున — కా శుకుం డనియె
భూపాల! వినుమది — భూరి రాక్షసులు
జననాథులై పుట్టి — సాధు బాధలను
పనిబూని జేయ న — స్వావ కర్మలను
భరియింపలేక భూ — భామ చింతించి
సరసిజ భవున కా — చందంబు దెలుప
విని బ్రహ్మదేవుండు — విష్ణుదేవునకు
వినిపింప, నజున కా — విష్ణు డిట్లనియె

అనిమిషులను గోప — కావళిగాను
ఘనమునీంద్రులను గో — గణములుగాను
సురకాంతలను గోప — సుదతులుగాను
ధరణిపై బుట్టించు — తదనంతరమున
వారిలో ఘనుడైన — వసుదేవునకును
కూరిమితో నేను — కొడుకునై పుట్టి
అజుడ! భూభారంబు — నణతు పొమ్మనిన
త్రిజగంబులకు మేలు — దీపించె ననుచు
దేవతలను, మరి — దేవతాంగనల
పావనులైన తా — పసుల విధ్ధరను
అరసి గోపతులు, గో — పాంగనల్ గాను
కరమర్థి వెలయు గో — గణములు గాను
భూరి సాహసమున — బుట్టించె నజుడు
వారిలోగా యదు — వల్లభుండైన
శూరసేనుండను — సుస్థిరాత్మునకు
ధీరాత్ముడగు వసు — దేవుండు పుట్టి
మరికొన్నినాళ్లకు — మధురాపురమున
వరకన్యయైన దే — వకి బెండ్లియాడి
ముదమొప్ప రథమెక్కి — ముదితయు దాను
కదలిపోవుచు నుండ — గాను కంసుండు
వసుదేవు డుండిన — వరరథం బెక్కి
వసమించు వేడ్కతో — పలికె నిట్లనుచు

## కంసుడు రథము నడుపుట

### దర్వు, ఆది తాళం

నా చెల్లెలి కో వసుదేవా!
యా, నందముగా నో వసుదేవా!

రహిమీరగ నో వసుదేవా !
సా, రథ్యము జేసెద వసుదేవా ! 2

తరిగొండేశుడు వసుదేవా !
నాకు, దయ బుట్టించెను వసుదేవా ! 3

గీ. అనుచు కంసుడు బల్కగా విని ముదమున
పరగ వసుదేవు డిట్లనె భావ ! నీవు
రాజవై యుండి నాకు సారథ్య మిపుడు
చేయుదగదన్న, కంసుడు చెలగి పలికె

గీ నా సహోదరిపై ప్రేమ నాకు చాల
కలిగియున్నది గనుక, వేడ్కను రయమున
మీకు సారథ్య మొనరించి వేలువాడ
నగుదు. నరమర యేకేల ? యమల చరిత !

ద్విపద అని పూర్వసారథి — నావల ద్రోపి
కని వాని చేతి ప — గ్గంబు లందికొని
మొనకోల చేపట్టి — మొనసి గుర్రముల
పనిబూని రొప్పుచు — పటు తీవ్రగతిని
తరిగొండ హరి మెచ్చ — [త] న వేర్పులన్ని
నరులెన్న వసుదేవు — నకును జూపుచును

## దర్వు, ఆది తాళం

నడిపెను కంసుడు — నవ్వుచు రథమును ॥పల్లవి॥

కడువడిగా తుర — గముల దరుముచును ॥నడిపెను॥ ॥అ ప॥

సరవిని చెలియలు — సంతోషింపను
మరదికి వేడుక — మల్లడి గొనగను[1] ॥నడిపెను॥ 1

1 'పెనగొనగా' (మా శ ర పుట 608)

రాజసమతి దూ — ర్ణముగా నురుకగ
పూజిత సాత్త్విక — బుద్ధి చెలంగగ ॥నడిపెను॥ 2

తరిగొండనృకే — సరి తమ మ్రింగుట
యరి మురి[1] వెరుగక — యలరుచు నచ్చట ॥నడిపెను॥ 3

క. ఈరీతి జెలగి కంసుడు
సారథ్యము జేయుచున్న సమయమునందే
కారణమును భావింపుచు
వారక యావేళ గగనవా ణిట్లనియెన్

## అశరీరి పల్కులు

### ఏలలు

ఓరీ వోరీ! వీకూ చేటు — మీరీ వచ్చే దెరుగాలేకా
తేరూ దోలూచున్నావేమిరా? వోకంసాభూపా!
— తెలివి నీవూ గలిగీ బ్రతుకూరా! 1

యిలలో నీ దేవకి గన్నా — యెనిమిదోవాడూ, నీప్రాణ
ములనూ వేగా నపహారించురా! వోకంసాభూపా!
— ముచ్చాట నీ కింకా నేలారా? 2

చెలగీ తారిగొండానారా — సింహుతోడై నే దబ్బారా
పలుకాలే దీ మాటా నిజమేరా! వోకంసాభూపా!
— బ్రతుకూ నీ కీమీదా లేదురా! 3

గీ. అనుచు నశరీరి తన కపు డాప్తముగను
పలుకగా విని కంసభూపతి భయంబు
నొంది, దేవకి విరికొప్పు నాడిసి పట్టి
కత్తి ఝళిపించి గొంతుపై కదియనుంచె

---

1 'తొందరపాటువలన' అని యర్థము (చూ ఆంధ్రవాచస్పత్యము, ప్రథమ భాగము, పుట 127)

వ అప్పుడు గడగడ వడంకుచున్న దేవకికి వసుదేవు డడ్డంబు వచ్చి, కంసుని చేతి కత్తి బిగబట్టి యిట్లనుచున్నాడు

## దర్వు, ఆది తాళం

ఇది నీ చెల్లెలు భోజేంద్రా!
నీ, విటు జంపుదువే భోజేంద్రా ? 1

నీ క్షేమమువే భోజేంద్రా!
యిది, నిరతము గోరును భోజేంద్రా! 2

తరిగొండేశుడు భోజేంద్రా!
యీ, తగవును మెచ్చడు భోజేంద్రా! 3

ద్విపద ఓ కంసభూప! నే — నొక్క సామెతను
నీకు జెప్పెద విను — నీ, వదెట్లనిన
కాకోదరాస్యల — గ్నంబైన కప్ప
యాకలిచే చెంత — వరిగెడు తుట్టె
పులుగును[1] దా మ్రింగ — బోయెడు వేళ
బలిమిచేతను పాము — పట్టి మ్రింగినను
తానందె మృతినొంది — తర్లిన మాడ్కి
మానవు డత్యంత — మదయుక్తుడగుచు
తనకన్న బలమందు — తక్కువలైన[2]
మనుజాని ద్రుంచి లా — మనియెద ననెడి
సన్నాహ మొనరించు — సమయంబువండె
తన్నె మ్రింగును కాల — దందశూకంబు
కావున నీ కాల — గతి గానరాదు
వావి చెల్లెలు బిడ్డ — వలెనుండు నబల

1 గుంపుగా కూడియుండు, రెక్కలుగల చిన్నపురుగులలో నొకటి

2 తక్కువయైన — అను ఏకవచనమునకు మారుగ బహువచన ప్రయోగ విశేషము

నీ మేలునే కోరు — నీ కీడు గోర
దీ ముగ్ధ నిపుడు నీ — వేల ద్రుంచెదవు ?
ఈ కామినీ మణి — యెనిమిదో చూలు
నీకు మృత్యువటంచు — నీవు భీతిలకు
మిలమీద నిది గన్న — యెనిమిదో సుతుని
నళుక కిచ్చెద పుట్టి — నప్పుడె ద్రుంపు
మడరార తరిగొండ — హరితోడె భీతి
పడుచున్న దీని ద్రుం — పకుము భోజేంద్ర !

(వ అనిన విని వసుదేవునితో కంసు డిట్లు పల్కుచున్నాడు ')

క నిను వసుదేవుడ ! దీనికి
జనియించిన సుతులనెల్ల జంపుటకై, పు
ట్టిన యప్పుడె నా కిచ్చెద
నని చెప్పిన దీని విడుతు ననఘచరిత్రా !

(వ అనిన విని వసుదేవు డిట్లను చున్నాడు )

గీ పుట్టినటువంటి బిడ్డల పురిటితోనె
నేను నీచేతి కిచ్చెద, నేడు దీని
విడువుమన్నను, దేవకిన్ విడిచి కంస
భూవరుం డేగె, సతి గూడి పోయె శౌరి

## దేవకీవసుదేవుల చెర

ద్విపద. పూని కొన్నాళ్ల కా — భోజకులేంద్రు
డానక దుందుభి — నడర దేవకిని
మరచి తా నుండక — మధురాపురమున
చెర బెట్టియుండె న — చ్చిక దలంపకను

ఆమీద దేవకి — కార్గురు సుతులు
భూమిపై వరుసగా — బుట్టిన యపుడె
గని వసుదేవుండు — కంసభూపతికి
మొనసి యిచ్చిన, వాడు — మూర్ఖుడై ద్రుంచె
అనఘ సప్తమగర్భ — మందు శేషుండు
మొనపి దేవకియందు — ముదమొందు తరివి
చెదరని హరి యాజ్ఞ — చే యోగమాయ
కదిసి యాదేవకి — గర్భస్థమైన
ఘనతరతేజము — గైకొని పోయి
మొదసి రోహిణి గర్భ — మున నుంతుగాక।
యని విశ్వయింపుచు — నద్భుతంబుగను
మనము రంజిల మహీ — మండలంబునకు

## దరువు

మాయ వచ్చెనూ, విష్ణు — మాయ వచ్చెనూ ॥పల్లవి॥

ఘనతోయజనా — భుని యాజ్ఞ తొలగక
శిరసావహించి ॥మాయవచ్చెమా॥ ॥ఉ.ప॥

దేవకి గర్భమునందు — దీపించే శేషుని తేజ
మావేళ రోహిణిగర్భ — మందుంచెదనంచు సొంచి ॥మాయ॥ 1

శివము, నద్వైతము, నిర్వి — శేషమైన బ్రహ్మమందు
సంతోషాశ్చర్యమును[1] వి — స్తారముగా గల్పించిన ॥మాయ॥ 2

వన్నుగాద్రిమీద నిల్చి — ప్రజలనెల్ల రక్షింపుచు
నన్నేలిన తరిగొండ — నరహరి కథీన యగుచు ॥మాయ॥ 3

గీ వెలయు నీరీతి వచ్చిన విష్ణుమాయ
దేవకీ గర్భమందున్న తేజ మొడిసి ।

---

1. సంతోషముతో గూడిన ఆశ్చర్యము

పట్టి, రోహిణికుక్షిలో బెట్టి చనియె
కడుపు బళువైన రోహిణి జడిసి భ్రమసె

ద్విపద అప్పుడా రోహిణి — యాశ్చర్యమంది
తెప్పున పిండంబు — తేరకు వచ్చె
నేడు నా కడుపులో — నిలుచు టేమనుచు
చేడెలనెల్ల నీ — చిత్రంబు నడిగి
తెలిసికోవలెనంచు — దిగులుతో లేచి
చెలి నొక్క దానిని — జీరి యిట్లనియె

### దర్వు, ఆది తాళం

ఈ వింతలేమె ? నోయమ్మా !
నాకు, నీవైన దెల్పు మోయమ్మా ! ॥పల్లవి॥

పురుషుడు మధురా — పురమున నుండగ
గరిమను తేరకు — గర్భము నిలిచిన ॥ది నింత॥ 1

పరగ కడుపులో — పర్వత ముండిన
కరణి మన్న దిదె — క్కడి గర్భంబిది ! ॥ఈ వింత॥ 2

తరిగొండ నృకే — సరియగు వేంకట
గిరిపతి నాకెటు — కీర్తి నొసగునో ? ॥ఈ వింత॥ 3

క అన విని యాచెలి యిట్లనె
ననఘపతివ్రతవటంచు నందరు ధరలో
నిను మెచ్చుదు రళుకేలను ?
తనయుని నీ కిచ్చెనేమొ దైవము తరుణీ !

## బలరాముడు జన్మించుట

ద్విపద అని యిట్లు చెలి పల్కు — నవల వింతగను
ఘనతరధావళ్య — కాంతులతోడ

బలముతో తగు దీర్ఘ — బాహులతోడ
వలనైన సుందర — వదనంబుతోడ
కళల నొప్పెడి గొప్ప — కన్నులతోడ
తళుకైన నీలకుం — తలపంక్తితోడ
సుతు డుదయించిన — జూచి యా భామ
హితమొప్ప చేతుల — నెత్తి, సంతోష
కలితాత్మయగుచు వేం — కట గిరీశ్వరుని
తలచి, యా తరిగొండ — ధాముని మదిని
భావించి మ్రొక్కి, నా — పట్టిని మీరు
బ్రోవరే! యని భక్తి — పొసగ నిట్లనియె

### దర్వు, ఆది తాళం

గొడ్డురాలనగుచు నేను — గోడు గుడుచుచుండగాను
బిడ్డను నా కిచ్చినాడు — బిసరుహాక్షుడూ 1
దేవళ్లంద రిటకు వచ్చి — దీర్ఘాయువు గలిగి సుతుడు
జీవింపుచు నుండుట కా — శీర్వదింపుడీ! 2
తరిగొండ నివేశ! శేష — గిరివాసా! నా కొడుకును మీ
రరమర జేయక కావు — డయ్యా! మ్రొక్కెనూ 3

గీ అనుచు దేవళ్ల ప్రార్థించి, యాదరించి
యొనర రోహిణి సుతు సాకుచుండె. నంత
విష్ణుతేజంబు దేవకీ విమలగర్భ
గోళమున జేరె కంసుని గూల్పదలచి

## దేవకి గర్భచిహ్నములు

ద్విపద ఆ రీతి దేవకి — యమల గర్భమున
నారాయణస్వామి - వవ్యతేజంబు
వలనుగా నిల్చె. దే — వకి కటు మీద
తలకొని యోకిలిం — తలు బుట్ట సాగె

వరముఖాబ్జము పొందు — వర్ణమై యొప్పె
దరనిభ కంఠమం — తయు పన్నమయ్యె
మును కొని కుచకుంభ — ములు పొదిలించె[1]
మొనసి యంత తదగ్ర — ముల నల్పు మించె
తను మధ్య మంతకం — తకు స్థూలమయ్యె
పెనుపొందు నాభి గం — భీరమై మెరసె
చాల కటిప్రదే — శము వృద్ధి బొందె
ప్రాలుమారిక బుట్టె — పరగ నానాట
నిదురయందును రక్తి — నిరతంబు గల్గె
నదిగాక మృద్భక్ష — ణానక్తి చెలగె
అన్నోదకము లస — హ్యంబులై తోచె
పన్నుగా కవులతో — బడలికె విలచె
ఆతతంబుగ కోర్కె — లధికంబులయ్యె
నూతన కాంతి మే — నున నిండియుండె
కరమొప్పు నిటువంటి — గర్భచిహ్నంబు
లరసి దేవకి మది — నచ్చెరువంది
లోగుచు చెరసాల — లోమండి వచ్చి
వేగ నీవల చెలిన్ — వీక్షించి పలికె

## దర్వు, ఆది తాళం

ఓయమ్మలార యేమమ్మ ? ॥పల్లవి॥
విను ఓయద్భుతంబు నేమమ్మ ? ॥వోయమ్మ॥ ॥ఉ ప.॥

కాంతిగ సప్తమ — గర్భమ విలచెమ
వింతగ మాయై — నెడలి చనియె మును ॥వోయమ్మ॥ 1

అలరారగ నిపు — డష్టమ గర్భము
నిలిచెను కంసుడు — నిగుడెటు జేసునొ ?[2] ॥వోయమ్మ॥ 2

---

1 ఇది 'పొదలించెన్' అను క్రియయొక్క వ్యావహారిక రూపము 'వర్ధిల్లెను' అని దీని భావము (చూ శ ర పుట 526)

2 'నిగుడి + ఎటుజేసునొ ?' అని విభజనము

గురుతర వేంకట — గిరి నిలయుండగు
తరిగొండాధీ — శ్వరు డెటు బ్రోచునో? హోయమ్మ॥ 3

క అని దేవకి చింతింపగ
వనజజ శంకర మునీంద్ర వాసవముఖ్యుల్
చనుదెంచి, దేవకీ సతి
ఘనగర్భమునందు వెల్గు కమలదళాక్షున్

వ తమ మానసంబుల భావించి మ్రొక్కి, అనేక ప్రకారంబుల వినుతించి, మరిన్నిట్లనుచున్నారు

## బ్రహ్మాదుల ప్రార్థన

శ్లో॥ సత్యం జ్ఞాన మఖండరూప మమలం చక్రాయుధం శ్రీకరం
నిత్యం నిర్గుణ మవ్యయం నిరుపమం నిర్వాణబోధప్రదం।
ప్రత్యక్షానుభవామృతం సుఖకరం పాపాద్రివజ్రాయుధం
దైత్యారిం తరిగొండశేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥

గీ దేవకీదేవి గర్భమందే నుదరమున
నొదిగియుండగనేలనే ?[1] యుర్విమీద
నీవు జనియించి మము బ్రోవు నీరజాక్ష!
యనుచు ప్రార్థించి, దేవకి నాదరించి

### జంపె

పలికి రిట్లనుచు నో — భామ దేవకి! నీవు
కలగ నేమిటికి? నీ — గర్భంబునందూ 1

1 ఈ సంబోధనము ఆప్యాయతను సూచించును త్యాగరాజు ఇష్టదైవమగు శ్రీరాముని ఒకానొక కీర్తనలో "మరచితే ఏమిసేతునే? ఓ రాఘవ!" అని ఇట్లే చనువుతో సంబోధించియున్నాడు (చూ 'త్యాగరాజకీర్తనలు', మొదటికూర్పు, పుట 25, సంపాదకుడు — విస్సా అప్పారావు)

విశ్వగర్భుడు జేరి — వృద్ధియగుచున్నాడు
శాశ్వతుండై యెల్లి — జనియించు నతడూ 2
తరిగొండహరి మిమ్ము — దయను రక్షించు నిక
వెరువవద్దని వారు — వీడుకొని చనిరి 3

## శ్రీకృష్ణ జననము

ద్విపద అపుడు పరబ్రహ్మ — మైన విష్ణుండు
కపట రాక్షస గణ — కంఠీరవుండు
శ్రీ పన్నగాచల — శిఖరవాసుండు
నాపాలి తరిగొండ — నారసింహుండు
గణనాధిక ప్రభా — కలితమై, దివ్య
మణిమయంబగు హేమ — మకుటంబుతోడ
అలకల నొప్పు ఫా — లార్ధాబ్జుతోడ[1]
తళుకైన భ్రూలతా — ద్వంద్వంబుతోడ
విమలామృత కటాక్ష — వీక్షలతోడ
కమనీయమగు టెక్కు — గల నాసతోడ
దళమైన కెంజాయ — దగు మోవితోడ
ధళధళ వెలిగెడి - దంతాళితోడ
చందంబు గులికించు — హాసంబుతోడ
ఐందవ బింబోప — మాస్యంబుతోడ
మకరరత్న కుండల — యుగళంబుతోడ
సిరుల జొంపము లీను - చెక్కిళ్లతోడ
దర సుదర్శన గదా — తామరసముల
ధరియించు పటుచతు — ర్బాహులతోడ
ఘనకౌస్తుభాంచిత కంఠంబుతోడ
వనమాలికాహార — వరంబుతోడ

1 'ఫాలమునెడు అర్ధచంద్రునితో' అనగా 'అర్ధచంద్రునివలె అందమైన నొసటితో' నని భావము

వనధిజ కిరవైన — వక్షంబుతోడ
వనద ఎంకాశమౌ — వర్ణంబుతోడ
అపరిమితాబ్జభ — వాండంబు లొప్ప
నుపమింప సూక్ష్మమౌ — నుదరంబుతోడ
ఘనుడైన హాటక — గర్భున కనిక
మునికియౌ నాభి — పయోజంబుతోడ
నాదిత్య విభమేఖ — లావృత దివ్య
దేదీప్యమాన దీ — ధితి కటితోడ
భూరి తటిల్లతా — పుంజవిస్ఫూర్తి
వారించు కాంచన — వసనంబుతోడ
మరకత స్తంభ స — మానమై చాల
నొరపు గల్గిన యూరు — యుగళంబుతోడ
వారిధి కన్యకా — వరహస్తయుగళ
సారోపచరిత స — జ్జంఘులతోడ
నార్తరక్షణ బిరు — దాంకంబు లగుచు
స్ఫూర్తితో మ్రోయు మా — పురములతోడ
నిగమాంత వీధుల — నిరతంబు దిరుగ
దగియున్న పాద ప — ద్మంబులతోడ
మొనసి వామాంగుష్ఠ — మున సంతతంబు
దనరుచున్నట్టి మం — దాకినితోడ
శతకోటి మన్మథ — సౌందర్య ధుర్య
వితతి విభ్రమమూర్తి — విభవంబుతోడ
వారాధ కోట చం — ద్రార్కహుతాశ
తారాతటిత్ప్రభా — తతులకు మూల
కారణమైన ప్ర — కాశంబుతోడ
ధీరుడై దేవకి — దేవి గర్భమున
అలర శ్రావణ బహు — ళాష్టమి నాడు
నలువొప్ప రోహిణి — నక్షత్రమందు
పగము రాతిరి వేళ — సంపూర్ణ కళల
జగదీశు డుదయించె — జగతీతలమున

# దేవతల ఆనందము – ప్రార్థన

[illegible] ఆ సమయంబున దేవతలు భేరులు మ్రోయించి, కుసుమ వర్షంబులు గురియించి, జయ జయ శబ్దంబులు జేసి, రంభ దేవతా స్త్రీలు తమలో దా మిట్లనుచున్నారు

## దరువు, ఆది తాళం

విష్ణుదేవుడు బుట్టెనమ్మా ।
వసుదేవు నింట, విష్ణుదేవుడు బుట్టెనమ్మా । ॥పల్లవి॥

జిష్ణు ముఖామర సేవితుడై వ – ర్తిష్ణుండగుచును
దేవకి కడుపున, విష్ణు – దేవుడు బుట్టెనమ్మా । ॥అ ప ॥

దర చక్ర గద సారసములూ నాలు చేతుల
ధరియించి, మకర కుండలములూ
తరచుగ గండ – స్థలముల వెలుగ
మరుమణిహారము – లురమున మెరయగ ॥విష్ణు॥ 1

నీల జలద వర్ణము తోనూ, విలసిత కనక
చేలకాంతు లుప్పొంగగానూ
మెలగు మకుటము – మీరట వలగొని
పూల సరంబులు – భుజముల నొరయగ ॥విష్ణు॥ 2

తరిగొండ నారసింహుడైన శేషాద్రి నిదుడు
చిరతర బ్రహ్మానందమున
దొరకొని కుజనుల – దురునాడుచు వరుసగ
సరవిని సుజనుల - సంరక్షింపను ॥విష్ణు॥ 3

౬ అని యిట్లు దేవతాస్త్రీలు సంతసింపుచున్న సమయంబున దేవతలు ఇట్లనుచున్నారు

దరువు

విజయీభవా జయ — విజయీభవా
జయ విజయీభవా — దిగ్విజయీభవా ॥పల్లవి॥

అజ రుద్ర నందిత పా — దారవింద ! ముకుంద !
సుజన మందార ! స్వామి ! — విజయీభవా ॥విజ॥ 1

కారుణ్యరసపారా — వార ! వికారదూర !
వీరశేఖర ! స్వామి ! — విజయీభవా ॥విజ॥ 2

సలలిత తరిగొండ — నిలయ ! శేషాచలేశ !
విలసిత చరిత ! స్వామి ! — విజయీభవా ॥విజ॥ 3

దరువు

బహుపరాకురా ! హెచ్చరికె బహుపరాకురా !
హెచ్చరికె బహుపరాకురా ! హెచ్చరికె బహుపరాకురా ! ॥పల్లవి॥

శ్రీలలనాలోల ! విశ్వమూల ! — కాలాతీత ! మమ్ము
పాలించు హెచ్చరికె స్వామీ ! — బహుపరాకురా ! ॥బహు॥ 1

పరమ సాధువుల గొట్టి — బాధించే కంసుని బట్టి
పరిమార్చు హెచ్చరికె స్వామీ ! — బహుపరాకురా ! ॥బహు॥ 2

అభయ మిచ్చి, తరిగొండ — హరి ! భూభార మణగించి మా
ప్రభ నిల్పు హెచ్చరికె స్వామీ ! — బహుపరాకురా ! ॥బహు॥ 3

వ అని యిట్లు దేవతలు ప్రార్థింపుచున్న సమయంబున వసుదేవుం డిట్లను చున్నాడు

## దేవకీవసుదేవుల వినుతి

శ్లో॥ శ్రీ నారాయణ మాత్మమూల మనఘం శ్రీవత్సవక్షస్స్థలం
నానాస్థావర జంగమాత్మక జగన్నాధం ప్రధానాశ్రయం।
ధ్యానధ్యేయ మచింత్య మద్వయపదం ధర్మస్వరూపం, సుపూ
ర్ణానందం తరిగొండ శేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥

వ అని యిట్లు వసుదేవుడు వినుతింపుచున్న సమయంబున దేవకి యిట్లనుచున్నది

## చూర్ణిక

శ్రీమదఖిలస్థావర జంగమాత్మక ప్రపంచ హేయ గుణాకార సముదయాతీత స్వయంప్రకాశం, ఘోరతర కలికలుషనాశం
అపరిమిత సుందర సుకుమార నవయౌవనా లంకృత స్వశరీర విజిత శతకోటి మన్మథ ధనం, సత్య ధర్మక్షాత్ర సదనం
సకల విశ్వ సర్జన కారణ పరాది జ్ఞానేచ్ఛాక్రియాశక్తి ప్రముఖానేక ప్రబల శక్తి సమేతం, నిఖిల నిగమాంత నిర్ణీతం
బహు విచిత్ర మాయా వినిర్మిత బ్రహ్మాండ భాండ బృంద భరితానంత శరీరం, సచ్చిదానందసారం
అనేక జన్మ పుణ్య పరిపాక జ్ఞాన భక్తి ప్రకాశాతిశయ పరమ భాగవత జనపరివృత శేషశైలాగ్ర నివేశం, తరిగొండ పురవరాధీశం లక్ష్మీనృగేశం భజేఽహం, భజేఽహం, భజేఽహం

శ్లో॥ సంతాపాంబుధిబాడబం సురుచిరస్వాంతం జగత్కారణం
శాంతం స్వచ్ఛ మమేయ మాద్య మమలం జాంబూనదాభాంబరం।
క్షాంతం భవ్యసుఖాశ్రయం శుభకరం సంసారభూజచ్ఛిదం
దాంతం శ్రీ తరిగొండ శేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥

వ అని దేవకీ వసుదేవులు మరిన్నిట్లనుచున్నారు

ద్విపద శ్రీకమలాలోల! — జితదైత్యజాల!
నీకతో విమము మా — విన్నపం బొకటి
యాకాశవాణి నా — డాడిన మాట
కా కంసు డులికి, క్రూ — రాత్ముడై మమ్ము
చెరబెట్టి, పుట్టిన — చిన్న బిడ్డలను
పొరిగొనె నందుచే — పుత్రశోకమున

పొరలుచుండఁగ, మాకు — పుత్రుండవగుచు
హరి నీవు బుట్టితి — వానంద మొదవ
కంసు విప్పుడు బట్టి — ఖండించి మాకు
హింస దప్పింపవే — యిందిరాధీశ!
యన విని తరిగొండ — హరి వారి గాంచి
యెనసిన దయతోడ — నిట్లని పలికె

## ఊరడింపు

తలిదండ్రులార! యో — ధన్యాత్ములార!
విలసితమతులార! — వినుఁడొక్కమాట
మగటిమి మీర నా — మహిమంబు జూప
తగదిపు డెట్లన్న — దప్పక వినుఁడి!
ఈ కంసుడను నీచు — నిలమీఁద గూల్ప
నాకు కాలముగాదు, — నాటనుండియును
చెరబెట్టి మిమ్ము హిం — సించిన కంసు
డరిపురి తెగు కాల — మతివేగ మొదవు
దసర నందాక నే — తాళక యిపుడె
చెనకిన, కార్యంబు — చెడిపోవు గనుక
ఇన్నినా ళ్ళోర్చితి, — రిక కొన్నినాళ్ళ
సన్నుగా నోర్పుడీ! — పదర[1] నేమిటికి?
తక్కక నను పర — స్థలమందు జేర్చి
యిక్కడ మీరుండు, — డిక కొన్నినాళ్ళ
ఒరిగిన వెనుక ని — చ్చటికి నచ్చెదను
వెరువవద్దనుచు శ్రీ — వేంకటశైల
పతియైన తరిగొండ — పట్టణాధిపుడు
హితము జెప్పుచు మరి — న్నిట్లని పలికె

1 పదరు — త్వరపడు (చూ. శ.ర. పుట 463)

నాదరం బెనగ నే — నప్పుడు — మీకు
వసుధపై బుట్టితి — వామనుండనగ
ససదృశ లీలతో — నది నా ద్వితీయ
జననంబు మూఁడవ — సారి మీ కిచట
తనయుడనైతి, తొ - ల్తను మూడుమార్లు
కొడుకు నిమ్మని మీరు — కోరి పల్కితిరి
పుడమి తత్కారణం — బున మూడు మార్లు
నెనరుతో మీయందు — నేను బుట్టితిని
ఎవసి తద్వృత్తాంత — మిప్పుడు మీరు
నెరుగ జెప్పితి బుట్ట — నింక నెన్నటికి
నరుదుగా తరిగొండ — హరినైన నన్ను
తనయుండనుచు మీరు — దలపుచుమండి
ఘనతరమైన మో — క్షము బొందు డనిన
విని దేవకీదేవి — వెరగు నొందుచును
దనుజారి నీక్షించి — తగ నిట్టు లనియె

పరగ బ్రహ్మాండ తతుల గర్భమున దాచి
బ్రహ్మలను గాంచి పెంచి, ప్రపంచమెల్ల
పాలనము జేయుచుండెడ పరమపురుష !
యెుఱిగి నాగర్భమం దెట్టులుంటి వీశ ?

అని దేవకీ(దేవి) వెరగు నొందుచున్న సమయంబున వసుదేవుం డిట్లను చున్నాడు

ఆకాశవాణి మాటల
కా కంసుం డులికి, పుట్టినప్పుడె నిను దా
జేకొని శిక్షించెదనను
నీ కష్టము బాయు టెట్టు ? లీశ్వర ! చెపుమా

(అని చింతించుచున్న తండ్రితో శ్రీకృష్ణుం డిట్లనుచున్నాడు )

## ఉపాయము

ఆ.వె. వినుము తండ్రి! యొక్కవెంవు జెప్పెద మంద[1]
యందు నందుభామ యాడు శిశువు
నొనర గాంచు, నచటి కుపమగా[2] నను జేర్చి
యచటి యాడు శిశువు నిచట జేర్చు

ద్విపద అన విని వసుదేవు — డంగీకరించె
ననువంద దేవకి — హరి కిట్లులనియె
వనజాక్ష! నిన్ను స — ర్వముని ప్రముఖులు
కనుగొంటిమందురు — గాని, యీదివ్య
తనువు గానగలేరు — తన్మూర్తి నిపుడు
కనుగొంటి మానసం — కలితదృష్టులను
కనజాల నిక కృపా — కందివై యిచట
నొనరిన నీమూర్తి — నుపసంహరించి
మనుజ బాలకుడవై — మమ్ముద్ధరింపు
మన విని తరిగొండ — వారి వేడ్క నపుడు

### దర్వు, ఆది తాళం

శ్రీనారాయణుడు తిరో — ధాన మొందెనూ ॥పల్లవి॥
పూని తల్లిదండ్రు లపుడు — పులుకు పులుకున[3] జూడగా
శ్రీనారాయణుడు తిరో — ధాన మొందెనూ ॥అ.ప.॥
తల్లిదండ్రులకు బాగ — నుల్లాసముజేసి వేగ ॥శ్రీనారా॥ 1
తక్కక నందుండి లేచి — తన దివ్యరూపము దాచి ॥శ్రీనారా॥ 2
తరిగొండ నరకేసరి — వరశేషాచలవిహారి ॥శ్రీనారా॥ 3

---

1 'మంద' యనగా వ్రేపల్లె ఆవులమంద లుండు చోటు గావున 'మంద' యనబడినది '[illegible]' అనునది దీనికి సమానమైన సాంస్కృతికరూపము
2 ఉపమ = ఉపాయము (సూ. శ. ర. పుట 90)
3 'కనురెప్పలను పలుమారు త్వరత్వరగా మూసి తెరచుచు' అని భావము

గీ ఇటు తిరోధానమొంది లక్ష్మీశ్వరుండు
చిన్ని ముద్దుల పాపడై చేతు లెత్తి
తన్ను గానక చింతించు తల్లిదండ్రి
ముందరను నేల వ్రాలి సమ్మోద మొందవ

గీ కావు కావున నేడ్చుచు కనులు దెరచి
చూడ, దేవకి సుతుమోము జూచి వగచి
మంద కంపింపజాలక కుంది, శిశువు
నెత్తికొని ముద్దులాడుచు నిట్టు లనియె

### దర్వు, ఆది తాళం

నిన్ను మంద కెట్లంపింతు — నీలవర్ణా!
య్యా, చన్నుబా లెవ్వారికిత్తు — సత్యపూర్ణా!
ఆరుగురు సుతుల కంసు — డణచె నన్నా!
ని, న్నారకె కన్నుల జూచు — చుండె నన్నా!
తరిగొండ నారసింహుని — దయతో నన్నా!
నీవు, తిరముగా భూమిపై న — ర్ధిల్లుమన్నా!

క అని కొడుకును దీవింపుచు
తన పెనిమిటి చేతి కిచ్చి 'తడయక చను నీ'
వనగా, వసుదేవుండా
తనయుని చేపట్టి జరుగుతరి ముదమొప్పన్

ఆ వె మందలో యశోద మగువను గని మేను
మరచియుండె యోగమాయచేత
నట్టి సగము రాత్రి నానకదుందుభి
జరిగి జరిగి పోవు సమయమందు

ద్విపద సరగున వసుదేవు — సంకెల లూడె
మరి చన యమున దా — మార్గంబు నిచ్చె
నందున వసుదేవు — డా ముద్దు సుతుని

మందకు గొనిపోయి — మాయగా నందు
కొమ్మముందర తన — కొడుకును బెట్టి
యవమాయ యను బాల — నపుడు గ్రహించి
క్రమ్మర మధురకు — గ్రక్కున వచ్చి
సమ్మతిగా తన - సతి చేలి కొనర
ప్రేమతో నయ్యాడు - బిడ్డ నందించె
నావిధ నచ్చట నయ్యాడు శిశువు
కావు కావున నేడ్వ — గా వేగ లేచి
కావలివారలా — కంస భూపతికి
చెప్పిన భీతిల్లి — చెచ్చెర లేచి
కప్పరపాటున[1] — ఖడ్గంబు బెరికి
సరభసంబున మించి — ఝుళిపించికొనుచు
పరగ దేవకి యున్న — భవనంబునకును

## కాలకంసుడు

### దర్వు, ఆది తాళం

కంసుడు వచ్చెనూ, కాలా — కంసుడు వచ్చెనూ ॥పల్లవి॥
జీవహింస జేయుటకు మదిలో — నించుక
వెరువక యుండే ॥కంసుడు వచ్చెనూ॥ ॥అ ప॥

కోరమీసము దీడుకుంట[2] — గుడ్లు బిక్కరించుకుంట[3]
శూరుడై దేవకియున్న — సూతికా గృహములోకి ॥కంసుడు॥ 1

తల విరియ బోసుకొని - దాక్షిణ్యమంతయు మాని
చెలియలి బిడ్డను పూని — శిక్షించేను విడువనని ॥కంసుడు॥ 2

---

1 కప్పరపాటు సంభ్రమము (చూ శ ర పుట 149)

2 ఇది 'తీడుకొనుచు' అను అసమాపకక్రియయొక్క వ్యావహారిక రూపము
తీడు = వాడిచేయు (చూ శ ర పుట 350)

3 ఇది 'బిక్కరించుకొనుచు' అను అసమాపకక్రియకు వ్యావహారిక రూపము

తరిగొండవాసుడు శేష — గిరిధాము డడ్డము వచ్చి
విరివిగా వర్ధన్నగాను — విడువ వింక శిశువునాని ॥కంసుడు॥ 3

వ (అప్పుడు) కంసుండు దేవకితో నిట్లనుచున్నాడు

ద్విపద ఓ దేవకీదేవి! యొనర నీ విచట
నాదరంబుగ గాంచి — నట్టి డింభకుని
తెప్పున బట్టి నే — తెగటార్పవలయు
నిప్పుడు నిల్వరా — దెంతైనగాని
ధరణిపై నీ సహో — దరుని, కోపమున
పొరిగొన బుట్టిన — పుత్రుని మీద
నీకు మోహంబేల? — నెనరెల్ల మాని
నీ కొడుకును దెమ్మ — నేను (దుంచెదను
అడరార తరిగొండ - హరి యడ్డమైన
విడువను తే తెమ్మ — వేగ డింభకుని

వ అనిన విని దేవకిదేవి బిడ్డ నెత్తుకొని కంసునితో నిట్లనుచున్నది

## దర్వు, ఆది తాళం

అన్నా! యీ శిశువు ఆడదిరా! ॥పల్లవి॥
సంపన్నా! నిను జంపదు గదరా! ॥ఉ ప ॥
మగవాడైనను — పగమీరగ నిను
తెగజూచీనని — దిగులుపడందగు ॥నన్నా॥ 1
సారెకు కత్తిని — ఝళిపించిన, మది
నారటమైనది — యకటా! (దుంపకు ॥మన్నా॥ 2
తరిగొండనృకే — సరి తోడే![1] యీ
వరసుత నిప్పుడు — వధియింపక పో ॥వన్నా॥ 3

---

1 'తరిగొండ నృకేసరి తోడు' గా అనగా 'తరిగొండ నృకేసరి మీాది ఒట్టు'గా వధియింపక పొమ్మని తాత్పర్యము

వ (అప్పుడు కంసుం డిట్లనుచున్నాడు )

గీ ఉవిద ! యష్టమ గర్భమం దుదితమైన
పురుషుడే గాని, స్త్రీగాని భూమిమీద
నేల మననిత్తు ? నిపుడు నేనేల ఎడుతు ?
నెమ్మదిగ బిడ్డ నిక బట్టి తెమ్ము తెమ్ము.

వ (అనిన దేవకి యిట్లనుచున్నది )

గీ కొడుకులకు నోచనైతి. నీ కూతునైన
నేను సాకెద నియ్యరా ! నెనరు మీర
మేనకోడలు గావున దీనిమీద
నలుగవద్దన్న ! మ్రొక్కెదనన్న ! విడువు

వ అనిన విని కంసుండు కోపాటోపంబున దేవకిని గదిమి, శిశువును నాచికొని[1] గగనంబున కెగురవైచి కత్తియొడ్డి చూచుచుండగా, ఆ శిశు వంతరిక్షంబున కెగసి కంసునితో నిట్లనుచున్నది

## యోగమాయ పల్కులు

### ఏలలు

క్రూరాగుణమూ విడువాలేక — ఘోరాసాపాపమూలు జేసి
మీరీ గర్వించీనావేమిరా ? వోరోరి కంసా !
— మేలు నీ కీమీదా లేదురా ! 1

తనువూ నిజమూ గాదనుచూ — తుచీ శాంతి బొందాలేక
చెనటీవాడా వైతీవేమిరా ? వోరోరి కంసా !
— శిశువూలా ఖండించేవేమిరా ? 2

1 అపహరించి (చూ శర పుట 420)

కారాణా మున్నరీతిని కార్యాము బుట్టా వనుచూ
ధీరాతా నుండరాదేమిరా ? వోరోరి కంసా !

— దిగులు పడితే తీరూనేమిరా ?

తల్లాడింపూచుండాగా నీ — చెల్లెలు గన్నా బిడ్డాలా
నెల్లా వధించీనాదేలారా ?[1] వోరోరి కంసా !

— యేమి ఫలమూ నీకూ వచ్చెరా ?

వరశేషాద్రీ నిలయూడైన — తారిగొండా నారాసింహుడూ
ధరను నిన్నూ విడువానీడురా ! వారోరి కంసా !

— దైవకృతమూ దప్పూనేమిరా ?

ద్విపద ఓరోరి కంస ! యో — రోరి పాపాత్మ !
తేరకె పూర్వమీా — దేవకీసుతుల
చంపితి నిటు నన్ను — జంపబూనితివి
తెంపరివై నిన్ను — తెగటార్చు దాన
గాను నిన్ జంపెడి — ఘనుడు నాతోడ
తాను జనించి ము — దంబుతో నొక్క
చోట నున్నాడని — సూటిగా బలికి
ధాటిగా నమ్మహో — ద్ధతయైన శక్తి
భరితాష్ట దోర్దండ — భాస్వర యగుచు
నురి యందు నిలువక — మాయగా నెగసి
సురసిద్ధ చారణా — సురకిన్నరాదు
లరుదైన కానుక — లర్పించి పొగడ
బహురూపనామ వి — భ్రాజిత యగుచు
మహితగుణంబుల — మాన్యయై వెలసి
తరిగొండనృహరి పో — దరి యను కీర్తి
నురుముదంబున బొందు — చుండె నిద్ధరను

---

1 'వధించినది ఏలరా ?' అని విభజనము

వ అప్పుడు కంసుండు తేరకు దేవకి బిడ్డలను చంపితినని వగచి, దేవకీ వసు దేవులతో నిట్లనుచున్నాడు

గీ బయులు మాటలు నమ్మి మీ బాలకులను
ఱంపుటకు మీరు వచ్చు కోపింపవలదు
కారణంబున్న గతి బుట్టె కార్యమనుచు
వారలకు మ్రొక్కె కంసుండు గౌరవమున

వ ఇటు మ్రొక్కి దేవకీ వసుదేవుల మారడించి, కంసుండు నిజనివాసంబున కరిగె నంత

## మందలో పురుటిబిడ్డడు

వ మందలో యశోద మేల్కాంచి మాయా నిద్రా విముక్తయై లేచి, ముందర కావుకావున నేడ్చుచున్న ముద్దు బాలకుం జూచి తన చెలులతో నిట్లను చున్నది

గీ నేను నిదురించినటులుంటి నెలతలార!
ఎపుడు బుట్టెనె యీబిడ్డ యింతులార?
చాల కడుపెంచినది గదే సఖియలార!
బొడ్డు గోయరె యికనైన పొలతులార!

వ అని విని చెలులు బిడ్డ బొడ్డు గోసి, నీళ్లు బోయుచున్న జూచి యశోద యిట్లను చున్నది

### దరువు

ఉడ్డు కూర్చుకునీ[1] నమ్మా! చిన్ని బిడ్డడు ॥పల్లవి॥
పుడ్డు కూర్చుకునీని[2] నోయమ్మ! నా బిడ్డ

1, 2 'ఉడ్డుగు ఁచుకొను' అను క్రియాపదము యొక్క వ్యావహారికరూపములు ఁన్నగుడుచు = ఊపిరి త్రిప్పలేక బాధపడు (చూ శ ర పుట 82) 'ఉక్కిరిబిక్కిరి యగు' అని భావము

డడ్డముగ చేతులొడ్డి నీళ్ల బోయు ॥డుడ్డు॥ ఉ ప ॥

తక్కక కన్నులు — తలను, పుణికె నొత్తి
ముక్కు చెక్కులు వొత్తి — మోమొంచి। లాలబోయు ॥డుడ్డు॥ 1

తొడలు మోకాళ్ల చే — తులు సాగదియ్యుచు
కడుపు నిమిరి మెల్ల — గానె లాలబోయు ॥డుడ్డు॥ 2

తరిగొండపుర నర — హరి వరమున నేటి
వరకు బుట్టిన బిడ్డ — వర్ధిల్లవలె నిప్పు ॥డుడ్డు॥ 3

వ అనిన విని నవ్వుచు చెలులు బిడ్డకు నీళ్లుబోసి, చేటనుంచి, కొలనుపూజించి[2] దేవళ్లకు మ్రొక్కి, తదనంతరంబున

ద్విపద ఆ యశోదాదేవి — కా చెలు లెల్ల
నాయకం[3] బొప్పగా — నడుము బిగించి
గట్టి కారపు గుట్టి — కల మ్రింగ నిచ్చి
గట్టిగా తల నంట — గా కొంగు గట్టి

---

1 'మోము వంచి' అని విభజనము ఇది వ్యావహారిక సంధిరూపము,

2 'కొలను పూజించుట' దేశీయమగు ఒక ఆచారము శిశువు జన్మించిన వెంటనే, బొడ్డు గోసిన అనంతరము 'మావి'ని ఒక మట్టి పాత్రలో నుంచి, ఇంటిముందు ప్రదేశమున నొక ప్రక్క చిన్న గోతిలో నుంతురు పిమ్మట మట్టితో గోతిని నింపి చదును చేసి, పైనొక బరువైన రాతి నుంచెదరు ఇట్లు 'మావి' ఉంచబడిన ఈ చోటునకే (స్నానార్థమైన) కొలను, కొల్లు — అని వ్యవహారము పుట్టిన నాటినుండి పురుటి రోజు వరకు శిశువుకు, పురుటినాడు జనయిత్రికిని ఈ 'కొల' నున్న చోటనే నీళ్లు పోయుదురు గనుక ఈ పేరు సార్థకము మంత్రసాని మూడు చిన్నరాళ్లను కొలనిబండకు ఆనించి, వాటిని పసుపు కుంకుమలతో అలంకరించును వీటినే కొలనుదేవతలు ('శీత'లు) అందురు వేసాకు, తొన్నలు, ప్రత్తిగింజలు — వీటిని కలియగలిపి, అక్షతలుగా కొలనిదేవతలపై వేయుచు మంత్రసాని పూజించును, ఆ దేవతలకు పప్పుబెల్లములు నివేదించి మ్రొక్కులిడును పిమ్మట ఆ పప్పుబెల్లములను చిన్నపిల్లలకు పంచును 'కొలను పూజించుట' యను మాటలో ఈ సంప్రదాయార్థ మంతయు ఇమిడియున్నది

3 నడికట్టుముడి

కావుబొట్టు[1], విభూతి — కాటుక బెట్టి
వేవేగ కాచుతో[2] — విడె మిచ్చి, సుతుని
తొలగక పుణుక నొ — త్తుచు నావుదంబు
తలనంటి, యట నుగ్గు — ద్రావించి, నల్ల
చుక్కలు నుదుటిపై — సొగసు చెక్కిళ్ల
తక్కక బెట్టి మో — దమున 'యశోద!
చన్నిమ్ము సుతునకు — సంప్రీతి' ననుచు
చెన్నొంద బిడ్డను — చేతి కిచ్చినను
పట్టిని చేతుల — బట్టి యెత్తికొని
నెట్టన చన్ను మ — న్నించి త్రావించి
ఆ యింతి తరిగొండ — హరి నాత్మ నుంచి
పాయక దేవళ్ల — ప్రార్థించె నిట్లు

## యశోద ప్రార్థన

### దర్బ్వ, ఆదితాళం

దేవళ్లార! నాబిడ్డను — కావు డిప్పుడూ ॥పల్లవి॥
మిమ్ము, సేవింపూచు నేను పూ — జించే నెప్పుడూ ॥దేవళ్లార॥ ఉ ప ॥

గొడ్డుమీరియుండి నే నీ — కొడుకున్ గంటినీ
నీవి, దొడ్డవాని జేయుడు సాం—దూగా నంటినీ ॥దేవళ్లార॥ 1

ఆయువు నారోగ్య మియ్యు — డాని యంటినీ
మిమ్ము, నేయి విధముల నేను — నేడే నంటినీ ॥దేవళ్లార॥ 2

తరిగొండ హరికి నీడు — దాసు డంటినీ
గాన, చిరముగ మీరందరు ర — క్షింపు డంటినీ ॥దేవళ్లార॥ 3

---

1 శిశువులకు రక్షగా నొసటిపై నుంచెడు నల్లని బొట్టు దీనినే 'కానిరిబొట్టు' అనియు నందురు (చూ శర పుట 173)

2. తాంబూలములో చేర్చెడు ఒక దినుసు

గీ అనుచు దేవళ్ల బ్రార్థించి యా యశోద
'పరగ బంగరు తొట్లలో బాలు నుంచి
యూచి జోలలు బాడరె యువిదలార!'
యనిన జోలలు బాడి రిట్లనుచు చెలులు

**లాలి**

లాలి ముద్దులబాల! — లాలి గోపాలా!
లాలి కాంచనచేల! — లలితగుణజాలా! ॥లాలీ॥ 1
వనిమలాచార! యా — దవకులోద్ధారా!
కవిబృంద మందార! — కలికలుషదూరా! ॥లాలీ॥ 2
నందనందన! సదా — నంద! గోవిందా!
సౌందర్య వదనార — వింద! ముకుందా! ॥లాలీ॥ 3
వర చిన్మయాకార! — వనధి గంభీరా!
నిరుపమ సుగుణహార! — నిగమ సంచారా! ॥లాలీ॥ 4
శైలజనుతనామ! — సంపూర్ణ కామా!
నీలమేఘశ్యామ! — నిర్జర [లలామా!] ॥లాలీ॥ 5
తరిగొండ పురవాస! — తారకవిలాసా!
చిరరమ్య దరహాస! — శ్రీశ్రీనివాసా! ॥లాలీ॥ 6

## దర్వు (జోల), ఆదితాళం

జోజో జోజో కృష్ణా! జోజోజో కృష్ణా! ॥పల్లవి॥
నీకు, వాజగాదు[1], పోరుబెట్ట — వద్దు కృష్ణా! ॥జోజో॥ఉ ప॥
చెలగుచు మామోములు జూ — చేవు కృష్ణా!
నీవు, ములకనవ్వులు నవ్వేవు — ముద్దు కృష్ణా! ॥జోజో॥ 1
వూచితే హాయిగా నూగు — చుండి కృష్ణా!
మే, మూచకుంటె వూకొట్టేన — వోరి కృష్ణా! ॥జోజో॥ 2
తరిగొండ నారసింహుడు — దయను కృష్ణా!
నీకు, చిరతరాయు వియ్యవలె — చిన్ని కృష్ణా! ॥జోజో॥ 3

1. 'తగదు' అని భావము

## దర్వు, ఆదితాళం

చిచ్చోలా [ల్లా] చిచ్చోల్లా ॥పల్లవి॥

ముచ్చువగలతోను — ముద్దులు జూసేవు
నచ్చు [చూపులతోను] నీ — కనుగవ మోడ్చావు ॥చిచ్చో॥ 1

పోలుచు కనుమూసి — సొక్కినట్లున్నావు
నీలమేఘవర్ణ! — నిద్దుర జెందేవు ॥చిచ్చో॥ 2

శృంగారముగ కాళ్ల — చేతు లాడింపూచు
నుంగ పుంగ యని — యూరకె పోరేవు ॥చిచ్చో॥ 3

వరతరిగొండనార — సింహుడు నీలోన
నిరవుగ నున్నా — డింకేల పోరేవురా? ॥చిచ్చో॥ 4

వ అని యిట్లు చెలులు జోలలు పాడుచుండి, రంత నందుం డట్టి పుత్ర జననంబు విని, యమునలో స్నానంబు జేసి, ధనధాన్యంబు లనేక బ్రాహ్మణు లకు (ఇచ్చి) పుత్రోత్సవంబు జేసి, పురోహితునకు భూషణాంబరంబు లిచ్చి మొక్కి యిట్లనుచున్నాడు

గీ ఓ పురోహిత! బహునాళ్ల కుర్విమీద
నాకు పుత్రుడు బుట్టియున్నాడు, వాడు
జనన మొందిన దివన నక్షత్ర లగ్న
ముల ఫలంబులు జెప్పవె! ముదముతోడ

## పురోహితుడు - జాతక ఫలము

వ అనిన విని పురోహితుం డిట్లనుచున్నాడు.
వినవోయి నందగోపకా!

శ్లో॥ సమయా వీక్షితా ఛాయా, నక్షత్రం నావలోకితం।
పరోపదిష్టవేళాయాం, లిఖ్యతే జన్మపత్రికా॥

యుషని జ్యోతిషమందు వుంచున్నది యీరాత్రి మోడము బట్టివున్నది సాదచ్ఛాయా వేయకూడదు నక్షత్రములున్ను కనిపించలేదు నీవు నన్ను అడిగిన ప్రశ్న లగ్నంబట్టి లెస్సగా విచారించి చెప్పసామూ నీ కుమారుడు పుదయించిన దినం శ్రావణ బహుళ అష్టమి రోహిణి నక్షత్రం రోహిణి మృగశిరార్ధం వృషభం కాగా, రాశి వృషభరాశి తత్తద్గ్రహ గతులున్నూ, వీక్షణ విశేషములున్నూ లెస్సగా విచారిస్తిని కాగా, నీ కుమారుడు జారుడౌ సున్నాడూ. చోరుడున్ను అవుసున్నాడూ చౌషష్టి విద్యలున్ను నీ కుమారునికి వస్సున్నవి యిదిగాకా బాల్యమందు విషగండం, శకటగండం, గాలిగండం, అజగర గండం, అగ్నిగండం, జలగండం, సర్పగండం, వృషభగండం, హయగండం, గజగండం వస్సున్నవి ఆ గండము లన్నిన్ని తప్పిపోస్సున్నావి నీ కొడుకు లోక [ప్రసిద్ధ] జారుడనిన్ని, చోరుడనిన్ని నిందె పొందుసూ వుంచున్నాడూ ఆ రోహిణి నక్షత్ర ఫలం యేమని అంటివైనా, అతని మేనమామకు గండం వస్సున్నది నీ కుమారుడు స్వస్థలం విడిచి పరస్థలం జేరుసున్నాడు బహుమంది పెండ్లాల పెండ్లాడుసున్నాడూ బహుమంది బిడ్డల గనుసున్నాడూ బహుమంది దుర్మార్గుల చంపుసున్నాడూ బహుమంది సన్మార్గుల రక్షిస్తున్నాడూ మహదైశ్వర్య సంపన్ను డౌసున్నాడూ

శ్లో॥ జననీ జన్మసౌఖ్యానాం, వర్ధనీ కులసంపదాం ।
ఎదవీ పూర్వపుణ్యానాం, లిఖ్యతే జన్మపత్రికా ॥

యిషనేని సిద్ధాంతం వుంచున్నది గనుక, జన్మ సౌఖ్యాలకున్ను, [కులసం]పద వర్ధమానం అయ్యేటందుకున్ను, పూర్వజన్మ పుణ్యవిశేషములు తెలియుటకున్ను మాకు తోచినట్లు లెస్సగా విచారించి చెప్పినామూ

నేను పెద్ద బ్రాహ్మణ్ణి జటాంత స్వాధ్యాయినీ నాల్గు వేదములున్ను, ఆరు శాస్త్రములున్ను, పదునెనిమిది పురాణములున్ను, [చది]విన వాణ్ణి బిడ్డలు గలవాణ్ణి జ్యోతిషము లెస్సగా చదివినవాణ్ణి కాగా, నేనే దానపాత్రుణ్ణి ఆత్మస్తుతి, పరనిందా, ధనకాంక్ష లేని నావంటి మహామభావునికి యేమి దానము చేసినా మీకు అనంతపుణ్యం వస్సున్నది నాకేగాని, తక్కిన భ్రష్టులకు యెవ్వరికి దానము [చేయరాదు] మాకు మూడు హస్తములు గలవు మూడు హస్తములలో ఆహవనియ్య, గార్హ

పత్య, దక్షిణాగ్నులనే త్రేతాగ్నులున్ను మూడు హస్తములయందున్ను వుంచు న్నవి కాగా, మా హస్తము దానపాత్రమై వుంచున్నది మేము మహా పవిత్రమైన వారము త్రికాలములయం[దున్నా మీకు శుభములు గల గుసూ]ండవలెనని ఆశీర్వాదం జేస్తూవుంచున్నాము

అనిన పురోహితునికి నందుండు గో భూ హిరణ్య దానంబులు మొదలైన షోడశ మహాదానంబులు జేసిన, పురోహితుండు దీవించి చనియె. నంత

ద్విపద నలువొప్ప నటమీద — నందగోపకుడు
నలరుచు పురుడు
[వరలెడు స]కలోత్స — వంబులతోను
నెరవేర్చి సుతుని మ — న్నింపుచునుండె

## పూతన

అంతమీదట కంసు — డాకాశమందు
పంతంబుతో శక్తి — పలికిన పలుకు
తలచి, భీతిని బొంద[1] — తను జంపువాడు
పొలుపొంద ధరణిపై — బుట్టినాడనుచు
జెప్పె గావున, చిన్ని — శిశువులనెల్ల
తెప్పున జంపిన — తెరలి యెందైన
గా కనుచు
తక్క కచ్చటికి పూ — తనను రప్పించి
'భూలోకమున నీవు — పొందుగా వెదకి
బాలుర జంపు మే — ర్పడ' నన్న, దనుజ
కామిని చనులలో — గరళంబు నుంచి
భూమిలో బుట్టిన — బుడుతల కెల్ల
చన్ను బాలనుచు వి — షము నిచ్చి చంపి
పన్నుగా నొకనాడు — బాలింతవలెను

1 భీతిని బొందునట్లుగా — అని యర్థము

వెర [వొప్ప సుం]దర — వేషంబు దాల్చి
యరుదుగా తరిగొండ — హరియైన కృష్ణ
దేవుడు పెరుగగా — దీపించు మంద
కావేళ వచ్చె న — త్యద్భుతంబుగను

## దర్వు, ఆదితాళం

భూతకి[1] వచ్చెనూ, ప్రాణ — ఘాతకి వచ్చెనూ ॥పల్లవి॥
మహా, పాతకాములాకు మూల — పాథేయామై పుట్టినట్టి ॥భూతకి॥

॥ఉ ప ॥

పరగమ య[లు ప] న్నుకుంట — బాలకూం వెదకుకుంట ॥భూతకి॥ 1
తన చన్నాలు చేపెనంట — త్రాగే బిడ్డాడు లేడంట ॥భూతకి॥ 2
తరిగొండ నరహరి చేత — తా సిల్గుట తెలియలేక ॥భూతకి॥ 3

గీ ఇట్లు వచ్చిన పూతన యిందు నందు
చిన్ని బిడ్డల వెదకుచు, చిత్రగతుల
నాట్య మొనరింపుచును, నందనందనుండు
ఎవ్వలంచిన మేడలోపలికి బోయి

వ అందు కన్నులు మూసి యేమి యెరుంగని హాని చందంబున నిదురింపుచున్న చిన్నికృష్ణుని ఎట్టి యెత్తబోయిన, యశోద అడ్డంబు వచ్చి యిట్లను చున్నది

## దర్వు*, ఆదితాళం

నా బిడ్డను బట్టను నీ వెవతెవు ? — నాతో దెలుపవె కొమ్మా !
[మరి], నాతో దెలుపవె కొమ్మా ! ॥పల్లవి॥

1 ఇది దుష్టయగు రక్కసికి పర్యాయముగ వాడబడు ప్రసిద్ధ వ్యావహారికరూపము శూర్పణఖను సైతము 'భూతకి' యని వ్యవహరించుట జానపదులలో కలదు

* ఇది సంవాదదరువు యశోదకు పూతనకు మధ్య నడచెన సంవాద మిందు గలదు.

నీబిడ్డడు నాబిడ్డ డనుచు బలు - నెనరున బట్టితివమ్మా !
బలు, వెనరున బట్టితివమ్మా ! 1

నిద్దురబోయెడి బిడ్డను లేపవు — నీకు పనేమే కావమ్మా ?
మరి, నీకు పనేమే కావమ్మా ? 2

బాలుడు ముద్దుగ నున్నా డందున — పాలిచ్చెద నో యమ్మా !
చను, బాలిచ్చెద నోయమ్మా ! 3

నా బిడ్డకు నా పా[లున్నది] — నీ బిడ్డ కియ్యవే కావమ్మా !
పాల్, నీ బిడ్డ కియ్యవే కావమ్మా ! 4

గొడ్డుపాలు బడియున్నది, త్రాగను — బిడ్డడు లేడోయమ్మా !
నాకు, బిడ్డడు లే డోయమ్మా ! 5

బిడ్డలు బుట్టని గొడ్డుపాలు నా — బిడ్డకు వలదే కావమ్మా !
నా, బిడ్డకు వలదే కావమ్మా ! 6

సంతానము కొరకే నే నితనికి — చను గుడిపించెదనమ్మా !
నే, చను గుడిపించెదనమ్మా ! 7

చన్నిపుడే త్రాగెను వీ డక, నీ — చన్నివు డొల్లడె కావమ్మా !
నీ, చన్నివు డొల్లడె కావమ్మా ! 8

ముద్దుల బాలుని తొడపై నిడుకొని — ముద్దాడెద నియవమ్మా !
వీని, ముద్దాడెద నియవమ్మా ! 9

తరిగొండాధీశ్వరు తోడే వీని — తాకరాకవే కావమ్మా !
వీని, తాకరాకవే కావమ్మా ! 10

వ అని యిట్లు యశోద [అడ్డం]బు వచ్చి వారింపుచున్న నిలువక, బలాత్కారంబున డింభకు నెత్తి తొడలపై నిడికొని, చుంచు దువ్వి చెక్కిళ్లు నిమిరి యిట్లనుచున్నది

ద్విపద ఓ చిన్ని బాలక ! — ఓ ముద్దులయ్య !
నీ చెల్వమును జూడ — నేడు వింతయ్యె

కనుమూసి కుసిలింప[1] — కారణంబేమి ?
నను జూచి చిరునవ్వు — నవ్వరా తండ్రి !
సహజమో నీ తల్లి — చనుబాలకన్న
బహు మధురంబైన — సాలు నా సాలు
కావున ద్రాని శీ — ఘ్రంబుగా నిదుర
పోవచ్చునని తట్టి — బుడుతని లేపి
తరిగొండ నరహరిన్ — తన తొడ మీద
నిరవుగా నిడికొని — యిట్లని పలికె ;

## దర్బ్యు, ఆదితాళం

సాలు దాగరా ! నా కొడుకా ! — సాలు దాగరా ! ॥పల్లవి॥
నోరి, నీలవర్ణా ! నీకు బాగా — నిద్దుర వచ్చినిగాని ॥సాలు దాగరా॥ఉ వ ॥
నిన్ను గన్న తల్లిపాల — కన్న మధురముగుచు జేపె[2]
పన్నుగ నీ విపుడు పోర — బారక[3] తిన్నగ నొదిగి ॥సాలు॥ 1
కడుపు వాడియున్నదిరా ! — గళమంతా యెండె గదరా !
బుడుతడ ! నీ కరువు దీర — బొజ్జనిండ వూర వూర[4] ॥పాలు॥ 2
'తరిగొండా వాసుని తోడే ! - తాకవద్దు బిడ్డ' నని
పరగ బల్కిన మాయమ్మ — బాగ సంతోషించుగాని ॥సాలు॥ 3

ద్విపద అని యివ్విధంబున — నాదరింపుచును
తను లేపుచుండిన — దానని క్రూర
భావంబు దెలిసి లో — పల నవ్వికొనుచు
మెల్లనె కుసిలించి — మెలపుగా నొదిగి

---

1 కుసిలించు - అత్యంతచే దుఃఖించు (చూ శ.ర పుట 187)
2 'చేపెను' అనగా పాలు స్రవింప నారంభించెనని భావము (చూ శ.ర పుట 279).
3 'పోరుపెట్ట దొడగక' అని యర్థము
4 'ఊరగా, ఊరగా' అని యర్థము

సల్లలితుడు దాని — చను కబళించి
దాని ప్రాణములతో — దాని చన్బాలు
దానవాంతకుడైన — తరిగొండ నృహరి
బీర్పు[1]చునుండగా — పెడబొబ్బ లిడుచు
నోర్పలే కా యింతి — యిలికి యిట్లనియె

## దరువు, ఆదితాళం

విడువరా! చన్ను — విడువరా! ॥పల్లవి॥
శౌరి, విడువరా! పిల్లల—పిడుగువంటి బిడ్డ! ॥విడువరా!॥ ఉప॥
దయ్యమువలె బట్టి — త్రావేవు పాలన్ని
కుయ్యో మొఱ్ఱో! యింక — కడువవద్దయ్యయ్యో! ॥విడు॥ 1
వడిగి[2] ప్రాణములన్ని — వాతికి[3] వచ్చెను
తడబడుచున్నది — తనువిప్పు డయ్యయ్యో! ॥విడు॥ 2
తరిగొండ నరహరి — దంష్ట్రల కన్నాను
బెరసిన వాడివి — పెదపులిం దయ్యయ్యో! ॥విడు॥ 3

వ అని యిట్లు పూతన యేడ్చుచుండగా కృష్ణుండు దాని ప్రాణంబులు చను బాలతో బీర్చిన, అది (వి) కృతరూపంబుగా నేల గూలిన, దా[ని రొ]మ్ము మీద నాట్లాడుచున్న, డింభకునికి కిసరు[4] దాకెనని కన్నీరు నింపుచున్న యశోద చేతికి చెలులు కృష్ణుని గొనిపోయి యిచ్చి యిట్లనుచున్నారు

---

1 'పీర్పు'కు వ్యావహారిక రూపము

2 వడుగు — కాంతి మాయు (చూ ఆంధ్రక్రియాస్వరూపమణిదీపిక, పుట 827)

3 'నోటిలోనికి' అని యర్థము

4 అంటుసోకుటవలన పసిబిడ్డలకు గలిగెడు దోషము (చూ శర పుట 177)

జంపె

కన్నీరు బెట్టకువె — కామిని యశోద !
నీ, చిన్నారి కృష్ణునికి — శ్రీరామరక్షా 1

పన్నుగ నికమీద — భయమించుకయు లేదు
చిన్నారి కృష్ణునికి — శ్రీరామరక్షా 2

మన్నించు తరిగొండ — మనుజకేసరి దయను
చిన్నారి కృష్ణునికి — శ్రీరామరక్షో 3

వ అని యిట్లు చెలులు గోపెమ్మ నాదరించి కృష్ణునికి సర్వాంగరక్షణంబులు జేసి. రంత నందుండు వచ్చి వెరగుపడి పూతన శరీరంబునకు తగిన సంస్కారంబు జేయించె. నంత

## శకటాసురుడు

ద్విపద కరకరి[1] నొకనాడు — కంసు పంపునను
నరభినంచున మించి — శకటాసురుండు
మురువొప్పగా గోష్ఠ — మున కేగివచ్చి
సారిసారె నందందు — పొంచుచునుండి
పనుల తొందరచేత — భామ యశోద
వనజాక్షు నొకదిక్కు — వైపుగా నునిచి
మరచియుండిన వేళ — మాయ రాక్షసుడు
తరిగొండ వారియైన — దండశూకాద్రి
వరుడైన కృష్ణుండు — వసియించియున్న
వరరత్న హేమ భా — స్వరమై తనర్చు
భవనంబులోనికి — బండి చందమున
జవమున బొరలి యా — స్పర్శంబుగాను

1 కరకరి — క్రూరభావము (చూ ౪౨ పుట 152)

## దర్వు, ఆదితాళం

శకటాసురుడు వచ్చెనా
కృష్ణునిపైకి, శకటాసురుడు వచ్చెనా ॥పల్లవి॥

కకవికలై గొల్ల — గరితలు వెరగంద
ప్రకటముగను గో — పాలుని మీదికి ॥శకటా॥ 1

ముద్దుగ కృష్ణుని — వద్ద నాడే ఒడర
ఉద్దద్దిరా! యని — దద్దిర్లగా[1] నించి ॥శకటా॥ 2

వరతరిగొండ ని — వాసుడు శ్రీశేష
గిరివాసుడై [న శ్రీ ]— కృష్ణుని మీదికి ॥శకటా॥ 3

ద్విపద ఈరీతి వచ్చిన — యింద్ర కంటకుడు
భీరంబు మీరగా — బెడబెడ బౌరలి
శౌరిపై రా శంఖ — చక్ర దంభోళి
సారసాంకుశ కేతు — చామర ఛత్ర
హలకులిశాది రే — ఖాంకితంబగుచు
నిసత్రవాళన — పీన న్మృదుత్వ
కలితమౌ నిజపాద — కంజాత మె [త్తి
బలియు] డై బాలుడా — బండి బోదన్నె
తన్నిన నది మీయు — త్తలమున కెగసి
మిన్నక పడిగూలె — మేదిని మీద
వరతరిగొండ ని — వాసుడై శేష
గిరి వాసుడగు బాల — కృష్ణు డర్భకుని
వలె నుండె. నందుండు — వచ్చి యచ్చోట
వలగొనుచుండిన — వారి కిట్లనియె

గీ బండి వెన్నడొ దన్నె [గోపాలు]లార!
దనర కృష్ణుండు బండిని దన్నెనయ్య !*

---

1 'దద్దిర్లు' అనునది 'దద్దరిల్లు' యొక్క రూపాంతరము
* ఇది గోపాలురు నందునితో పల్కిన వాక్యము.

బాలుడెటు దన్నగలడు ? దబ్బరలుగాక
యనుచు నందుండు నెరగండె మనమునందు

ద్విపద అంతలోన యశోద — యచటికి వచ్చి
నంతోషమున సుతున్ — చంక నెత్తికొని
రయమున తా నంగ — రక్షలు జేసి
దయ [ను జూచు]చునుండె — తదనంతరమున

## తృణావర్తుడు

ఒకనాడు శ్రీకృష్ణు — నొగి తొడమీద
రకముగా నిడుకొని — రాగిల్లి చాల
ముద్దాడు చున్న ని — మ్ముగ నద్రి సాటి
తద్దయు బళువైన - ధరియింపలేక
కుతలంబు మీదట — గూర్చుండబెట్టె,
నతిరయంబున కంసు — నంపగా నెగసి
వడిగొను [చును తృ] ణా — వర్తుండు మించి
సుడిగాలివలె వచ్చి — చుట్టి డింటకుని
తడయక గొంపోయె — తదనంతరమున
తడబడి యా యశో — దాదేవి లేచి
కొడుకును గానక — కూతలు బెట్టి
పడతుల నెల్ల త — ప్పక పిల్చి పలికె,

క ఇచ్చట నుండిన బాలుని
చెచ్చెర సుడిగాలి వచ్చి చేకొని చనె, నే
నెచ్చట వెదకుదు ? నీ గతి
[నచ్చ]క నేనేమి సేతు నమ్మయలారా ?

### దరువు

ఏమి సేతు నోయమ్మా ?
సుతు, నెక్కడ జూతు నోయమ్మా ? ॥పల్లవి॥

యిక్కాడ నుండిన — చక్కాని బిడ్డను
(గక్కూన గొంపోయె — గాలిదయ్యము వచ్చి ॥ఏమిసేతు ?॥1
తొడమీదనే యుండి — దొడ్డగ బరువైన
పుడమిపై బెట్టితి — బుడుత డిచ్చోట తే ॥జేమిసేతు ?॥ 2
ఉరగాద్రి పతియైన — తరిగొండ నరహరి
యురవుగా నా బిడ్డ — నిచ్చితే మేలయ్యె ॥నేమిసేతు ?॥ 3

ద్విపద అని యశోదాదేవి — యారట పడగ
తను గొనిపోయిన — దైత్యు నీక్షించి
గోపబాలుడు వాని — కుత్తుక బట్టి
కోపంబుతో మహా — కుధరంబువాడ్కి
భారమై తోప న — ప్పు[డన దైత్యుం] డు
ఘోరునబడి నీల్గ — భూస్థలిమీద
నప్పుడు తరిగొండ — హరి దైత్యువీాద
నుప్పొంగి యాటాడు — చుండె నవ్వుచును

వ ఇట్లాట్లాడుచున్న కృష్ణుని చెలుల గొనిపోయి యశోద కిచ్చి అంగరక్షలు జేసి రంత

గీ అర్భకుం డొక్కనాడు తా నావులించి
వదన గహ్వ [రమందున వ] నజ జాండ
ములను జూప, యశోద తా కళవళంబు
పడుచు నందున్న సతులతో బలికె నిట్లు

## యశోద భ్రాంతి

ద్విపద ఈ వింత లేమమ్మ ! — యీా చిన్ని బిడ్డ
డావులించిన వేళ — నా నోటిగుండ

1 ॥ చేంతయ్యను — వేంటను.

కడుపులో నేమేమొ — గనుపింప [సాగె]

పాలన్ని [యేరులై — పా] రుచు నుండె
నాపైన జూడ న — నంతంబు లగుచు
తలగక వెన్నము — ద్దల గుంపు లుండె
చెలగి యారగించున క — చ్చిన పాలు, వెన్న
కొంచెకొంచెములైన — గొప్పలై పెరిగి
యుంచుకొనైనను హ — రించుట లేక
నాపట్టి కిట్లజీ — ర్ణంబు బుట్టించె
నీపాప డిట్లైన — నెటు వృద్ధి బొందు ?
[శ్రీవన్న] గాద్రిపై — చిరముగా వెలయు
నాపాలి తరిగొండ — నరహరి మీద
భారంబు వేసి పా — పని కేను వైద్య
మారూఢిగా జేతు — నమ్మయ్యలార ?

## దర్వు, ఆదితాళం

బాగా వాను వస వేంపాలి[1] — బటువు నల్లేరు గెణుపులు
వేగా కరుకైనా[2] జేసి త్రా — వింతమటరే! 1

కడుపులోని జున్ను, పాలు — కరిగి జారిపోవుటకు
బుడుతని కాముదమైన — బోతమటరే! 2

వెన్నముద్ద లరిగిపోవ — నన్నభేదియైన దెచ్చి
పిన్నవాని కిపుడు దిని — పింతనటరే! 3

కారపుంటలు ప్రమింగించి ఈ కడుపు బిసికి, వేడినీళ్ళ
భోరున బోడ్డుచుట్టూరు — బోతమటరే! 4

పమ్మగ శ్రీతరిగొండ — పతిమీద భారము వేసి
చిన్ని బుడుత కీ మందులు — పేతనటరే! 5

---

1 ఈ వ్యావహారిక రూపమునకు 'వేగించవలెను' అని యర్థము

2 కరుకు — మందు దినుసును వేడిచేసి నూరిన పొడి (చూర్ణము).

ద్విపద అనగ నందొక్క వృ — ద్ధాంగన బలికె
వినవె యశోద! యీ — వెరపేల నీకు?
పాలుపొంద నీ పట్టి — బొజ్జ లోపలను
జలజజాండంబు ల — సంఖ్యలు గలవు
గనుక, నా బ్రహ్మాండ — గణములయందు
ఘనతర దుగ్ధసా — గర పంక్తు లుండు
కరమొప్పు ధవళసు — కాంతుల నమరి
వరుస కైలాస ప — ర్వతములు నుండు
సుదతి! యీ కడుపులో — జూచిన పాలు
వదలని యా క్షీర — వార్ధులు గాని
చెలువొప్ప నీవు బో — సిన పాలు గావు
నెలత! యీ బొజ్జలో — నీవు జూచినవి
కొలదిమీరిన వెండి — కొండలు గాని
యలరుచు సుతుని నీ — వాట లాడించి
మొనసి యిచ్చిన వెన్న — ముద్దలు గావు
పెనుపొంద నీవేల — భీతి నొందెదవు ?
వీడు బాలుడు గాడు — విష్ణుదేవుండు
చూడ చూడగ వీని — సొబగు గాన్పించు
నమ్మ! యీ తరిగొండ — వారికి వైద్యంబు
లిమ్మాడ్కి జేయుట — కెంతవారలము ?
ఓయమ్మ! నీవూర — కుండు మటంచు
నా యశోదకు ధైర్య — మది జెప్పె నంత

## గర్గుడు - నామకరణము

వ వసుదేవుని పంపున వ్రేపల్లెకు గర్గమహాముని వచ్చినం జూచి, యుచితాసనంబునందుంచి పూజించి, [యమ్ముని]కి నందుం డిట్లనుచున్నాడు

### ఝంపె

ఓమహామౌనీంద్ర! — యో సత్కృపాసాంద్ర!
మా నంద కిపుడు స — మ్మతముగా మీరూ 1

ఘనకృపను వచ్చినం — దున కృతార్థు డనైతి
ననఘ! కారణములే — కను పెద్దవారూ 2

కోరి మాయట్టి సం — సారుల గృహంబులకు
కారణం బే [దైన — కలుగకను] రారూ 3

వారు వచ్చిన శుభము — వచ్చు గావున, నిటకు
మీరు రాగా మాకు — మేలు దనరారూ 4

తరిగొండ నృహరి వర — తనయులగు బాలులకు
వరులెన్న నామకర — ణము జేయు డిపుడూ 5

వ అని నందుండు పలికిన విని గర్గుండు సమ్మతించి యథావిధిగా నామకరణంబు
పొంగంబు గావించి, మొదట రోహిణీ కుమారుని జూచి యిట్లనుచున్నాడు

ద్విపద. కూరిమి విను నంద — గోపక! వేడ్క
నీ రోహిణీ పుత్రు — డిరవంద జనుల
రమియించు[1] గావున — రామాఖ్య నొనరు
కనునీయు గర్భ సం — కర్షణంబునను
నమర సంకర్షణుం — డను పేర వమరు
ప్రమద మొప్పగ నుహా — బలశాలి గనుక
బలభద్రు డనుపేర — ప్రఖ్యాతి బొందు
పొలుపొంద వినుము నీ — పుత్రుడు మున్ను
ధవళ లోహిత పీత — తనువులు దాల్చి
భువి మీద నిప్పుడు — పురుహూతనీల
కృష్ణ వర్ణుండౌచు — క్రీడించు కతన
కృష్ణాఖ్య నమరు మి — క్కిలి వసుదేవ
వరపుత్రు డౌటచే — వాసుదేవాఖ్య
కరమొప్పు, బహువర్ణ — కలిత రూపముల
నిరవందు గనుక న — నేక నామముల

---

1. 'ఆనందింపజేయును' అని తాత్పర్యార్థము.

మెరయునంచు (వ)చించి — మీర లీ పుత్రు
కరుణచే శోకాబ్ధి — గడతు౹ రీ ఘనుడు
సరవి నారాయణ — సముడని తెలుప
ననఘాత్ముడగు నందు — డానంద మొందె౹
చనియె గర్గుడు నిజ — స్థానంబునకును
వర తరిగొండ ని — వాసుడై శేష
గిరి వాసుడగు బాల — కృష్ణుండు, బలుడు
అచ్చట బెరుగగా — నా మందలోన
హెచ్చిన గోగణం — బిచ్చిన పాలు
పిండి, కమ్మగ గాచి — పేర బెట్టికొని
దండిగా ప్రొద్దున — దనరు వేడ్కలను

## గోకులము - శ్రీకృష్ణుని దుడుకులు

### దర్వు, మధ్యమావతి రాగం, ఆదితాళం

పెరుగూ జిలుకుదురు గొల్ల చెలులు
ప్రొద్దూ ప్రొద్దూన, పెరుగూ జిలుకుదురు గొల్లచెలులు ॥పల్లవి॥

కర కంకణములు — ఘలు ఘల్లన, ముం
గురు లల్లాడగ — సరభసముగ విటు ॥పెరుగూ॥ ॥ఉ.ప.॥

చలునా చీర[లు] — నెళనెళ మనగా
పసిడి కాసె దా — జంటి రవికలు నిగనిగమనగా
కులుకుచు బెళుకుచు — కొప్పుల విరిసరు
లెలమిని గదలగ — నెంతో ముదమున ॥పెరుగూ॥ 1

మరుగూ లుప్పొంగి — పై పై నెగయూ
ఆలోని వెన్న, మెరుగూకవ్వముల — నిండా నొరయూ
పొరి పొరి కవ్వం — బులు కుడి యెడమల
నరుదుగ బిర బిర — దిరుగగ ముద్దియ్యలు ॥పెరుగూ॥ 2

తరిగొండ నారా — సింహుడైనా
శ్రీ వేంకటాద్రి, వరునీ బాడుచు — భక్తితోనా
మురువలరగ కుచ — ముం భారములకు
నరినురి నుధ్యము — లసియాడగ, తగ ॥పెరుగా॥ 3

ద్విపద తరుణా లీ విధమున — తను యుండ్లతోను
పెరుగు జిల్కెడివేళ — బిసరుహాక్షుండు
అచ్చట నందరి — కన్ని రూపముల
హెచ్చి కన్పింపుచు — నింతుల జూచి
యెత్తు కొమ్మని చేతు — లెత్తుచు, నగుచు
నెత్తి నుద్దాడిన — హేలానతులకు
మరులు బుట్టింపుచు — మర్మస్థలంబు
లెరిగి యుంటుచు, నేమి — [యెరు] గని వాని
వలె నందు తరిగొండ — వాసు డా చెలుల
నలరించి పలికె వె — య్యనున నిట్లనుచు

## దరువు, ఆదితాళం

మీ యుండ్లా కిటు వొత్తినే! వే — మీ గుట్లన్ని జూత్తినే! 1
నా యెరా దయవుంతారా? యిక — నన్ను మీ రెత్తుకుంతారా? 2
బెల్లను, పండ్లు నిత్తారా? [మీ] — పెరుగంతా దాగిత్తారా? 3
వెన్నాముద్దా లిత్తారా? నా — నేరుకలన్ని జూత్తారా? 4
పాచాలు[1] దాగిత్తారా? మీ — పరుచూల నా కిత్తారా? 5
తరిగొందాలో వుంతానూ బి — ద్దాఘా చానా గంతానూ 6

క అని ముద్దుమాట లాడుచు,
ననబో[డు]లు జూడ నందు నానావిలతల్
దినదినమొప్పగ జూపుచు
వనిగొన నొకనాడు గొల్లవడుచుల కనియెన్[2].

---

1. 'పాలు' అని యర్థము. ఈ పద మీయర్థమున బాలకృష్ణుని పల్కులలో తీయక్షగానమునందు పెక్కుచోట్ల ప్రయోగింపబడియున్నది

2. 'గొల్లవడుచులకు + అనియెన్' అని విభజనము.

ద్విపద సరసులారా! జ్ఞాన — పత్త్రి నూరి
పొరి జేసి పాలలో — బోసి, రాయపొరి
చక్కెర[1] వేసి యి — చ్చట నందలమును
చక్కగా తరిగొండ — సామి కర్పించి
యందల నుది దాగి — యానంద మెసగ
నెందెందు బోక నిం — ద్దాత్తారుదామె ?

## దరువు, ఆదితాళం

ఆవేశ మారుదామా ?[2] తల లూచుకుంతా
ఆవేశ మారుదామా ? ॥పల్లవి॥

ఆవేశ మారుతావుంతే — నపురు మన కన్నులకు
శ్రీవై కుంత మెరుపులుగాను — వెలగి కానవొత్తుందిప్పు
॥రావేశ మారుదామా ?॥ ఉప ॥

మీపెద్దనారు దూ। నూయు — మ్మతో పాల్లుమాతలు జెప్పి
యీపట్ల నన్ను గొత్తించే[3] — రిందు చద్దుచేయ కిప్పు ॥రావేశ॥ 1
బంతగా నందలము మూాల — యింతిలో జేరి యచ్చోత
కంతకుల కెప్పారికి — కనుపరకుంద దాకొని ॥యావేశ॥ 2
వెలగి తరిగొంద నర — చిన్మచ్చామి పాతలన్ని
పలునూరు చొగచుగాను — పాలుకుంత, నాలుకుంత ॥ఆవేశ॥ 3

క. అని జ్ఞానపత్త్రి[4] చూర్ణం
బును, శర్కర, పాలు గలిపి పూబోణులకున్
వనరుహనేత్రుడు ద్రావిం
చిన ద్రావుచు చెలులు లేచి చెలువము మీరన్

---

1 రాయపురిలో తయారగుచుండిన నాణ్యమగు చక్కెర దీనికి నేడు 'బూరాచక్కెర' యని వ్యవహారము
2 'శివమెత్తినట్లు ఒళ్లు మరచి ఆడుట' అని యర్థము
3. 'కొట్టించేరుసుమా!' అని ముందుజాగ్రత్తతో గూడిన హెచ్చరిక.
4. గంజాయి.

వ అప్పుడు శరీరంబులు మరచి వారు తమలో [దామి] ట్లనుచున్నారు

## దరువు

నే నెవరే ? మరి — నే నెవరే ? ॥పల్లవి॥
నానా వింతలు — మూనక చూచితి
నే నెవరే ? మరి — నే నెవరే ? ॥అ ప॥
వొళ్లు దెలియ-లే — దుండే దెచ్చటనే ? ॥నే నెవరే ?॥ 1
ఆకాశంబున — కరిగేట్లున్నది ॥నే నెవరే ?॥ 2
తరిగొండ నృకే — సరివలె నైతిని ॥నే నెవరె ?॥ 3

గీ ఏమె నే [మి] ప్వ డంటి మో యింతులార ?
నే మని [నదే] మి చెప్పరె మెలతలార ?
వింటి మవియేమొ తెలియరె వెలదులార ?
తెలివి యిల్లైనదేమకో తెరవలార ?

## దరువు, ఆదితాళం

ఇదిగోనే వైకుంఠమూ — హెచ్చిందే వైకుంఠమూ 1
అదిగోనే కైలాసమూ — హరుడున్న నివాసమూ 2
స్వర్గలోక మదిగోనే ! — సత్యలోక మదిగోనే ! 3
వీడుగోనే ! యజుడూ — వాడుగోనే ! రుద్రుడూ 4
తరిగొండ నృసింహుడూ — తాండవమాడుచున్నాడూ 5

వ అని యెగిరెగిరి గంతులు వేయుచు, వికావిక నవ్వుచు వీధి వీధి పరువులు బారుచున్నం జూచి, వికావిక నవ్వి కృష్ణుం డిట్లనుచున్నాడు

## దరువు (జావిడి), ఆదితాళం

చింగు చింగూన దాటూచు — చీరాలు విరిచివేచి
బంగిబాయి తొత్తులార ! — పలువెత్తాకురే ! 1

మీా పెద్దవాండ్లా జూచితె — మిమ్ము బత్తి కొత్తుతాలు
నా పెద్దవాండ్లిది వింతె — నన్నూ దిరతారూ 2

తరిగొందా మాచామితోరె! — పురకావద్దీరాకు వొచ్చి
పరగా మూలయింతిలోనె — పాచుకుందారె![1] 3

క అని పడుచుం దోడ్కొని చని
మన నులరగ నొక్కమూలమందిరమున జే
ర్చిన, మేనులు దెలియక నం
దొనరగ నిర్వాణులగుచు నుర్వీస్థలిపై

గీ. నిదుర బోవుచునుండగా నలవర్ణు
డచ్చటికి వెన్నముద్దలు దెచ్చి దేహ
ములను హత్తించి, ఎల్లుల మొనసి చుట్టు
విడిచి, యిల్లిల్లు జొరబడి వెన్నుడంత

వ దధిక్షీర నవనీతంబులు మెక్కి, కొల్లబెట్టి కుండలు బగులగొట్టి, బహు విచిత్రంబులైన దుడుకులు జేయుచున్న, గోపసతులు కృష్ణునితో నిట్లను చున్నారు

## దర్వు, ఆదితాళం

యాలా చట్లెచితివి గోపాలా ?
శాల, గోలాతో కొట్టేమూరా గోపాలా! 1

మాయిండ్ల కింక రాకు గోపాలా!
యిది, మీా యమ్మాతో జెప్పేమూ గోపాలా! 2

తరిగొండా హరితోడే గోపాలా!
నిన్ను, తరిమీ కొట్టకపోము గోపాలా! 3

వ అని బెదిరించిన, కృష్ణుండు వారితో నిట్లనుచున్నాడు

---

1 'పరుండుదము రండు' అని యర్థము ' పచ్చుకొను' అను శబ్దపల్లవము దీనికి మూలము ఇది 'పడుత్తుక్కో' అను తమిళ పదమును పోలినది

2 ఈ శబ్దమునకు 'దిగంబరులు' అను అర్థము వ్యవహారములో (చిత్తూరు మండలమున) గలదు

## దర్వు, ఆదితాళం

మాయమ్మాతో జెప్పతారతె ?
వో తొత్తులారా! మాయమ్మాతో జెప్పతారతే ? ॥పల్లవి॥
మీ యిండ్లకు నె వొత్తేను — మీ చొమ్మెంతా బోయెను ?
॥మా యమ్మాతో జెప్పతారతే?॥ ॥ఉ ప॥

కొత్తా వత్తా రత్నైతె మీ — గుత్తూలన్ని బైలుజేసి
రత్నాబెత్తి మీ యిండ్లాలో — రాయదొంగనై వుంతాను
॥మా యమ్మాతో॥ 1

దెమ్మాల[1] కెల్లానూ మొదటి — దెమ్మానాని వాకు వెన్న
కొమ్మాని పెట్టక నంతా — గోరాదెమ్మాల[2] కొప్పించి
॥మా యమ్మాతో॥ 2

తరిగొండా దెమ్మా నైనా నా — దాచ్చిన్యాము లేదంతారు
నొరచే మీ గోడదేవళ్ల — సీదానే వుమ్మేశిపోతా
॥మా యమ్మాతో॥ 3

ద్విపద అని వాళ్ల కల్లోల — నుచ్చట జేసి
పనిబూని వేల్పుల — పైన తా నుమిసి
దుడుకు లెన్నో చేసి — దుడదుడ నురికి
తడయుక కృష్ణుండు — తనతల్లి చెంత
జేరి యుండగ, గొల్ల — చెలులెల్ల గూడ
యూరకే శ్రీకృష్ణు — నుప్పతింపుచును[3]

---

1 దేవమ్మలు — దేమ్మలు — దేమ్మాలు — దెమ్మాలు — ఇది దీని రూప నిష్పత్తి క్రమము 'దేవమ్మలు' అనగా స్త్రీ దేవతలని శబ్దార్థము గొల్లవారు తమ యిండ్లయందొక గోడపై గంధము, పసుపు, కుంకుమల బొట్లతో గుండ్రని దేవతాకృతులను చిత్రించుకొని యుందురు ఆ దేవతాకృతులకు 'దేవమ్మ'లని, 'దేవు'ళ్లని, ఆ గోడకు 'దేవమ్మల గోడ' లేదా 'దేవుళ్ల గోడ' అని వ్యవహారము 'దేవమ్మలు' అనునది మహతీవాచకమేయైనను, అది సమస్త దేవతలకు సూచకముగా వాడబడుచుండును

2 'గోడదేవమ్మలకు' అని యర్థము

3 'కృతేనితనముచేత ఆడిపోసుకొను' అని యర్థము (చూ శర పుట 92).

అడర పిల్లలకు దే — హమ్ముల నొప్పించి
పడి తెల్వి లేకున్న — పడుచుల జూచి
గొబ్బున నాపిల్ల — కున్నల దో
తబ్బిబ్బుపడి తట్టి — తట్టి బిడ్డలను
కుదురుగా తామెత్తి — కూర్చుండ బెట్టి
'యిది యేమి వచ్చె ? మా — కెరిగింపు' డనిన
నిడిబడి నవ్వుచు — వెక్కిరింపుచును
పడుచు లందరు తడ — బడి తరిగొండ
హరిని బెంక్కొని యాట — లాడి సోలుచును
పరగ తల్లుల జూచి — పలికి రిట్లనుచు

ఆ.వె. పాసగ కృష్ణు డేమొ పాడిదెచ్చి పాలలో
తాను గలిపి మాకు ద్రావ నిచ్చె
నందుమీద మేను లెందుండు టెరుగరా
దెవరు మేము ? మీర లెవ్వరమ్మ ?

వ. అని పలికి(న) పడుచులకు బలాత్కారంబుగాచే లంబులు గట్టి, యిలు వెడలనియ్యక వాకిండ్లు బిగించికట్టి తమలో దామిట్లనుచువ్నారు

## దర్వు (శావిరి), ఆదితాళం

చిన్నావాడనుచు ముద్దు — జేసి గోపిదేవీసుతుని
మున్నూ లాలించినది మనకు — మోసమాయెనే | 1
వెన్నా మెక్కి, పాలుపెరుగు — పన్నూగ త్రావి, కుండ
లన్నీ పగలగొట్టె నేడా — చిన్నీ బిడ్డడే | 2
యీ పడుచులాకు మందు — లేమి బెట్టి పోయివాడో ?
లేపినా బిడ్డా లిదేమె — లేవకున్నారే ? 3
యిప్పు డెంతాలేదని[1] యీ — తప్పుగాచి యుండరాదు
తెప్పనా గోపెమ్మా కిది — జెప్పివత్తామే | 4
తరిగొండా నారసింహుడు — లానని దేవళ్లమీద
నెరుగ కుమ్మేసుటాకు[2] స — హింతూ రటరే ? 5

---

1 'ఎంతో లేదు' అనగా 'ఎక్కువగాలేద' అని యర్థము
2 'ఉమ్మివేయుట'కు మాండలిక రూపము

## గోపికల ఫిర్యాదు

ద్విపద అని గోపభామలు — నందరు బోయి
మొనసి యశోద ని — మ్ముగ జూచి యనిరి
ఈ పాప మేమమ్మ ? — యింతి గోపెమ్మ !
పాపడే ననుచు నీ — బాలుని మేము
ముద్దాడుచుంటిమి — మొనసి యివ్వాళ్ళ
పద్దుతో దుడుకు ల — పారంబుగాను
తొడరి చేసినను నీ — తో జెప్పలేక
నడరార[1] నెంతలే — దనుచుంటి, మిపుడు
మాకే యసాధ్యుడై — మాపాలు పెరుగు
వీకతో త్రాగెనె — వెన్నంత మెక్కి
పరగ కుండలనెల్ల — ఎగుల నడంచె
సారిదిగా మాపడు — చుల కేమొ మందు
పావనమ్మైనట్టి — పాలలో గలిపి
త్రావించినాడట ! — దానిచే వారు
సర్వంబు మరచి వ — స్త్రముల వర్జించి
నిర్వాణులై నేల — నిద్రింప జూచి
తగ వెన్నముద్ద లం — దరి శరీరముల
బెగడు నొందక మెత్తి — పిల్లి కున్నలను
వారిమీదికి దోలి — వచ్చినా డిటకు
వీరి పిల్లులు వారి — మేనుల నిండ
తిరిగియాడుచు వెన్న — దినుచున్నగాని
యెరుగరు దేహంబు — లీ వేళకైన
పెనుపొంద నీ బిడ్డ — బెట్టిన మందు
కనువంద విరుగుడే — మది నీవు దెల్పు

---

1 'అడరు + అరన్' అని విభజనము అడరు = ఒప్పు (చూ సూ రా ఆం నిఘంటువు, ప్రథమ సంపుటము, పుట 108)
'ఒప్పారగా' అని యర్థము

తరిగొండ హరియైన — తనకు వెన్నంత
విరివి నియ్యక గోడ — వేల్పుల కిచట
పెనుపొండ పోరల — ద్రుంచితి రనుచు
పనిబూని వేల్పుల — పైన తా నుమిసె
నిపుడు ప్రాయశ్చిత్త — మేమి జేయుదుము ?
నిపుణతతో దెల్పు — నీవు గోపెమ్మ ।

వ  అనిన విని యశోద యిట్లనుచున్నది

జంపె

నాబిడ్డ డిందె యు — న్నాడు, మందులు దెచ్చి
యే బుడుత డటు వారి — కిచ్చినాడమ్మా ? 1
కడగి వేగమె యెర్ర — గడ్డల రసము, చల్ల
పడుచులకు ద్రావించ — బ్రదికించరమ్మా ! 2
పనిబూని వేల్పుల — పై నెవ్వ డుమిసెనో
మొనసి గంజరము[1] ని — వ్వుమ్మగ జల్లరమ్మా । 3
పాల గోడలు గడిగి — సోలి గంధపు బొట్లు
పూలతో హత్తించి — పూజించరమ్మా । 4
మిపాలు ద్రాగుటకు — మీవెన్నలను దినుట
కీ పాపనికి వుట్టు — లెట్లందునమ్మా ? 5
అలర మా తరిగొండ — వారి సాక్షిగానె నుది
తెలియకను వీరుప్ప — తించవలదమ్మా । 6

ద్విపద  అన విని కాంత లి — ట్లనిరి గోపెమ్మ ।
వినుము మావుట్టులు — నీ డందగలడె ?
యని యంటి వది నిజ — మగు గాని, వీడు
మునిముచ్చువలె వచ్చి — మొనసి చేతులకు
వుట్టు లందకయున్న — మసమగా రోళ్ళ

1 గోమూత్రము ఈ యర్థమున 'గంజర' మను పదము ఈ నాడును చిత్తూరు మండల మున వ్యవహారములో నున్నది

నుట్ముల క్రిందికి — నూకించి త్రోసి
యా రోళ్లమీద తా — నవలీల నెక్కి
భోరున వెన్న తె — ప్పున నెక్కి, పాలు
ద్రావి కుండలనెల్ల — ధరణిపై గొట్టు
వా నిధ మెరిగి యే — మన నోరురాక
యూరకే లాలింపు — చుంటి మిన్నాళ్ళు
నేరుపుతో పీడు — వేడు వారింటి
తలుపు మెల్లనె తీసి — తా లోని కరిగి
వలనుగా నూచిన్న — వాండ్లకు తనకు
వుట్టి యందకయున్న — నొకగంప దెచ్చి
వుట్టి క్రిందికి ద్రోసి — యుపమగా గంప
పైన పీటలు బేర్చి — బాలుని దాని
పైనిల్పి తా వాని — పై నెక్కి, మీరి
కుండలో చేబెట్ట — గూడక పాల
కుండ రంధ్రము జేసి — గునిసి వాయూర
బట్టి త్రావుచు జొక్కి — పరవశత్వమున
గట్టిగా మొలనున్న — పుంట వాయింప
గుట్టుగా పొంచి యా — కోమలి బోయి
పట్టబోయిన దాని — పై బడి దుమికి
కట్టల్కతో పాలు — కనులలో నుమిసి
కొట్టి, గట్టిగ దాని — కుచముల ప్చచ్చి
యిచ్చటజేరి యే — మెరుగని గతిని
ముచ్చట జేసేని — ముచ్చు చూపులను
తరిగొండహరి యింత — దంటతనంబు
నెరవాదియై చాల — నేర్చినాడమ్మ!

వ అనిన విని యశోద గోపకాంతలతో నిట్లనుచున్నది

ఆ వె. నన్ను గన్న తండ్రి నిన్ని చందముల పీ
రుపృతింపవలవ దుద్దవిడిని[1]

1 'ఒక్కుమ్మడిగా' అని యర్థము

మీారు పల్కినట్టి మెండుపనుల్ సేయ
బాలు డేగునటర ? భామలార !

వ అనిన విని గోపాంగన లిట్లనుచున్నారు

## దరువు

బాలుడా ? వీడూ బాలుడా ? ||పల్లవి||

తేంపాల గొనితెచ్చి — తెరవలా తొడలలో
నేలాగో గరిపించి — యెగురులాడించును ||బాలుడా ?||ఉ.ప||

పౌఢిమిగా స్త్రీలు — పురుషులు జతగూడి
వేడూక నుండిన — వేళ నక్కడ జేరి
వాడి జేయుచు పెద్ద — కోడే పాముల విసరి
యూడా వారల నడుమ — నవలీలగా నీదు ||బాలుడా? || 1

చాలా నింద్రదపు హేంద్ర — జాలాములను నేర్చి
బాలామణుల నెల్ల — లాలించి రతికేి
మేలిమిగా నల్పే — లీలాల జూపుచు
చీలల్లా ![1] సిగ్గులు — జెరుచుచుండును వీడు ||బాలుడా?|| 2

తరిగొండహరిని న — న్నెరుగిరా ? యని వచ్చి
త్వరగా మాయిండ్లలో — జొరబాడి, పెద్దవాం
డ్లరసి దించగలేని — బరువు కుండలు దెచ్చి
నెరువకా వెన్నంత — వేవేగ దినివచ్చు ||బాలుడా? || 3

ద్విపద మరి యదియును గాక — నా పొరుగింటి
తరుణి మజ్జిగ చిల్క — తరి గిని పోయి
వెనుక నుండగ, నది — వెన్నదీయుటకు
ఎనిబూని వంగగా — భళి ! భళి ! యనుచు

---

1 ఇది ఏవగింతను సూచించెడి ధ్వన్యనుకరణశబ్దము

సుగపోగాపులు తేయు — వాల్గాడి దావి
దిగువటు బడద్రోసి — తినివచ్చె వెన్న.
కామిని యదిపూర్ణ — గర్భిణి దాని
పై మించిపడి యుల్క — పనికె నా జారగ
'చూలాల నన్నంట — జూడకు' మనిన
'బాలుడ నేను త — త్పద్ధతి యెరుగ.
చూ లెట్లు లైతివి ? — సూచింపు' మనుచు
తేలచే గరగించి — కెమ్మోవి గరచి
మాయమాటల బలు — మచ్చిక చేసి
పోయినా డిట్టి య — ద్భుత మెందు గలదె ?
తరిగొండ హరియైన — దండశూకాద్రి
వరుడు మెచ్చునె యిట్టి — వగలు చేసినను ?

(వ అనిన విని యశోద వారితో నిట్లనుచున్నది )

ద్వి. ఇంతులార ! కృష్ణు నీ రీతి నిందించి
పలుకదగునె మీకు భయములేక ?
ఆటవాడు బుడుత డటకు వచ్చిన, వాని
తప్పుగాచి మీరు తాళుకోరె !

(వ అనగా విని గోపిక లిట్లు పల్కుచున్నారు )

## దర్వు, రేగుప్తిరాగం

తరుణిరో ! మే మెట్ల — తాళుదుమమ్మా ?
యెట్లు తాళుదుమమ్మా ?
తామరసాక్షున కిది — తగునటే వోయమ్మా ? ॥పల్లవి॥

మురియుచు నురియుచు వచ్చి — మోహాంధకారమున హెచ్చి
పరగా మాగుట్లన్ని కృష్ణుడు — బట్టబయలుగా జేసి వచ్చె ॥తరుణిరో॥ఉ ప॥

సురతిరో! చిన్నవాండ్ల — చూచినామమ్మా!
మేము చూచినామమ్మా!
యిదిగో! యింతా పుత్రుని — యెందూ గానమమ్మా?
మదమత్తుడై వీడు నేడు — మంద కరిగీన నాజోడు
మురిత నేరినాడే! — ముచ్చువాడే! మోసకాడే! ॥తరుణిరో!॥ 1

మనువు బౌయ్యెడి చిన్ని — మగువాల సొక్కించి
మనసిజాని కేళి దేల్చి — మర్మము భేదించి
వెనకపారి యాచందమ్ము,జనులు — వివరీన చాటించి
మనువు జెరిచినాడే! — మహిమవాడే! మచ్చరీడే! ॥తరుణిరో!॥ 2

నళినాక్షి! తరిగొండ — నారసింహుడై తే
కొలువుండి ఏచే (మొక్కించు — కోవాలె దొరై తే
తులువాతనమున నింత — దొమ్మి జేసితే మాకెంత
యెలమి గలుగునమ్మా? — యేమె కొమ్మా? యెట్లనమ్మా?
॥తరుణిరో!॥ 3

ఆ వె గంప బోర్లవేసి, ఘనపీఠములు పైన
బర్చి,[1] దానిమీద పిన్నవాని
నిలిపి, వానిమీద నెరి నెక్కి యుట్లంది
పాలు(దావు వీడు బాలుడటవె?

వ ఆనిన విని యశోద నవ్వి కృష్ణునితో నిట్లనుచున్నది

జంపె*

వంచించి నన్ను ఒమ — రించి బుడుతనిమీద
మించి యెక్కినది నిజ — మేనటర కృష్ణా? 1

1 బెట్టి — అని యుండిన యతిభంగము కాకుండెడిది

* ఇందు యశోదాకృష్ణుల సంవాదము కలదు

పిలందలును వొత్తి — పాలు బుత్తించి యిపు
రూలికె జెప్పచు — న్నాలు గోపెమ్మా ! 2

దాని పాలే త్రావి — దాని కన్నులనింప
పూని యుమిసినది నిజ — మేనటర కృష్ణా ? 3

సలవితో తలిగొంద — చామితోరే ! పీయు
పలగ జెప్పినవి డ — బ్బులనె గోపెమ్మా ! 4

వ అని పలికిన బుడుత నెత్తి ముద్దాడి, యశోద గోపికలతో నిట్లనుచున్నది

ఆ వె నవ్వు లంతెగాని నాబొజ్జకందవా
డిన్నిపనులు జేయ నెరుగునటరె ?
మీర లుప్పతించ కూరకె, నాబిడ్డ
తప్పలన్నిగాచి తాళుకోరె !

(వ అనిన విని గోపవనితలు యశోదతో నిట్లనుచున్నారు )

## దరువు, కేదారగౌళరాగం

ఎట్లు తాళుదుమో యమ్మా ? యశోదమ్మ !
(మే), మెట్లు తాళుదుమో యమ్మా ? ॥పల్లవి॥

యెట్లు తాళుదుమమ్మ ? మ — మ్మేమేమొ జేసి యీ
పట్ల గోపాలుడు — బలుదుండగీడయితే ॥ఎట్ల॥అ ప ॥

జలక మాడుచు నొక్క — జవరా లుండుట జూచి
చలమూన నచటికి — జని, గునియుచు దాని
విలసితాకృతి మెచ్చెనే ! నా భార్య వీ — వే నని వాక్రుచ్చెనే ! మెల్లగా దాని
కలసే పనికి జొచ్చెనే ! అట కోపింప — గా కుచముల ప్రచ్చెనే! యశోద!
॥ఎట॥ 1

ఆట్లాడవచ్చి మా — పుట్లపై కెగబ్రాకి
చట్లలోపలి వెన్న — సంతోషమున మెక్కి

చల్లంద పరవేసెనే। మా పడుచూల — జతగూడే నని దాసెనే
పూరకే వారి
గుట్లు బయులు జేసెనే। యిదే నుంటె — కొట్లాటంకు దీసెనే। యశోద।
॥ఎట్ల॥ 2

తరిగొండ నరహరి — తమ జాడగా సూరి
తరుణాళ బట్టుట — తగదింక నిచ్చోట
దొరయై [యుండమన] వమ్మా। యిప్పుడు జేసే — దుడుకులు
సరిపోవమ్మా।
నీ కొడుకుకు
నరబుద్ధి నేర్పవమ్మా। మాతో నీవు — వాదింపవలదమ్మా। యశోద।
॥ఎట్ల॥ 3

ద్విపద ఎంవాగ వినవమ్మ। — యిది యొక వింత
తలకొన్న వేడ్కతో — దంపతుల్ గూడి
నిదురింపుచుండగా — నిన్నటి రాత్రి
పదరుచు దొడ్డిలో — పసుల నన్నిటిని
పైరులపై దోలి — పసు లార్చటెంప
వారించుటకు మగ — వా డందు జనగ
తానింటిలో జేరి — తత్పతిరీతి
మీనాంకకేళి కా — మినితోడ లెనగి
యుత్కు నెల్వడ, నాల — నెల్ల మరల్చి
వల్లభు డచటికి — వచ్చిన, దాను
వానికి గనుపడి — వంచించి యురికె
వానాతి జారిణే — యని వాడు దిట్టె
వరతరిగొండ ని—వాసు డిట్లైన
నిరవుగా నిచట మే — మెట్లోర్తుమమ్మ ?

వ అనిన విని యశోద కృష్ణునితో నిట్లనుచున్నది

## దర్వు,* ఆదితాళం

ఆ యింటికి చీకటిలో నీ వెటు — పోయినావురా కృష్ణా ?
నీ, వెటు పోయినావురా కృష్ణా ? 1

వోయబ్బా ! చీకటిలో నే — బోవుదునటవే గోపెమ్మా ?
నే, బోవుదునటనే గోపెమ్మా ? 2

ఆ యింటిల్లాలిని గూడితివట ! — యది యేమిర శ్రీకృష్ణా ?
మరి, యది యేమిర శ్రీకృష్ణా ? 3

ఆ యింతిల్లాలిని గూరుతు పే[1] — రది యెత్తనె గోపెమ్మా ?
మరి, అది యెత్తనె గోపెమ్మా ? 4

పేలిమి పైరులపై పారుగావుల — తోలితివటరా కృష్ణా ?
నీవు, తోలితివటరా కృష్ణా ? 5

వోలల్లా ! తరిగొండ చామితో — రుత్తమాత గోపెమ్మా !
యిది, పుత్తమాత గోపెమ్మా ! 6

అనిన విని యశోద గోపికలతో నిట్లనుచున్నది

ద్విపద ఓ యమ్మలార ! యీ — పుత్త నిందలను
నాయన్నపై గట్ట — నాయంబుగాదు
నెలవుగా మాట్లాడ — నేరని బిడ్డ
బలవంతుడై యింత — పని జేయగలడె ?
పారి చీకటిని జూచి — బూచని చాల
వెరచు నా బిడ్డడు — వింతగా రాత్రి
సమయమం దచటి కే — ఛంధాన వచ్చు ?
భ్రమయక పశువుల — బట్టి తానెట్ల
పలుపుల వదిలించి — పైరులమీద
నులుకక నెటుదోలు — మత్సాహ మెసగ ?

---

* ఇది సంవాద దరువు యశోదాకృష్ణుల సంవాద మిందు కూర్పబడినది

1 'కూరుచు పేరు'నకు వ్యావహారిక రూపము ; 'కూర్చెడు దండ' అని యర్థము.

నా యింటి మగనాని — నవల జోనిచ్చి
యా యింటి యిల్లాలి — నపుడెట్ల గూడు ?
నిట్టి ముద్దుల పాప — దెందైన సతుల
బట్ట నేర్చునె ? పట్టి — పాపంబు గాక
జవ్వనులార ! మీ — సటమాట[1] విన్న
నవ్వడె తరిగొండ — నరమృగేశ్వరుడు ?
పోరి మ మ్మారడి — బొందింప వలదు
పోరె మీ యిండ్లకు — పూబోణులార !

(వ ఆనిన విని గోపకాంత లిట్లనుచున్నారు )

గీ అమ్మ గోపెమ్మ ! మామాటలన్ని నీవు
కల్లలంటివి, మంచిదిగాని, మేము
పోయెదము, నీవు కొడుకును మాయెడలకు
పరువు బారుచు రానీక[2] భద్రమింక

వ అని పలికి గోపకాంతలు తమ యిండ్లకు జేరి, రంత కృష్ణుండు యశోద
చెంత వుండినట్టె వుండి గోపకాంతల యిండ్లకు బోయి అనేకంబులైన
దుడుకులు జేసి, తనంయాడు గోపకన్యలతో నిట్లనుచున్నాడు

## దర్వు. ఆటతాళం

చిత్తబత్తికాయ — చేతగాం నారుచు
నాత్తారుదామె — అత్తామ్మలారా ![3] 1
కూచుంది గురుగూరు — గుంతమూరుచు, తల
లూచుదామా — వో చెలులారా ! 2

---

1 కపటపు మాట (చూ శ ర. పుట 772)
2 'రానీకు' — అనుటకు వ్యావహారిక రూపము
3. 'అత్తామ్మలారా !' — అను సంబోధనకు బాలభాష,

పత్తూగ తరిగొంద — పతి జార మీా రొమ్ము
లొత్తూదునా — నో చేరెలారా ! 3

ద్విపద పెద్దవాం దొత్తారు — పెరతింతిలోను
చద్దు జాయక మూల — జతగూరుకొని
ఆరుమొగుందాత — లాత్తారుదాము ?
మీారు నా పెందాలు — మీాకల్ల పమల
నేరుపుచుంతాను — నే మీా మగరను
తరిగొందహరితోరె ! — దాగిపోవద్దు
పెరిమెతో మిము ముద్దు — బెతు కుంతానె

## దర్వు, ఆటతాళం

పరుచులారా ! రారె — పండ్లు [గోయు] దాముా 1
యుక్కరక్కర బొమ్మ — రిందు గరదాముా 2
ము ద్దాగ చంచార — ములమ జేతాముా 3
తరుచుగ ముద్దుబి — ద్దలను గందాముా 4
తరిగొందసూరి పేరు — తగ బెత్తుదాముా 5

ద్విపద. అని చిన్నికన్నెల — నాదరింపుచును
మనసిజ కేళి స — మ్మతిని దేల్చుచును
పనిబూని యువతుల — బట్టి నవ్వుచును
చెనకి గారడములు[1] — జేసి చొక్కుచును
ఒక యింటిలో నాడి — యొక యింట బాడి
యొక యింటిలో నవ్వి — యొక యింట దిట్టి
యొక యింట మృగఘోష — మొనరింపుచుండి
యొక యింట పక్షి పుం — జొక్కుల దనరి

---

1 ఇది 'గారుడ' శబ్దము యొక్క వికృతి 'మాయ, కపటము' — అను అర్థములలో నిది రూఢి గాంచియున్నది 'గారడి' యను పదము దీనినుండి యేర్పడినదే.

పిల్లెల్ల చిల్లాడి[1] — భామల గూడి
చేలంబులను జించి — చెలరేగి మించి
వెన్నముద్దలు మెక్కి — వేడ్కతో జొక్కి
పన్నుగా చట్లన్ని — పగుల నడంచి
లోగక హల్లక — ల్లోలంబు జేసి
యా గొల్ల గరితలు — యందొక్కదాని
బట్టిన నది భయం — పడి తన యత్త
నట్టిట్టు జామగుచు — నపు డిట్టు బిలిచె

### దర్వు, పంతువరాళి రాగం, ఆటతాళం

ఓ యత్తా రావమ్మా! వోహో — హో యత్తా రావమ్మా! ॥పల్లవి॥
వో యత్త రావమ్మ! — మాయగా నిచటికి
తోయజాక్షుడు వచ్చె — దొంగతనము సేయ ॥నో యత్తా॥ అ.ప॥
ముద్దియ్యమని వచ్చి — మోమెల్ల గరచూచు
హద్దు తప్పి కళ — లంటూచు నిందున్నా ॥ఓ యత్తా॥ 1
నీరి విడిచి పెద్ద — భూతామువలె రెండు
చేతూలతో నన్ను — చిక్కించుకొనివున్నా ॥ఓ యత్తా॥ 2
వరతారిగొండ ని — వాసూడు నా సిగ్గు
మురియూచు చెరచాక — ముందె నీ విచటికి ॥ఓ యత్తా॥ 3

## గొల్ల ముసలిది

ద్విపద. అనుచు కోడలు బిల్వ — నా యత్త వేగ
విని, తెల్లనగు చీర — వెంద్రుకల్[2] గదల
బోలు లిత్తులరీతి — తొడరి పిలిండు
తూలియాడగ, నోట — తుప్పరల్ గురియ

1. చిల్ల + అతి = చిల్లమని ధ్వనియగునటుల కలచివేసి — అని యర్థము.
2. చింపిరి వెంద్రుకలు (చూ. తర పుట 269).

తల వణకింపుచు — తబ్బిబ్బు పడుచు
మలుకుచు, తనకోడ — లున్న చోటికిని
'తరిగొండ నరహరి — దాక్షిణ్యమేమి ?
తరిమికొట్టెద' నంచు — దలచి తా వచ్చె

## దరువు (జావిడి)

ముసిలిది వచ్చెనూ, గొల్లా — ముసిలిది వచ్చెనూ ॥పల్లవి॥
కసరుగొట్ట్వాతనముతోను — విసరాలాడుచు[1] వేవేగ
॥ముసిలిది వచ్చెనూ॥ఉ ప ॥

కోడల ! యిచ్చోటి కె — వ్వాడు వచ్చి నీ పెగ్గెల్ల
నేడు బయలు జేసె ? నది — నిజముగ జెప్పమనుచు ॥ముసిలిది॥ 1
గడగడ వణకుచు, నూత — కఱ్ఱె చేతబట్టుకొని
పొడిదగ్గు దగ్గుచు, పెద్ద — పొట్టల్లాడించుకుంటాను[2] ॥ముసిలిది॥2
తరిగొండావాసూడు శేష — గిరివాసూడు వచ్చెనంటి
విరవూగ వా ఉందెందున్నా ? — డేడి ? యేడి ? చూపుమని ॥ముసిలిది॥ 3

## ఏలలు*

గోపాలుడూ వచ్చెననుచూ — నాపోయి సిర్చితివే నన్నూ
చూపావే వాడిందెందున్నాడో ? వోహో కోడాలా !
— చులుకు[3] తీపి జెప్పా కొట్టేనూ 1
నీ ముందరానే వున్నాడూ — నిను వెక్కిరింపూచున్నాడూ
యేమి నన్నూ జూపామనేవూ ? వో యత్తాగారూ !
— యెదిగి పట్టి కొట్టువూ నీవూ 2

---

1 'కోపమును, విసుగును సూచించు మాట లాడుచు' — అని తాత్పర్యము.

2 'పొట్టల్లాడించు కొనుచును' — అను శత్రర్థకమునకు వ్యావహారిక రూపము

* గోకులమున ఒకానొక అత్తకు, కోడలికి జరిగిన సంభాషణ ఇందు కలదు

3 'చురుకు' యొక్క రూపాంతరము 'చురుకు పుట్టించెదు దెబ్బమనంటి సాధన'మని భావము.

నా వెంతానె యున్నాడని — యనుచు జెప్పె వంతెగానీ
చూచితే వా డిందెందూ లేడే ! వోహో కోడాలా !
— సుళ్లుమాట లనెదే జాణే ! 3

తరిగొండావాసూడా శేషా — గిరివాసూడా నవ్వుచూ, నీ
కురులు బట్టి వంచూచున్నాడే ! వో యత్తాగారూ !
— కొట్టు కొట్టు కొట్టూ మిప్పడూ 4

(వ. అనిన గొల్ల ముసలిది కోడలితో నిట్లనుచున్నది )

ఆ వె. గోపబాలు నిచట కొట్టుమంటివి, వాడు
కానుపించలేదు గాని, నీవు
పెరుగు జిలుకుచుండు, మరల వా డిచటికి
వచ్చినపుడు జెప్ప నారిజాక్షి !

(వ అనిన విని కోడలు అత్తతో నిట్లనుచున్నది )

క. నీ వీ వాకిటి ముందర
కావలిగా నుండు, వాడు క్రమ్మర వచ్చున్
వేవేగ బట్టి కొట్టుచు
నావల బోదరుముచుండు నత్తమగారూ !

వ అని పలికి, యత్తను వాకిట కావలిగా నుంచి, గోపకాంత పెరుగు జిలుకుచు, తన తోడ చిలుకుచున్న చెలులతో నిట మనుచున్నది :

## దరువు

పెరుగూ బిరబిరా జిలుకారమ్మ వోయమ్మాలారా ! ॥పల్లవి॥
అరవుధతే కిపు డరిమురి కవ్వము
లురువడి మరిమరి — గిరిగిరి[1] దిరుగగ ॥పెరుగూ॥ఉ ప॥

---

1. ఈ శబ్దము 'గిరిగిరిగోలు' అనుదానిలోని 'గిరిగిరి' వంటిది 'గరగర' — అని యర్థము

కలకంఠులారా! గోపాలుడూ, నే తొలుత పెరుగు
చిలుకా సన్నాహమై నప్పుడూ, తా నిచ్చోటికి
మొలకానవ్వుతో వచ్చినాడూ, పాలిండ్లు బట్టి
యుంకావ ద్దిందు నన్నూ గూడు
కులుకులాడి! యని పలుకుచు నన్నిపు
డలకించినా డావల నుండగ ॥పెరుగా॥ 1

సందూగొందూల డాగినాడూ, వచ్చితే వెనుక
ముందూ ఎనులూ చేయువీడూ, వాడేమొకాని
మందూ మంత్రములు నేర్చినాడూ, వాని జూచితె
పొందూ కోర్కె బుట్టూ నెప్పుడు
సుందరమందల కందర్పుడు[1] వా
డిందు రాకముం దందరు గుముగుంగ ॥పెరుగా॥ 2

తరిగొండ నారాసింహాడైనా శేషాద్రివిభుడిం
దరి మానముల నెట్లనైనా దక్కించితేనె
నరిగాని, లేకయుంటె శానా మోసము పచ్చు
నరవిందాక్షుల కట్లగానా
పరువిడి కృష్ణుం డురువడి నిచటికి
చొరబడి వచ్చిన తరువుద మాపల ॥పెరుగా॥ 3

ద్విపద అనుచు నొండొరుల నం — దవసరింపుచును
గొనకొని పెరుగు జ — ల్కుచు మన్నవేళ
వచ్చి గోపాలుండు — వాకిటి చెంత
నచ్చుగా కాపున్న — యూ ముసిల్దాన్ని
వెక్కిరింపుచు, తల — వెంట్రుకల్ బట్టి
తక్కక సీడ్చుచు — దాని కన్నులకు
కనుపడకుండ లో — గా (ప్ర) వేశించి

---

2 'సుందరతకు మేర యగు మన్మథుడు' అని యర్థము
(మందల = మేర, చూ శ ర పుట 596)

తనుమధ్యలను బట్టి — తగ గుట్ను చెరిచి
పెరుగు పాల్ చిల్గాడి — బెదరించి, చాల
మురిపి గ్రక్కున వెన్న — ముద్దలు మెక్కి
యంతట [తరిగొండ] — హరి గోపిదేవి
చెంత ముద్దులు జూపి - చిరుత చందమున
నాట్లాడుచుండగా — నా గోపసతులు
కొట్లాడ నత్తమ — కోరి దోడుకొని
పోయి, నందుని గృహం — బును ప్రవేశించి
యాయశోదను బిల్చి — యంద రిట్లనిరి

## గోపికల ఫిర్యాదు

### దర్బ, అటతాళం

పొలతి! కృష్ణుని వలన[1] — పొయ్యెదనమ్మా! ॥పల్లవి॥
యెలనాగ! నిను జూచి — యెందు పోజాలక
యున్నాళ్ళ తాళితి — యిక తాళనమ్మా! ॥పొలతి॥ ఉప॥

పండ్లు గొనే చిన్న — వాండ్లను బెదరించి
పండ్లన్ని మెక్కి, మా — యిండ్లలో జొచ్చి, జవ
రాండ్లను జూచి తా — పెండ్లాడే ననగ, వూ
బోండ్లు దిట్టితే పుట్టు — చెండ్లను, గజనిమ్మ
పండ్లను, బంగారు — గిండ్లను వాండ్ల పొ
లిండ్లపై వేసి, సొ — క్కించె గదమ్మా! ॥పొలతి॥ 1

కొట్లాడు కొమచు మా — తోట్లలో జొరబడి, పొన్న
చెట్లెక్కి పూల్గోసి — పొట్లాలుగా దెచ్చి
యాట్లాగే చినచిన్న — బొట్ట[2]వళ్ళలో నించి
నోట్లోనే విడెమిచ్చి — రెట్లు బట్టుక మేలు

1 కృష్ణుని ఉద్దేశించిన (కృష్ణుడు కారణమైన) వలన,
2 బొట్టెలు=చిన్న పిల్లలు

కట్టు మేడ జేరి — యెట్టునో జేసింత
గుట్టు జెరిచె నిం — కెట్లా వో యమ్మా! ॥పాలతి॥ 2

*బాలునివలె వచ్చి — స్త్రీలను జూచి, కు
చాలమీదను పెద్ద — తేలుల బడవైచి
చాలగ గరిపింప, — నోలల్లా! యని వార
లాలో భీతిల, తాను — వేలు మంత్రజ్ఞుడై
తేలుమంత్రములు మం — త్రించె గదమ్మా! ॥పాలతి॥ 3

దిట్టడై వచ్చి మా — పుట్టిపై పాలన్ని
పొట్టనిండా త్రావి — చట్టి పడవైచితే
కొట్టెద ననుచు మా — కోడ లప్పుడు తన
జుట్టుపట్టీడ్చితే — నట్టె యప్పుడె దాని
ఎట్టుగా కౌగిట — గట్టిగా బిగబట్టి
వొట్టిగా బరజేసి — వురికె గదమ్మా! ॥పాలతి॥ 4

చుక్కలరాయని — టెక్కున మాయింటి
కొక్కడే వచ్చితే — చక్కని బిడ్డాని[1]
యెక్కువగాను నే — నక్కున జేర్చితే
చక్కెరకెమ్మోని — వొక్కి తేలింపుచు
నెక్కడెక్కడనో బల్ — చక్కిలింతలు జేసి
చిక్కించుకొని చాల — సొక్కించెనమ్మా! ॥పాలతి॥ 5

అండబాయక తరి — గొండలో నెంకోని
దండిగ నంతట — నిండియున్నా డఖి
లాండకోటి బ్ర — హ్మాండ నాయకుడని
పండితు లెన్నుచు — నుండగా నితడింత

* తక్కిన చరణము లన్నిటిలో ఆరేసి పాదము లుండగా ఈ మూడవ చరణమున మాత్రము ఐదు పాదములే యున్నవి ప్రతిలేఖకుడు పొరపాటున నొకపాదమును వ్రాయక విడిచి యుండును

1. 'బిడ్డ+అని' — ఇది వ్యావహారిక భాషయందలి సంధి రూపము

మెండుగ మాయిండ్ల — దుండగములు జేసి
దిండీడై[1] విహరించే — తిరేమో యమ్మా ? ॥పాలతి॥ 6

ద్విపద మానినీ! యివిగాక — మరియొక వింత
నేను జెప్పెద విను — నిన్నటి దినము
మిక్కిలి నొకరింట — మీగడ తాను
మెక్కి, కోడలిమూతి — మీదట కొంత
మొత్తి తా నరుగగా — మీగడ లేక
అత్త కోడలి జూచి — యాగ్రహింపుచును
తత్తరింపుచు మహా — దండంబు బూని
మొత్తె 'మీగడ కిదె — ముచ్చురా!' యనుచు
నీరింటి బానల — వెన్న తా మెక్కి
వారింట నా ఘటా — వళులన్ని బెట్టి
చనగ, వంతట వీరు — జాడ బట్టుకొని
పెనగొని సిగపట్ల — బేరంబుగాను
వారు వీరును పెద్ద — వాదాడ, నందు
జేరి ధర్మంబులు — జెప్పె నీసుతుడు
సుతులు లేరని యొక్క — సుదతి చింతింప
'మతిశాలివై నన్ను — మగనిగా గొనిన
సుతుని బుట్టించెద — సుందరీ!' యనుచు
హితము జెయదలంచె — నిది యెందు గలదు ?
వెరగైనదిప్పు డు — ర్విని తరిగొండ
పురనాయకుం డెంత — పోకిళ్లమారె!

(వ అనిన విని యశోద గోపికలతో నిట్లు పల్కుచున్నది )

## దర్వు (జావిడి), మధ్యమావతి రాగం

నా బిడ్డ నెందు కిట్లవేరే ? వోయమ్మలారా!
నా బిడ్డ నెందు కిట్లనేరే ? ॥పల్లవి॥

1 'దిండు+ఈడు' = కాసె కట్టినవాడు (చూ శర పుట 389) అట్టివాడె సన్నద్ధుడైనవాడని భావము

శాబా సబ్బైతే బాగైనది యీ బాలుడు మీ
యిండ్లకు వచ్చున ? ॥నా బిడ్డా నెందు కిట్లనేరే?॥ఉ.ఎ॥

తొట్లాలో సవ్వళించేవాడూ నాతోనైనాను
మాట్లాడగానైతేనే రాడూ, మీ యిండ్లలోని
కెట్లా చొరవగ వచ్చినాడూ ? బళువైన వెన్న
చట్లా నేరీతి దించు వీడూ ?
గుబ్బెల్లను బలు రట్లా[1] బెరుగక
మట్లుమీరి నగుబాట్లకు వెరువక ॥నా బిడ్డా॥ 1

యిదివరకు దొగ్గాడినాడూ, నూత్నెల్లనాడూ
ముదముతో లేచి నిలిచినాడూ, తప్పడుగే గాని
పదిలాముగానూ నడవాలేడూ, బలభద్రుతో మా
సదనాములో నాట్లాడు వీడూ
తుదమొద లెరుగక పదరుచు నందరు
సుది జెడి పలుమరు కొదవల నెన్నుచు ॥నా బిడ్డా॥ 2

మెల్లా లాలించి, మంచి చల్లా ద్రావింపబోతే
వొల్లాక కనుమూసు, నాపై నెల్లా యిట్లావాడు మీ
చల్లా పాలును వెయ్యి కొల్లాబెట్టానేమమ్మా ?
జెల్లా ! మీమాట లెంత కల్లా ?
యిల్లాం డ్లను భయమెల్ల విడిచి బలు
పొల్లుమాట లనజెల్లదు సారెకు ॥నా బిడ్డా॥ 3

కోరీ యాట్లాడియాడి సొలసూ, ముకురము చెంత
జేరీ తన నీడ జూచే జడసూ, నాబాలుడు మీ
నారీమణుల నెట్లాగలసూ ? అద్భుతమేకాని
నూరాకే యెట్లా నీసికి దెలుసూ ?
కూరిమి దలచక నారడిజేయుచు
దూరకురే ! మీ పో రిక జాలును ॥నా బిడ్డా॥ 4

---

1 రట్ల + ఆట = రట్లాట ఇది 'కొట్లాట' వంటిది రట్టు = నింద (చూ శ.ర. పుట 660) 'నిందలపాలగుట' యని తాత్పర్యము

తరిగొండహరిపై నెనరూ లేదా ? యిటువంటి వ ౦ద్దు
తనయూల గన్నారు లేదా[1] ? మీబిడ్డలవలెనే
పరబిడ్డలను జూడరాదా ? తెల్లావారేది
త్వరగా నాతో మీకింత వాదా ?
సరిసరి యందరు నరిమురి బాలుని
వరిమురి దూరుట[2] మర్యాదగునా ? ॥నా బిడ్డ॥ 5

(వ అనిన విని గోపికలు యశోదతో నిట్లనుచున్నారు )

## దరువు, రేగుప్తిరాగం, మట్టెతాళం

చిన్ని గోపాలు డేమెరుగ డంటేను — చెలియ వే మేమందుమీ ? ॥పల్లవి॥
ఎన్నాళ్లో రుత్తము । గన్నాతల్లి ? మీ — చిన్నావాడు మా
వెన్నాకుండలు — భిన్నములు జేసే మొన్నా
సన్నాగా బెదరించి — సట్టుదావ ని యంటె
యెన్నెన్నో వన్నెలను, వింతా చిన్నె — లరుదుగా ఒన్నె ॥చిన్ని గోపాలు॥ 1
కచ్చా[3] లాడుచు వచ్చా, మాయిండ్ల — జొచ్చా, కానుకలు
దెచ్చా, కన్యల కిచ్చా — ఘనముగా మెచ్చా
పచ్చవిల్తుని కేళి — పణతుల దేల్చా
దనుజుల గెల్చా — తానింత హెచ్చా ॥చిన్ని గోపాలు॥ 2
బాలామణులైన స్త్రీలా జూచి, కు — చాలా మర్దించి
లీలా బెంచి ఏ — శాలావుదమొం దీ వేళా
యేలా గోపాలకు — డిండ్లిండ్లు జొరబాడి
పాలా వెన్నల — పూంపర్నాలా చిల్లాడె చాలా ? ॥చిన్ని గోపాలు॥ 3

---

1 'కన్నారా, లేదా ?' — అని భావము 'చూచినావు లేదా ?', 'చెప్పినాను లేదా ?', 'ఉన్నారు లేదా ?' — మున్నగు ఇట్టి వాక్యప్రయోగములు తరిగొండప్రాంతమున నేటికిని నిత్యవ్యవహారమున నిలిచియున్నవి

2 'నిందించుట' అని యర్థము

3 కలహములు (కలహపు మాటలు)

ఆడావారుండె జాడా కని తాను — జూడావలెనని
మేడాపై కెక్కి జాడా పూల్ జుట్టి — మాడా తొసగూచు, క్రీడ
వేడూక మీరగా — వింతవింతగ నల్పి
వాడొకమేడా — వనితలతోడా దిగె మేము జూడా ॥చిన్ని గోపాలు॥ 4

షట్లా చినవాండ్ల జాట్లా ముడివేసి — మొట్లా మొట్టుచు
కొట్లా కొట్టుచు — నాట్లా[1] నాడుచు, నుట్లా
యెక్కెట్లనో యెక్కి — యింపుతో నెయి దాగి
యట్లనె చట్లా — నందుంచి గుట్లా కనివచ్చె నిట్లా ॥చిన్ని గోపాలు॥ 5

అమ్మా! వినవే గో — పెమ్మా! నీకొడు
కన్మా! బహుదుడు — కమ్మా! మన్మనకవమ్మా!
యిమ్మహిలోపల నిటువంటి బాలకు డెందుతే
డమ్మా! యిత డొకరి — సొమ్మా? మాయకాడమ్మా! ॥చిన్ని గోపాలు॥ 6

పుండరీకాక్షు డండాయె, తరి — గొండా పాలింపు
చుండాడని జనులు — నిండా పొగడుచునుండా
దుండగీడైనాడు — లొలగకాజాండ
తతులు పిండాండములు — (తన) కుక్షినుండ ॥చిన్ని గోపాలు॥ 7

ద్విపద. ఏమమ్మ గోపెమ్మ! — యీచిన్నిబిడ్డ
డేమెరుగ డటంచు — నిపుడు బల్కితివి
ఎరుగనివాడైన — నింటింట వెన్న
తిరముగా మ్రుచ్చిలి — తిన నెట్ల నేర్చె?
పాలు ద్రావుచు — చట్లు పగులగొట్టుచును
చేలముల్ జించుచు — చెలగి దొంతులను
పడద్రోసి నవ్వుచు — బాబామణులను
విడిబడి కూడుచు — వింతగా నుట్ల
పై కెగ్రాకుచు — పల్మారు పెరుగు
జోకగా ద్రావుచు — జొచ్చి మాయింద

1 జటలు

ధనము పోజల్లుచు — 'తరిగొండవాసు
డను వాడు నేనె, నా — కన్యుడె ?' యనుచు
నిన్ని మాయలు బన్ను — టేరీతి నేర్చె ?
పన్నుగా గన వీడు — బాలుడేమమ్మ ?

(వ. అనిన విని యశోద శ్రీకృష్ణునితో నిట్లనుచున్నది )

## దరువు* (తావిడి)

వీరి మాటలన్ని దెలియ — వింటివటరా కృష్ణా ?
నీవు, వింటివటరా కృష్ణా ?
వారి నోత నబద్ధాలు — వత్తావె గోపెమ్మా ! 1

చెలగీ వారి వెన్నాలూ ౖము — చ్చిలితివటరా కృష్ణా ?
(నీవు,) ముచ్చిలితివటరా కృష్ణా ?
యుల వెన్నా మన యింతిలో లే — దంతావే గోపెమ్మా ? 2

వెలలేని పాలెత్తుకొని ౖదా — వితివటరా కృష్ణా ?
నీవు, ౖతావితివటరా, కృష్ణా ?
యులరాగ నా కరుసంతా గొ — ప్పంతావే గోపెమ్మా ? 3

తులువాపై దొంతూలు పడ — ౖదోసితివటరా కృష్ణా ?
(నీవు,) పడౖదోసితివటరా కృష్ణా ?
యుల దొంతూలూ దోచే బలముం — దంతావే గోపెమ్మా ? 4

చేరి వారీ చీరలు నీవు — చించితివటరా కృష్ణా ?
నీవు, చించితివటరా కృష్ణా ?
వూరికే జెప్పె రీ మాత — లూలక్కే గోపెమ్మా ! 5

గెంటాకా వారి పుట్లా — కెక్కితివటరా కృష్ణా ?
(నీవు,) యెక్కితివటరా కృష్ణా ?
యంటే పుత్తూలూ నా — కందునంతావే గోపెమ్మా ? 6

---

* యశోదాకృష్ణుల సంవాదమును వివరించు దరువులలో ఇది యొకటి

భామాలా తేలించి నీవు — పట్టేతివటరా కృష్ణా ?
నీవు, పట్టేతివటరా కృష్ణా ?
భామాలా పత్తేతందుకు — పని యేమే గోపెమ్మా ? 7

ధనమూ వెదచల్లినాది — తథ్యమేనటరా కృష్ణా ?
అది, తథ్యమేనటరా కృష్ణా ?
ధనమున్నా చోతూ నాకెలుగా — తరమంతే గోపెమ్మా ? 8

తరిగొండాహరితోడూ నీ వే — మెరుగావటరా కృష్ణా ?
నీ, వే మెరుగావటరా కృష్ణా ?
తరిగొండాహరితోడె ! నే నే — మెరుగానే గోపెమ్మా ! 9

ద్విపద. అనుచు బల్కిన సుతు — నాదరింపుచును
దనర నా గోపనుం — దరుల నీక్షించి
ఆ యశోదాదేవి — యవ్వ డిట్లనియె
*నాయమ్మలార ! మీ — రూరకె లేని
పోని మాటలు దెచ్చి — బుడుతని మీద
నానావిధంబుల — నాతోను చాడి
జెప్పెటె కాని, నా — చిన్నారి కంద[1]
డిప్పు డా పనులు తా — నెటు జేయగలడు ?
తరిగొండహరితోడె ! — దాక్షిణ్యముంచి
యరపి నా బిడ్డ నే — మనవద్దు పోరె !

(వ అనిన విని గోపసుందరులు యశోదతో నిట్లు పల్కుచున్నారు )

ఆ వె గోపిదేవి ! నీవు కొడుకు జేసిన తప్పు
తెరుగలేవు. నువ్వు నిట్లనేవు
మంచి, దైన నీ కుమారుని మాయిండ్ల
జేరనీక బుద్ధి జెప్పవమ్మ !

---

* 'ఓయమ్మలార !' అని యుండదగును అట్లైనచో యతిమైత్రి కుదురుచున్నది

1 'కందు' అను దేశ్య శబ్దముయొక్క మహద్వాచక రూపము 'కందడు' అనగా పసివాడని భావము

వ అని చెప్పజెప్పి, గోపకాంతలు యశోదచేత సెలవు తీసుకొని తమయిండ్లకు బోయి పెరుగు చిలుకుచు వొక్కరిజూచి వొక్కరిట్లనుచున్నారు

## దర్వు (జావళి)

దధి మధియింపుదమమ్మా !
ధేను, దధి మధియింపుదనమ్మా ! ||పల్లవి||

దధి మధియింతము — దధి దేవాసురు
లధికోద్ధతులయి — యప్పనాడు దరచినట్ల ||ఉ.ప ||

ప్రొద్దున మేల్కొని నేడు, తన
హద్దున నిల్వక వాడు
ముద్దుల కృష్ణుడు — రచ్చలు[1] జేయుచు
పద్దులతో మన — వద్దికి రాకమున్నె ||దధి|| 1

సుడియుతనంబున[2] వచ్చి, తుం
డుడుకులు జేయుచు హెచ్చి
విడిబడి నల్లవాడు — దుడదుడమని పరు
విడి యడయడ[3] చ — ట్లడవకమున్నె మన ||దధి|| 2

ఆడుచు పాడుచు చెలగి, చిన్ని
చేడెల పొందుల మెలగి
వేడుకలర మన — వాడల నెయ్యి పాల్
పీడక గొని చి — ల్లాడకమున్నె మన ||దధి|| 3

సకలము తానని పలికి, బా
లికల కుచంబులు చెనకి
కకనికపడ వికి — వికి నవ్వుచు, తక
ముక[4] పడజేయుట — కిక వాడు రాకమున్నె ||దధి|| 4

---

1. అల్లరులు (చూ శ.ర పుట 661)
2. 'తులువతనమున' అని యర్థము (చూ. శ.ర. పుట. 792).
3. 'అడ, అడ (అక్కడక్కడ)' అని యర్థము
4. 'తికమక'కు వ్యావహారిక రూపము

మురియుచు నుట్టుల కెక్కి, వెన్న
ముద్దలు మెక్కుచు జొక్కి
వర తరిగొండ ని — వాసుడు సన్నగ
గిరి నిలయుఁడు తొం - దరవేయకనున్న ||దరు|| 5

వ అని యిట్లు పెరుగు చిలుకుచుండ, రంత కృష్ణుండు తల్లి చెంత నుండినట్లనె యుండి గోపకుల యిండ్లకు బోయి అనేక జారచోర వినోదంబులు జూపుచు తనయీడు బుడుతలతో నిట్లనుచున్నాడు

## దరువు. అటతాళం

అప్పాలంతా తిప్పాలంతా — నారుకుందామే ! ||పల్లవి||
వెన్నెల కుప్పలు బోత్తాను జోరు — గూరుకుందామే ! ||అప్పాలంతా|| అ ||
చిలబిలా గిలిగిట్లందు — చిలుగుచుందామే !
మా, కల లేకుంతే కన్నామూచ్చి — లాలుకుందామే ! ||అప్పా|| 1
కరువోపుప్పుల దండాలు — కట్టుకుందామే !
మనసు, మెరా నిండా — వేచుకుందామే ! ||అప్పా|| 2
పూని తరిగొండా వామిని — పూజా జేతామే !
యిందు నేను మీరల్లా[1] పనూలు — నేర్చుకుందామే ! ||అప్పా|| 3

ద్విపద అనుచు కన్యలతోడ — నాట్లాడుచుండి
మొవసి యింటింటి కి — మ్రుగ పోయి పోయి
తేలుసిల్లల బట్టి — తిన్నగా సేతుల
పాలిండ్లపైన నే — ర్పడ గరిపించి
పాముల గొనిపోయి — బానులమీద
వేమరు వేయుచు — వెరపించి నగుచు
తొడరి క్రూరల జాట్లు — దూడల తోక
లడర గూరిచి కట్టి — యపుడు ధూడలను
పరువు లెత్తించి యూ — బాలకు లరువ
గరిమతో తాను వి — కావిక నగుచు

1. 'మీరల్లా' అనగా 'మీరందరు' అని యర్థము.

తుదమొదల్ గనరాని — దుడుకులు జేసి
చెదరక తను తల్లి -- చెంగట జేరి
తరిగొండవారి యున్న - తరి గోపసతులు
వెరచి తనత్త[1]తో — వేగ నిట్లనిరి

## దరువు

అత్త వింటివా ? నో — యత్త వింటివా ? ॥పల్లవి॥

మేము, తత్తరింప తెల్లనల్ల — తాపూల గరిపించె కృష్ణ
॥అత్త వింటివా ?॥అ ప॥

నలుకు[2]నాడి శిశువులకు — కలుకమాని యొక్కు
నలుబాలెక దిగమంత్రించే — ఎంటా వాడు చేతులు సాచె ॥అత్త॥ 1

యాదం బుడుతాల జాట్లాలు — దూడల తోకాల గట్టి
జోడు జోడుగా నే దెబరు — లాడించి నవ్వాడు సురికె ॥అత్త॥ 2

పాములాను దెచ్చి, చిలికే — భామాల పాలిండ్ల మీద
వేనారు విసరివేసి — వెరపించి గేలించి యురికె ॥అత్త॥ 3

అప్పుడు వాడందు మమ్మా — కొప్పరించి[3] చేసినట్టి
తప్పనవాలన్ని నీతో — చెప్పటాకు సిగ్గౌతుంది ॥యత్త॥ 4

కుండ లడిచి యడిచి, తారి — గొండవాసుడైన పైని
గొండవాడు తానే నాని — కూతాలు బెట్టాయి సురికె ॥అత్త॥ 5

వ అని సళుకుచేత నెగురుచున్న కోడండ్ర నూరడించి, అత్త యిట్లనుచున్నది.

---

1 'తను+అత్తతో' అని విభజనము ఇది వ్యావహారిక సంధిరూపము

2 'సళుపు'యొక్క వ్యావహారిక రూపము. తీవ్రమైన బాధ, పోటు — అని యర్థములు. (చూ శ ర పుట 784)

3 విజృంభించి (చూ శ ర. పుట. 200).

## దర్వు, అటతాళము

మంత్రింతునటరే ? నే — మంత్రింతునటరే ? ॥పల్లవి॥

మంత్రముగా నల్ల — చావూల భూతితో ॥మంత్రింతునటరే ?॥ఉప ॥

నాయుల మల్లిని — మలయాళ భగవతి
నీ యెడ దలచి, నే — నీ సళుకును దిగ ॥మంత్రింతు॥ 1

పచ్చి మిరియపు ముద్ద — లచ్చోట్ల హత్తించి
హెచ్చు మంటలు దిగ — నిపుడు నీకెల్ల నే ॥మంత్రింతు॥ 2

వరశేషశైల ని — వాసూని తరిగొండ
పుర నారసింహాని — స్మరణజేయుచు మీకు ॥మంత్రింతు॥ 3

## తేలు మంత్రము

వ అని పలికి, సళుకుచేత నళుకుచున్న తళుకులాడుల బెళుకు జూచి విభూతి చేతబట్టి 'భూ మాయుల మల్లి మళయాళ భగవతీ। వందవర చౌడేశ్వరీ। నారాయణవనం ఆవ్వాయాక్షి ఎరనేశ్వరీ। శివకంచి యేకామ్రేశ్వరీ। జంబుకేశ్వరాఖిలాండేశ్వరీ। అరుణాచలేశ్వర వున్నామలేశ్వరీ। కాళహస్తీశ్వరాజ్ఞానాంబ। భక్తజనావలంబ। సద్గుణకదంబ। మదంబ। చిదంబరేశ్వర శివశంకరి। శ్రీశైల భ్రమరాంబ। కాలభైరవ। గణేశ్వరా। కోళాలమ్మా। కొల్లాపురెమ్మా![1] తాళపాక గంగమ్మా। తాతయ్యగుంట గంగమ్మా। మికు మ్రొక్కెద యీ కులుకులాడు(ల)' సళుకు దించుడు తరిగొండ నారసింహుని తోడే। నాకు జెప్పిన గురుపాదమానే।[2] దిగు, దిగూ।

శ్రీరంగనాయక। శ్రీజగన్నాయకా।
వర యహోబలవాస। వరదరాజ।
తిరుపతిపుధానాం। తిల్లగోవింద। కో
దండ రామోద్దండ దనుజభీమ।

1 ''కొల్లాపురి+అమ్మా!' అని విభజనము ఇది వ్యావహారిక సంధిరూపము
2 'గురుపాదము+ఆన+ఏ।' — గురుపాదముయొక్క ఆజ్ఞ సుమా।
(ఓ సళుకూ। త్వరగా దిగిపొమ్ము) అని భావము

శ్రీవరాహస్వామి । శ్రీశేషగిరివర ।
శ్రీనివాసానంత చిద్విలాస ।
చండప్రతాపమార్తాండ స్వరూప । శ్రీ
తరిగొండ నరసింహ । సురనుతాఖ్య ।

గీ. కలికికృష్ణుండు వచ్చి యా కులుకు చెలుల
నళుకజేయుచు వారి రహస్యాంగములను
తేళ్ల గరిపించెనట నళ్కు దించు' మనుచు
పలికి మంత్రించి ముసలావె పసుకు దించె

క. అటు నళుకు దిగిన తరి సతు
లటునిటు బో కంద రతిగి యగ్గోపెమ్మన్
ఘటుంగ్రమతిని కనుగొని
పటురోషము మీర నిట్లు పలికిరి వరుసన్

## గోపెమ్మ, గోపికల వాగ్వాదము

### దర్బ్యా, ఆటతాళం

ఏమమ్మా గోపెమ్మా ! — యేమమ్మా గోపెమ్మా ।
యేమమ్మా గోపెమ్మా । — యేమె గోపెమ్మా । ॥పల్లవి॥

కాపురములా జేయ — గానీదు మమ్మిక
నీపాప శీ మాట — నిజమె గోపెమ్మా । ॥ఏమమ్మా॥ 1

బెరసి యా పల్లె కా — పురముగా పాలించ
పొరుగూళ్లకైనాను — పాయ్యేం గోపెమ్మా । ॥ఏమమ్మా॥ 2

తరిగొండ హరితోడె । — పరగ నీ కొడుకు మ
మ్మిరవుగా నిందుండ — నియడె గోపెమ్మా । ॥ఏమమ్మా॥ 3

(న అనిన విని యశోద నారితో నిట్లనుచున్నది ;)

ఆ వె చేడెలార! యిచట చిన్నికృష్ణుండు నా
యొద్ద నుండగానె, దద్దిలుచును[1]
వచ్చి వీనికొరకు వలచు టోదు మటంటి
వెచట నున్న బిడ్డ రౌని పెన[2]

(వ అని విని యా గోపసతు లిట్లు పలుకుచున్నారు )

ద్విపద వినవె యశోద! బల్ — వింత యింకొకటి
యిసుమంద నీ బాలు — డాడుచు వచ్చి
తులువయై మా కోడె — దూడ తోకలకు
వడనొప్ప మా చిన్న — వాండ్ల జుట్లకును
ఏకతో ముడివేసి — పిడితో దోలె
నా కోడె లగురుగా — నా చిన్నవాండ్లు
అదరి కుయ్యోమొరో! — యని కూత లిడగ
పడసడి తా నంటు - పకపక నవ్వి
పరువెత్తి వచ్చె నీ — బాలు డిచ్చటికి
వెరచి తోకలు, జుట్లు — విడిపించలేక
ఎనిబూచి కోడెల — బట్టి మెల్లగను
చినవాండ్ల జుట్లు నీ — డ్చిలి పెంత తడవు
క్రితరిగొండ న్న — సింహాని తోడె!
ని తనూజాడు బహు - నిర్మోహకుండె[3]

---

1 'దద్దరిల్లు' అనునది దీని మొదటి రూపము ఇది యుచ్చారణవశమున క్రమముగా — దద్దిర్లు — దద్దిల్లు — దద్దిలు — అని మార్పు నొందినది

2 'పీడజేసితిమి' అని యర్థము పీడుచు = పీడజేయు (చూ శ ర పుట 726)

3 'నిర్వాహకుండె' అని యుండదగును అప్పుడైన అర్థము చక్కగా సమన్వయించును అట్లుగాక, 'నిర్మోహకుండె' అనునది జానపదుల వ్యవహారములో ('నిర్వాహకుండె' అను అర్థమిచ్చెడి) కృతక ప్రామాణిక రూపముగా మాఱియుండవచ్చును గోపికలు జానపదులు గావున కవయిత్రి వారినోట ఆ రూపమును యథాతథముగా పల్కించెనని తలపదగును

## దర్వు* (జావిడి)

ఈ మాటలు కల్లాలని — యెంచుకోకవమ్మా!
నీవు, యెంచుకోకవమ్మా!
యీ ముద్దునా డందురాలే — దెట్ల నిజములవమ్మా?
మేమెా వీని మాయలు — యెరుగగూడదమ్మా!
మా కెరుగగూడదమ్మా
రామరామ! బిడ్డ నేల — రవ్వజేసేరమ్మా? 1

మమ్మిట్లా రవ్వజేసేది — మంచిదటావమ్మా?
యిది, మంచిదటావమ్మా?
మిమ్మెవ్వారు తచ్చురా — కిమ్మెయి బిలిచీరమ్మా?
మమ్మా రచ్చకు దీసెది — మాధవుడేనమ్మా!
యీ మాధవుడెనమ్మా!
యిన్నాహి న్యాయము లి . ట్లెందు[క] నేరమ్మా? 2

ధ . యశోద! యిది — బాగాయ నో యమ్మా!
యిది, బాగాయ నోయమ్మా!
పళపళాగా మీ రిచ్చోట — నదరవల దోయమ్మా!
కళవాళముగా నీవు మమ్ము — గదిమేదేల నమ్మా?
నివు, గదిమేవేల నమ్మా?
ఫెళఫెళాగా మీరైతే సా — ఎంపవచ్చునమ్మా? 3

మాకు నీ కొడుకుమీద — మచ్చరమటమ్మా?
మాకు, మచ్చరమటమ్మా?
లేక వీనిలో లవ్వలు — లేవుగదరమ్మా!
యీ కుచోద్యపు మాట లి — ట్లెందు కనేరమ్మా?
యిట్లెందు కనేరమ్మా?
మీ కుచోద్యములే కాని — మేమే మెరుగామమ్మా! 4

---

★ గోపికలకు, యశోదకు జరిగిన సంభాషణ మిందు గలదు ఈ సంవాదము దీని తరువాతి కంరద దరువులోను కొనసాగినది

మగువాల వీడు బట్టేది — మంచిదటవమ్మా ?
యిది, మంచిదటనమ్మా ?
మగువాలు యిలా బడగతాని కే — మాడ్కి జిక్కిరమ్మా ?
వగకా డేసెా మాయజేసి — వంచించినాడమ్మా !
వీడు, వంచించినాడమ్మా !
తగని నింద లిట్లు గట్టా — తగదింకా పోరమ్మా ! 5

నిందలుగా వీ మాటలు — నిక్కములే నమ్మా !
యివి, నిక్కములే నమ్మా !
కందడెట్లా లరుణులాను — కనగూడదా నోయమ్మా ?
సందేహములేదు వీడు — జారుడె నోయమ్మా !
వీడు, జారుడే నోయమ్మా !
మంచమేళముగా[1] నిట్లు — మాట లనకుమమ్మా ! 6

యింకా నీ కొడుకూ దుడుకు — లెన్నో గదవమ్మా !
అవి, యెన్నో గదవమ్మా !
కొంక కప్పి దెలుపు డింక — కొదవలేల నమ్మా ?
పొంకముగా నొక్క సతిని — పారలించినాడమ్మా !
వీడు, పరలించినాడమ్మా !
ఎంకజవాభాని కంత — బల మెక్కడిదమ్మా ? 7

బలములేకనే యింతుల — బట్టునటవమ్మా ?
వీడు, పట్టునటవమ్మా ?
యెల శిశువూ కింతలు — నెట్లా వచ్చునమ్మా ?
పలుమారు శిశువనుచు — పలుకావలదోయమ్మా !
నిన్ను, పలుకావలదోయమ్మా !
యెలమిని పికండ్లకు వీ — డెంతావాడోయమ్మా ? 8

వనిత ! సీ బాలుడు పూర్ణ — వయసువాడోయమ్మా !
వీడు, పూర్ణవయసువాడోయమ్మా !

---

1. 'చనువుగా' (చూ శర పుట 696)
'అతి పరిచయము వలని పరిహాసముగా' నని తాత్పర్యము

పెనసి మీ కా రీతి గాని — పించునటావమ్మా ?
పనులన్ని పెద్దవి, వీడు — బాలుడేనోయమ్మా ?[1]
వీడు, బాలుడేనోయమ్మా ?
చెనకి బలుపను లేమి — జేసి వున్నాడమ్మా ? 9

చ. పాము పొక్క దర్పతూల — పైన వేసెనమ్మా !
వీడు, పైన వేసెనమ్మా !
పాము నెట్ట బొంకుడు — బట్ట నేర్చునమ్మా ?
నేవమూన వాకట్టేమొ — నేర్చుకున్నాడమ్మా !
వీడు, నేర్చుకున్నాడమ్మా !
యీమహిమా తరిగొండ ల — క్ష్మికు దెరుగునమ్మా ! 10

## కందద దరువు*

క. మగువల గూడుచు వారల
మగవారిని జేరి యట్టి మర్మములెల న్
నగినగ చెప్పుచు, వీధిని
తగవుల బెట్టించు నిదియు ——

ద. తగునటవమ్మా ? నినితో బోర — తరమటవమ్మా ?
వగ లప్పు డటు జేసి — చిగురుబోణుల డాసి
మగుడి రచ్చకు దీసి — యగడు బొంధించేది
తగునటవమ్మా ? 1

---

1 'బాలుడేనా + ఓయమ్మా ?' అని విభజనము

* కందద దరు వనగా కందపద్యముతో సంధింపబడిన దరువని యర్థము దీనినే కందార్థ దరువని, కందార్థమని యందురు ఇందు కంద పద్యముయొక్క నాల్గవ పాదమందలి నాల్గవ గణముతో దరువు ప్రారంభమగును అనగా కందము నాల్గవ పాదము యొక్క చివరి రెండు గణములు దరువులో విలీనములై యుండునని భావింపవలెను ఆ రెండు గణములు అటు కందమునకు పూరకములుగను, ఇటు దరువునకు ప్రారంభకములుగను యుండి, ఆ రెంటిని ఒకటిగా సంధింపజేయుచుండును

క తగి సిగ్గెరుగని బాలుడు
మగువల కవగూడె ననుచు మాటికి నాతో
తెగువగ జెప్పెద రిల, బలు
నగుబాటిది విన్నవారు ——

ద నగుదురు గదరే ! వీ రుండ్లకై — నను వేగ పదరే !
దిగులు లేకను నాతో - జగడమునకు వచ్చి
పగటు పల్కులు[1] వీరు — పల్కితే, విను వారు
నగుదురు గదరే ! 2

క పేరు గాక సుందర జీవకగ
మెరసెడి సర్పమును దాని మెడ నేసిన, తాం
దర నది యురుకగ, తా నట
పరువడి నావెన్న మెక్కి ——

ద పరువిడెనమ్మా ! ఏ బిడ్డ డు — త్సారు డోయమ్మా !
యురుగు పొరుగుల నుండే - తరుణు లడ్డము దాకి
తిరిగి పట్టగ, వారి — నొరస కరిచి ఎరికి
పరువిడెనమ్మా ! 3

క. ధర పామును గని పెద్దలు
పరువెత్తుదు, రింత చిన్నిపాపడు దానిన్
కరమున ఎట్టునె వెరువక ?
నిరవుగ నిటువంటి ఎంత ——

ద తెరుగము పోరే ! మ న్మ్మగడు మీ — రేల జేసేరే ?
సరిసరి మేల్మేలు — చాలించు మీ మాట
లరయగ డబ్బర — లమ్మమ్మ జెల్ల ! మే
మెరుగము పోరే ! 4

1 'పగతో కూడిన మాటలు' అనగా ద్వేషముతో గూడిన పరుషవాక్యములని భావము (చూ ఆంధ్ర వాచస్పత్యము, ద్వితీయ సంపుటము పుట 1655)

క తెరవల లాదోదలందును
కరములలో నెల్తి పండ్రగట్టల చెప్పుడో
కొరదొలుచు కరిపింసగ
నురిమంటచేత[1] కాంత ——

ద లొరలుదురమ్మా ! తా శాబ న — ల్వ్యాల మండునమ్మా !
ఎరపశత్నముసు నం — ఎరములు విడిచి, పి
గ్గరుగక పలువారు — మరికి సలుకుచేత
నొరలుదురమ్మా ! 5

క వెరువక యు ల్బాలుడు తన
కరములతో నెట్ల మండ్రగబ్బల నంటున్ ?
పరునడి నంటిన ఎనిని
గరునక యా ఎతుల తొడలు ——

ద గరచినదేమే ?[2] యూమాట లె — క్కడనైన నిజమే ?
ఒరసి కానక తొల్త — నంటిన బిడ్డను
గరున కూరకె యుండి — కాంతల తొడలలో
గరచినదేమే ? 6

క ధరణిని ని సుతు మాయల
నెరుగవు నీవైన, మేము నెరుగ మిదేమో ?
మరి మరి ఎంచిన దింతయు
తరిగొండాధీశు డెరుగు ——

ద తరుణి యశోదా ! నీకొడుకును — దండించరాదా ?
మురిసి మురిసి, పి డె — మెరుగడనుచు, నుమ్మ
తరుమునచ్చుట నీకు — ధర్మము గాదమ్మా !
తరుణి యశోదా ! 7

---

1 'ఉరియునట్టి మంటలు' ఉరియు — కాలు, చలించు (చూ సూ రా ఆం నిఘంటువు, ప్రథమ సంపుటము పుట 691)
అనగా మండుచున్న మంటలవలె చలించుచు అతిశయించు బాధలని భావము
2 'కరచిన విషయ మెట్లు ?' అనగా 'ఏలాగున కరచును ?' అని యర్థము

క. అని వారల నదలింపుచు
తనయుని దగ్గరికి బిలిచి దయ దళుకొత్తన్
ఘన మమరగ లాలింపుచు
వెనలేని ముదంబు మీర నిట్లని పలికెన్

## యశోదా కృష్ణుల సంవాదము

ద్విపద ఇది యేమిరా కృష్ణ! — యీ వూరి సతులు
కొడుకక నీ మీద — కొదవ లెంచెదరు?
దబ్బరో, నిక్కమో — తథ్యంబుగాను
తప్పుబుప్పు నొందక — తగ దెల్పు మిపుడు
శ్రీ అరిగొండ నృ — సింహుని తోడ
ని తప్పు జెప్పరా — నేడు శ్రీకృష్ణ!

(వ. అని ఎల్కవ గోపెమ్మతో శ్రీకృష్ణు డిట్లనుచున్నాడు)

### దర్వు, ఆదితాళం

అమ్మా! నావాల నితమె గోపెమ్మా! నాతి మాతలు దబ్బరలమ్మా!
నే నిందె వుంటిగదమ్మా! నాకిం దేమెరుగుదునమ్మా?
తేరకు నను దిత్తేరమ్మా! అరిగొందాధిపుతోరమ్మా!
నే దురుకుశాయులేదమ్మా! నను కొత్తవాద్దు గోపెమ్మా!
నను కొత్తవద్దు గోపెమ్మా! 1

నేనూ నిన్ను గొడ్డుపోయి కన్నానూ, యెంతో నిక్షేపముగానూ
నిన్నిందు జూచుకున్నానూ, నిను ఎవరంటే వినలేనూ
పొరుగిండ్లకు నిక బోలేనూ, నిను బూచికి పట్టిచ్చేమా
అరిగొండాధిప! యుంటానూ, నీవుంటె నిన్నేమననూ
నీవుంటె నిన్నేమననూ 2

నేనూ యెవరింటికి చోలపోనూ, యింటోనే రామునితోనూ
నే నాత్తారుతు వుంటానూ, బూచిక్కిర వచ్చితేనూ

---

* ఈ దరువులో యశోదాకృష్ణుల సంవాదము ఆప్యాయకమగు రీతిని మనోజ్ఞముగా కూర్పబడినది

నన్ను దాచిపెట్టవె ! రాధా, తరిగొండవెలసి నేనూ
బూచికి నిండా వెరచేనూ, నను నీవు గావు దయతోనూ
నను నీవు గావు దయతోనూ 3

పేరూపెంపై నట్టి యూరూరా, ఆ నుండె గొల్లావారూ
బూచిని దాచినారూ, నిను బట్టిచ్చేమన్నారూ
నీకై పొంచున్నారూ, తరిగొండాధీశా ! పోరా
బెట్టాకుం టె యెవ్వారూ, నిన్ను బట్టియ్యలేరూ
నిన్ను బట్టియ్యలేరూ 4

అమ్మా ! బూ చెత్తా వుండూనమ్మా ? ఆ[రి]తి చెప్పవమ్మా !
తెలిసితే మంచిదమ్మా ! వాని రూ పెత్తిదమ్మా ?
చేసినా మానిబ వమ్మా ?[1] లేకా పెద్ద గంగమ్మా ?
తరిగొండా హరితోరమ్మా ! దాచకా చెప్పవమ్మా !
దాచకా చెప్పవమ్మా ! 5

చూడు కృష్ణా ! యా బూచివాడూ, పండ్లుగిలింపుచున్నాడూ
బలు బాకి నోటినాడూ, గోరులు బెంచినాడూ
మించినా గారడీడూ, తరిగొండాధీశా ! వాడూ
నీ కొరకే పొంచినాడూ, నిను బట్టుకోకపోడూ
నిను బట్టుకోకపోడూ 6

యిత్తా బూచివారంతా మత్తామీరి యుండె వున్నత్తా
చెప్పేవు, నన్ను గుత్తాగా నింతో దాచిపెత్తా
తరిగొండాధిపు డేతత్తా జనెనో తే రిందన్నత్తా
వెదకింతో వాండా దిత్తా[2], బూచిని వెళ్లగొత్తా
బూచిని వెళ్లగొత్తా 7

---

1 'వేపవంటి పెద్ద మ్రానితో తయారు చేసిన బొమ్మయా ?' అని యర్థము తిరుపతి గంగజాతరలో వేపమ్రాని కాండముతో గంగమ్మ ఆకారమును గొప్పగా తీర్చుట ప్రసిద్ధము

2 'వెదకింట్లో వాండ్లు దిట్టా' అనగా బూచికి పట్టియ్యదలచి వచ్చిన వారినిగాంచి, యశోద వారి యెదుట కృష్ణుని కొరకు ఇంట్లో వెదకినట్లు నటించి, యింట్లో లేడని చెప్పి, ఆ వచ్చిన వారిని తిట్టిపంపవలసినదని కృష్ణుని అభ్యర్థనము

నేనూ నీవెందు బోకుంటేనూ చల్లని బాలా బోసేనూ
బంగరు వళ్లె గళ్ళేనూ, సొమ్ములు శానా బెట్టేనూ
కొండెకు పువ్వులు జుట్టేనూ, తరిగొండాధిప ! నీమేనూ
నిండా గంధము బూసేనూ, నీకు పాల్ బువ్వ బెట్టేనూ 8

నేనూ యిక నెవ్వారింటికి బోనూ, బహుభీతి నొందుచున్నానూ
యింతోనే రామునితోనూ వెన్నలు దాచె యింతోనూ
నేరొదిగి[1] దాగివుంటానూ, దాచిచెతికి వొచ్చితేనూ
తరిగొండగిరు డింతోనూ తే రాను బోపొమ్మానూ
తె రావల బోపొమ్మానూ 9

పూనూ ధైర్యము నా కొడుకా ! మేనూ వణకించె దింకా మానూ
నె నిందె యుండగానూ భయమేటి రా యింటోనూ ?
తరిగొండాధీశా ! నేనూ బంగారు తొట్లాలోనూ
నిన్నుంచి ముద్దుగానూ జోలాపాటా బాడేనూ
జోలాపాటా బాడేనూ 10

† చూరూ మనవూరి యూరావారూ, తేరకు నన్ను
బారుధంతా నిందించినారూ

నే నింతో వుంతె పోరూబెత్తేట్ల గిచ్చినారూ[2]
నిను గావకుందా వారూ, నన్నెత్తుక పోయినారూ
పాలూ[3] దెచ్చినారూ, రామరసమూ[4] చేసినారూ

---

1 'నేరొదిగి' (వేడు + ఒదిగి) అని గ్రామ్యము

† ఈ గుర్తుగల చరణములలో నాలుగుకన్న ఎక్కువగా పాదము లుండుట గమనింపదగినది

2. 'పోరుబెత్తేట్ల గిచ్చినారు' అనగా పోరు బెట్టునట్లుల గిచ్చినారని భావము

3 'పాలు' అనుటకు బాలభాష

4 ఇది యొక రకమగు పానీయము బాదాము పప్పు, సారెపప్పు, గసగసాలు, గులాబిపూలు, ఎండు ద్రాక్ష, ఏలకులు, లవంగములు, చక్కెర, గంజాయి పూలు మొదలగు దినుసులను పన్నెకంటిపై నూరి ఆవుపాలలో కలిపి, అందుండి సారమును వడియగట్టుదురు ఆ సారమునకు 'రామ రస'మని పేరు రమింప జేయునది — అనగా, పరవశింపజేయునది — అను అర్థమున ఈ పేరు దీనికి సార్థకము

Contd

నాకూ దాగించినారూ తానదే తాగినారూ
చాలా మత్తిల్లినారూ, 'తరిగొండాధీశా ! మీరూ
కేం పట్టుమన్నారూ, తానేమొ జేచినారూ
తా మేమొ జేచినారూ 11

వోరీ నుర్దు కృష్ణా ! యీవూరీ గరితాలు నిన్ను దూరీ
ఎట్కుచు బల్ వెసారీ నిందించి రింటా వారీ
నడుచూ బుంగ నా దారీ పోవద్దు వెన్నా గోరీ
పోతె కొట్లె నీసారీ తరిగొండా నరహారీ !
తరిగొండా నరహారీ ! 12

† నుత్తూ బుత్తించి నన్ను బత్తూకోని తాను నాచుత్తూ
సిర్పి గందాము బూత్తూ, మెత్తో పూసరులు వేత్తూ
నెత్తినా పూలు బోత్తూ, వెన్నా నోతి కందిత్తూ
వేరిపాలు దాగిత్తూ, నాకు వక్కాకు ఇత్తూ
నా చెక్కిళ్ళ గరుత్తూ, నాగుత్తు బట్టి చూత్తూ
నన్నూరకె నవ్విత్తూ, తరిగొండాహరి నూ పాత్తూ
కురాని[1] నవ్వూ పత్తూకోవాత్తే నే వెరుత్తూ
కూగూతాలు నే గూత్తూ, లేచి నే పరిగెత్తూ
కో రాబోతే నాజూత్తూ బత్తిర్పమేమో తేత్తూ

వుంతె నే వురికెత్తుకుంతా యింతికీ వాత్తూ
నావెంబరీ నరుత్తూవ చ్చిందు నన్ను రత్తూ
చేచినా నతుల బత్తూ, చెంపా లదరగొత్తూ
చెంపా లదరగొత్తూ 13

---

సాధువులు, సన్న్యాసులు, బైరాగులు, మహంతులు, యోగులు మున్నగువారు తాత్కాలికము గా ప్రాపంచిక విషయముల కతీతులై తన్మయీ భావముతో నుండు నిమిత్తము గాను రసమును సేవించెడివారు

1 'నూపాత్తుకురా+అని' అని విభజనము

ధీరా! నాముద్దుతండ్రి! తేరా[1] యిట్లా మాట్లాడకూరా!
ని న్నుప్పతించేరూరా! పోకళ్ళ నేర్వకూరా!
నీకు దృష్టి తాకిరా! నేనేమి సేయుదురా?
తలిగొండాధీశా రారా! మంగళారతిచ్చేరా!
మంగళారతిచ్చేరా! 14

ఆ వె అని యశోద మంగళార తిచ్చిన, కృష్ణు
డనియె నిట్లు గొల్లవనితలెల్ల
నన్ను నుప్పతించినారు గావున పత్తి
కొత్త కొత్త కొత్త గోపిదేవి!

క అని గోపాలుడు తల్లికి
వినిపింపగ, గోపసతులు వెరగందుచు నీ
తనయుని మాటల కిప్పుడు
కొనమొద లేదమ్మ[2] నందగోపాలపతీ?

(వ అనిన విని యశోద వారి కిట్లనుచున్నది )

క నా కొడు కుండిన చోటను
మీ కూతుల జేరనీక మెలుపుగ మీ మీ
వాకిండ్లందును (భద్రము)
గా కావలిబెట్టు, డేల కలహించెదరే?

వ అని పలికి యశోద గోపసతుల సముదాయించి పంపించె, నంత మరునాడు
గోపసతులు గుమిగూడి పెరుగు చిలుకుచు తమలో దా మిట్లనుచున్నారు

## దరువు (జావళి)

చిలుకరమ్మా! చిరచిర పెరుగా చిలుకరమ్మా! ॥పల్లవి॥
చిలుకరమ్మా! ము - ద్దుల గోపాలుడు

---

1 'తేరా' అనగా 'తేరకు' (ఊరక) అని యర్థము

2 'కొన మొదలు+ఏదమ్మ' అని విభజనము అనగా 'చివరలేదు; మొదలు లేదు' అని భావము

తులువై కుండలు — ద్రోయక మునుపే ॥చిలుకరమ్మా ॥ఉ ప॥

సందుల గొందుల — యందుఁ బొంచుచు
ముందర కృష్ణుడు — మొనయక మునుపే ॥చిలుకరమ్మా ॥ 1

దాగుచు మూగుచు — నాగడపరుచుచు
మీగడ గొని వాడు — మెక్కక మునుపే ॥చిలుకరమ్మా ॥ 2

కిలకిల నవ్వుచు — కేలుఁ జూపుచు
బలు కవ్వంబులు — బట్టక మునుపే ॥చిలుకరమ్మా ॥ 3

గిరగిర కవ్వము — లరిమురి దిరుగగ
నొరసిన మెరుగుల — నురుగులు గరగా ॥చిలుకరమ్మా ॥ 4

తరిగొండాధీ — శ్వరుఁడగు వేంకట
గిరి నిలయుండగు — కృష్ణుడు వచ్చి[1] ॥చిలుకరమ్మా ॥ 5

వ అని యిట్లు పెరుగు చిలుకుచున్న సమయంబున కృష్ణుండు క్రమ్మర గోపసతులమీద దాడివెడలి, యాడుచు పాడుచు, చల్ల చిల్కాడ నుల్లాసంబున కొల్లకాడై రాగా, నల్లనయ్యను జూచి పల్లవపల్లవాధరలు చెల్లరే! యని తమలో దా మిట్లనుచున్నారు

## దరువు, ఆదితాళం

తిరుగా వచ్చెనే! కృష్ణుడు — తెరవలారా! వాకిండ్లకు
కరుకు[2] బిగమూలు వేసి — కావిళ్ళుంచదామే! 1
సుట్టుపట్ల పొంచి విని — పట్టి కట్టివేసి, పూని
గుట్టుగా యశోదకడకు — గొంచుపోదామే! 2
తన వెంట శ్రీతరిగొండా — ధాముడున్నాడను గోపెమ్మా
కనువందాగా వీని మాయ — లవుడూ దెలుసునే! 3

1 'వచ్చిని' అనగా 'రాగలడు' అని యర్థము

2 'కరకు' యొక్క వ్యావహారిక రూపము 'కఠినమైన, గట్టి' అని యర్థములు (చూ శ ర పుట 166)

3 'కావడి'కి వ్యావహారిక రూపము 'కావిడి' దానికి బహువచనము 'కావిళ్ళు'.

వ అని పలికి, వాకిండ్లు వేసి కృష్ణునిచుట్టు పరివేష్టించిన గోపికలతో కృష్ణుం డిట్లనుచున్నాడు

## దరువు (ధ్రువం)*

పత్తుతారా ? (మీరు) నన్ను పత్తుతారా ? ॥పల్లవి॥

గుత్తు గుత్తుగా మాత్తారు — కుంతా వున్నారీర మీరు॥పత్తుతారా ?॥ఉ ప ॥

మీా కందలికిని నేను — మిందగారనై వాత్తినీ
నాకు[1] వేలుపిక లేదు — నంగనాచి లొల్తుతాల । ॥పత్తుతారా ?॥ 1

పెద్దపెద్ద వాకిందాకు — బీగమూాలు బాగా వైచి
పద్దపత్తి మీాలు నన్ను — పత్తుతామంతీ రత్తైతె ॥పత్తుతారా ?॥ 2

తరిగొందా నారాచిమ్మని — దాచ్చిన్యాము మీాకు లేక
పరగా మాయమ్మ చెంతాకు — పత్తూకొపోతామంతారు ॥పత్తుతారా ?॥ 3

వ అని కలహించినట్టుండి అంతరిక్ష మార్గంబున వారిండ్లలో జొరబడి దధిక్షీర నవనీతంబులు మెక్కి, కొల్లబెట్టి, నానా విచిత్రంబులైన దుడుకులు జేసి, యొక్క ముద్దుపాపని బొజ్జనిండ వెన్నగూరి, వాడు గ్రుడ్లు వెలి కురికి యూపిరి ద్రిప్పలేకున్న సమయంబున కృష్ణుండు అంతర్ధానంబున వచ్చి యశోదచెంత నుండె, నంత గోపసతులు కృష్ణుని గానక, పోయెనని[2] బీగంబులు దీసిపోయి, తమ యిండ్లలో నడిచిన విచిత్రంబులకు వెరగుపడి, యూపిరి ద్రిప్పలేకున్న బిడ్డను గొనివచ్చి యశోద ముందర బెట్టి యిట్లను చున్నారు

---

* ఈ 'ధ్రువ' మనునది 'జావిడి'వలె దరువులలో నొకరకమని తెలియదగును 'ధ్రువపద' మని దీని నామాంతరము

చూ 1) నృత్తరత్నావళి 7వ అధ్యా, 65 శ్లో
11) భరత కోశః, పుట 299

1 'నాకంటె' అని యర్థము

2 'అచటినుండి వెళ్లిపోయెనని' అని యర్థము.

## గోపికల ఫిర్యాదు

ద్విపద. ఈ పాప మేమమ్మ — యింతి గోపెమ్మ ?
నీ పాప డిప్పుడు — నీ చెంత నిలిచి
యున్నాడనుచు జెప్ప — చున్నావు నీవు
వెన్ను డిప్పుడు నిన్ను — విడిచిరా జూచి
వెరచి నాకిండ్లకు — వేవేగ మేము
కరుకు లీగంబులు — గదియింప, జూచి
మాతోను కలహించి — మమ్ము బొంకించి
యే తీరుగానో తా — నిండ్లలో జొచ్చి
పాలు ద్రావియు చట్లు — పగుల నడంచి
బాలామణుల గూడి — బాలుని పొట్ట
విరియ కుత్తుకబంటి — వెన్న దా గూరె
నరయుగా నాబాలు — డప్పుడు గ్రుడ్లు
చాల వెల్కురుకగా[1] — సంకటపడుచు
లీల నూపిరి ద్రిప్ప — లేకయున్నాడు
ఈపాప డేమైన — నిది నీకె పెలవు ![2]
నీ పట్టిచేతను — నేడు మా పటి
యీా తెరువాయె — నింకేమనవచ్చు ?
శ్రీ తరిగొండ నృ — సింహుని తోడె !
కాపురములు జేయ — గాజాల మిచట
మీా పల్లె జాలించి — మేము బోవలసె

(వ అనిన విని యశోద గోపసతులతో నిట్లు పల్కుచున్నది )

క నాపాపడు నా చెంగట
నీ పగిదిని బలునితోడ నిండాట్లాడున్
మా పిన్నవాని కొరకై
యీా పల్లెను మీారు విడువవెందుకు ? బోరే !

---

1 'వెల్కి (వెలికి) + ఉరుకగా' అని విభజనము,

2. అనగా 'అ పాపపుణ్యములు మీవే సుమా !' యని భావము,

[వ  అనిన విని గోపికలు యశోదతో నిట్లనుచున్నారు ]

## ద్వారు, ఆటతాళం

గోపెమ్మా! యేమె గోపెమ్మా! ॥పల్లవి॥

గోపెమ్మా! మావల్ల — పాపములేదు నీ
వీ వట్ల మామీద — కోపము జేయకు ॥గోపెమ్మా॥అ ప॥

యిట్టి లోకాతీతు — డీవూరిలో బుట్ట
బట్టి మా బ్రతుకులు — బంగారమై పోయనే! ॥గోపెమ్మా॥ 1

బాలకుడని నీవు — భావింపుచున్నావు
బాలుడు గాడు నీ — పాదములాన వో ॥గోపెమ్మా॥ 2

చిన్నికుర్రలను — జూచితిమమ్మ! భూమిలో
నిన్ని నేర్చిన కుర్ర — నెరుగ మెచ్చోటను ॥గోపెమ్మా॥ 3

రమణిరో! యివి మత్స — రంపు మాటలుగావు
క్రమముగా నడుగు మి — క్కడినారి నెల్లను ॥గోపెమ్మా॥ 4

పాదైనా[1] తరిగొండ — పతితోడె! నీ బిడ్డ
మీాద దబ్బరచాడి — నేము జెప్పలేదే! ॥గోపెమ్మా॥ 5

ద్విపద వెలది! నీ కడుపులో — నేలెడు బిడ్డ
కలుగునా? యని మేము — కన్నదేవళ్ళ
నురుభక్తితో వేడు — చుంటి మీావరకు
తరిగొండహరి మీాకు — తనయు నిచ్చుటకు
ముదమందుచుండగా — మొనసి నీ కొడుకు
విదితంబుగా జూడ — విపరీతుడయ్యె
ఏడు జేసిన పనుల్ — వివరంబుగాను
చేడె! నీతో మేము — చెప్పనేలేదు

---

1. 'నిలుకడయైన' అనగా 'శాశ్వతుడైన' యని భావము.

కొడికొడిగా నిందు - కొన్ని జెప్పితిమి
కడముట్ట నీతని — కార్యంబులన్ని
జెప్పితిమైన[1] బల్ — సిగ్గులచేటు
జెప్పనేటికి ? మాకు — సెలవియ్యవమ్మ ।

(వ అనిన విని నందసతి వారితో నిట్లనుచున్నది )

క ఇక్కడ నుండెను బాలకు.
డక్కడి కెవ్వాడు వచ్చె ? నా పనుపెల్లన్
తక్కక నెవ్వడు జేసెను ?
దిక్కే దీమాయ మాకు తెలియదుగదరే ।

(వ. అనిన విని యాగోపిక లిట్లనుచున్నారు )

## దరువు

ఇక్కడా వీడుండె నంటివమ్మా ।
మా యిండ్లాకు వే, రొక్కా డేరనుండి వచ్చెనమ్మా ? 1
సత్యాముగా నీడె వచ్చెనమ్మా ।
వగలెన్నో జేసి, సతుల కుచములా వ్రచ్చెనమ్మా । 2
అందారిండ్లపాలు ద్రావెనమ్మా ।
యింటింటి కుండ, లడచియడచి పారవైచెనమ్మా । 3
బాలామణులాను బట్టెనమ్మా ।
పసిబిడ్డలాకు, భావజునికేళి నేర్పెనమ్మా । 4
వీ డెక్కాడి చిన్నవాడోయమ్మా ?
తరిగొండహరికి వీని, వింతాలన్ని దెలుసునమ్మా । 5

క తక్కక కృష్ణునిదుడుకులు
వెక్కసమై తోచె గనుక, వీనివలన మే
మెక్కడవైనను బోయెద
మిక్కడ నిక నుండవెరతు మిదె సెలవు సఖీ ।

1 'చెప్పినమైన' అని యర్థము

ద అని వారు పల్కగా — నపుడా యశోద
విని యిట్టులనియె నో — వీరిబోణులార!
హెక్కసుచే[1] మాట — లని యూరు విడిచి
యెక్కడ బోను మీ — కేల? నాసుతుని
ఏయెడనైన నే — వేమరకుందు
మీయిండ్ల కెటు నన్ను — మించి రావచ్చు?
వచ్చెబో సతుల నె — వ్వరి నేల వ్రచ్చు?
వ్రచ్చుబో మీ పాలు — వాడెన్ని త్రాగు?
త్రాగెబో కుండ లెం — దరివని నీగు?[2]
నిగెబో మీరన్న — నేర్పు లే మెరుగు?
ఎరిగెబో స్మరకేళి — నేరీతి మరుగు?
మరిగెబో సతుల నె — మ్మోమొడ్కని బట్టు?
ఎట్టెబో రతి నల్పు — బంమెట్టు బుట్టు?
పుట్టెబో యిట్టి య — ద్భుతము లిక్కడను
ఇలువెళ్లి నా కొడు — కెందు రాలేదు
తెలియక మీ రుప్పు — తించకురమ్మ!
పుట్టి పుట్టక మున్నె — బుడుతని రచ్చ
బెట్టిన ఫలమేమి — ప్రియమొల్ల మాని?
తప్పు గల్గిన నేనె — దండింతు సుతుని
ఇప్పు డెక్కడ బోకు — డిండ్లకు జనుడి!
పరిగొండహరితోడె! — దాక్షిణ్య మునంచి
పొరుగూళ్లకును మీరు — పోకుండరమ్మ![3]

అనిన విని గోపిక లిట్లనుచున్నారు )

మెలత యశోద! నీ కొడుకుమీదను సారెకు నిందమాటలన్
నలమగ చెప్ప నిందు పగవారముగాము, నిజంబు చూచితే

---

1. 'అక్కసు'కు పూర్వరూపము 'ఆగ్రహము, కోపము' — అని యర్థములు
2. నీగు = నివర్తించు (తొలగించు) — అని యర్థము (చూ శ.ర. పుట 438)
3. 'పోక + ఉండరమ్మ!' అని విభజనము.

నలరగ మీరు మాదొరలు, నాళ్ళులు గావున మామనంబులన్
కలుగునె యెంతకైన పగ కంజదళాక్షునిమీద భామినీ ?

[వ అనిన విని యశోద యిట్లు పల్కుచున్నది ]

సీ ఓ చిన్నవానికి మా చిన్నిపాపడు
వెన్నగూరెనటంచు వెక్కసముగ
పలికితి రా మాట పాటింప దబ్బర
మరి యిది యక్షిణి మాయగాను
తోచుచున్నది, మంచి నీచిన్ని పాపని
కడుపెల్ల నివురుచు మడుకునీవు
బోయుము, కరిగి తెప్పున వెన్న డిగిపోవు
పాపని కట ప్రాణభయములేదు

గీ వసుధ యక్షిణి యనెడు దేవతకు మీరు
శాంతిగా జాతరలు జేయు డంత నిచట
పుట్టు విట్టి విచిత్రముల్ పొలతులార!
వెగ బోరమ్మ! యిండ్లకు వెలదులార!

ఆ వె అవి యశోద యెల్ల నాకొమ్మ లిట్లని
రమ్మ! కృష్ణు డిచట నెమ్మదిగను
నుమ్ము ఎల్లసిడు, మా కింక సెలవియ్యు
డనుచు వడుగుచుండి రబ్జముఖులు

## గొల్ల గౌడు

ద్విపద అ లోవ ముసలివా — డగు గొల్లగౌడు[1]
పాల కావడి మూపు — పైన నుంచికొని
గొంగడి ముసుగుతో — గూను వంచికొని
యుంగరము కట్టె — యూతజేసికొని

1 'గౌడు' అనునది ఒక వట్టపుపేరు కొంత స్థితిమంతులైన గొల్లవారిపేళ్ల చివర 'గౌడు' పదమును చేర్చుట నేటికిని రాయలసీను ప్రాంతమున వ్యవహారములో నున్నది అట్లే 'గౌడు'లు గొల్లవారిలో కులపెద్దలుగా వ్యవహరించుటయు గలదు

కసరుచు రెండు కు — క్కులు వెంట రాగ -
ముఎలిది యున్నట్టి — ముంగిటి కవుడు
పోయి, తా దాన న — ప్వాడు గాన కలిగి
యూయెడ తరిగొం౯ — వారి సేయు పమల
కొరకు గొపెమ్మతో — కొట్లాడుచోటి
కరిగి యుట్లునియె కో — పావేశమునను

## దర్వు, ఆటతాళం

వోశోశి ముసిలాపె! — వోశోశి ముసిలాపె!
వోశోశి ముసిలాపె! — వో ముసిలాపె! ॥పల్లవి॥

కూశికూశి మన — గోపెమ్మతోడ నా
క్రోశముతో నీవు — కొట్లాడేదెమే? ॥వోశోశి॥ 1

కమ్మగా నంబిలి[1] — గాశే కోడండ్లతో
నెమ్మెలు శేసూత — నిందుండావేమే? ॥వోశోశి॥ 2

వాకు కడుపులోన — నాకీశా[2]తుండాదె
నీకు భయము లేక — నే యుండావేమే? ॥వోశోశి॥ 3

సక్కగ తరిగొండ — సామిపూజ శెయ్య
కిక్కడనే వుండా — కీ పాపమేమే? ॥వోశోశి॥ 4

గీ. అనిన విని గౌడపాని యుట్లనియె ముసలి
వాడ! కృష్ణుడు రేపల్లె వాడలోన
పుట్టినప్పుడె కాపురంబులు మునింగె
నానిధం బెట్టు లన్నను నీవు వినుము

## దర్వు, ఆటతాళం

ఇంకేటి కాపురమురా? వో ముసిలోడ!'
యింకేటి కాపురమురా? ॥పల్లవి॥

---

1 'అంబిలి' ఇది 'అంబలి'కి వ్యావహారిక రూపము
2 'ఆకిలి' ఇది 'ఆకలి'కి వ్యావహారిక రూపము.

యింకేటి కాపుర ? — మీవూళ్లో క్రిష్టుడు
మంకువాడై నాతో — మల్లాడవచ్చినా
॥ ఢింకేటి కాపురమురా ? ॥ ॥ఉ ప ॥

పాలాకుండలు గొట్టి — బాలామణుల బట్టి
ఛీలల్ల ! శిగ్గూలు — జెరచి గాబరజేశి ॥నింకేటి॥ 1

యెరనాగి న్నలనాగి[1] — న్నిరుకుమానికాడ
కరిచి బరికి ఆట్ల — గా[2] జేశినాడంట ॥యింకేటి॥ 2

తరిగొండ వరహరి — దాడీ మెండైనాది
సొరుగూళ్ల కైనాను — పోదాము వలసగా ॥నింకేటి॥ 3

వ అనిన విని ముసలివాడు గోపిదేవితో నిట్లనుచున్నాడు

గీ అమ్మ ! గోపెమ్మ ! మీాకు నే(౦) మన్నుపన్ను[3]
విచ్చి కాపుర నుందుంటి, మింక నుండ
వెరతు, మావులతోడ వేవేగ కృష్ణ
వంస బోయెదమమ్మ ! యీా వాదులేల ?

వ అనిన విని యశోద యిట్లనుచున్నది

అ వె గొడ ! నీకు ఇంత కోపమేటికి ? (మీారు)
వలస బోవనేల ? వలదు నిలువు.
దర్భకుండు మీా గృహంబుల కిక రాడు
పొండు ! వీనివలన బోవనేల ?

వ అని పలికి, గొనితోడ నందరికి నీడెంబు లిప్పించి యాదరించి గోపకాంతల
నిండ్లకు పంపించి, తదనంతరంబున

---

1 'ఎఱ్ఱనాగి, నల్లనాగి — అను పేళ్లుగల గోపికలను' అని భావము
2 'అటలుగా' అని యర్థము
3 'నేలపన్ను (నివాస శుల్కము)' అనగా ఒకరి స్థలమున వసించుచున్నందులకుగాను ఆ స్థలను స్వంతదారునకు చెల్లించెడి పన్ను నందగోపుడు వ్రేపల్లె కధిపతి గనుక అందు నివసించు గొల్ల లెల్లరు యథోచితముగా ఆతనికి మన్నుపన్ను చెల్లించుచుండిరి,

## నందసతి సందియము

ద్విపద అనుమానమున బొంది — యపుడా యశోద
తనయుని తొడమీద — తగ నుంచి, చుంచు
చేతుల దువ్వుచు — చెక్కిళ్ళు నిమిరి
'నాతండ్రి! యీ చిన్న — నాడు నీకింత
యారడి వచ్చె, నే — మందు నావిధిని ?
యూరివారెల్ల ని — న్నుప్పతించినను
నే వినవలసె, నీ — నెత్తిన బ్రహ్మ
దేవు డీరీతి వ్రా — దింపుచు[1] వ్రాసె'
నని యిట్లు తరిగొండ — హరి నాదరించి
చనుబాలు ద్రావించి — జాలితో ననియె

### దర్వు, నీలాంబరిరాగం, ఆదితాళం

నాతండ్రి! యిందరికి వెరచి, భూ — తాలిత! నే నిన్నెందు దాతురా ?
॥హా॥ యేమిసేతురా ? 1

మెచ్చుతున్న ఎతులొకు ని — నీాద నింత మాత్సర్యము హెచ్చెరా!
॥హా॥ యింత వచ్చెరా! 2

శ్రీకర తరిగొండ నార — సింహుతోడే నీ వింకెందు బోకరా!
॥హా॥ దూరు దేకరా! 3

గీ. అనుచు కృష్ణుని నీరీతి నాదరించి
కన్నులను నీరు నించ, ముఖంబు నిమిరి
యేమి దోచక రోహిణిన్ బిలిచి (మిగుల)
జాలితో నిటుబల్కె నాశ్చర్యముగను

సీ. ఓ రోహిణిదేవి! యొకమారుగాకుండ
పలుమారు నా గొల్లభామలెల్ల

---

1. 'మోదుచు (కొట్టుచు)' అని యర్థము

పలికిన పల్కు లేర్పడ దబ్బరనరాదు
బుడుత డాయిండ్లకు లోపమలేదు
కావున నిజమేది ? కల్లయే ? దీపాయ
తెలియ దెవ్వారికి, దేవు డెరుగు
ఎన్నాళ్లకో నేము కన్న బిడ్డకు లేని
నింద వచ్చుటకు నా డెందమెల్ల

గీ వెన్నకైవడి గరగుచు నున్నదిపుడు
గోపికల నేరమందునా ? కొడుకు నేర
మందునా ? రెండు దెలియలేదమ్మ ! నాకు
తెలుపు నీవైన నొకమాట తేటగాను

(వ అనిన విని రోహిణీదేవి యశోదతో నిట్లనుచున్నది )

## ఏలలు*

దబ్బారా లాడారు గోప — తరుణాలూ, పీ డెందుబోలే
దబ్బబ్బా ! యిదేమో తెలి — యానే వోహో యశోదా !
యద్భూతమై తోచుచున్నాదే ! 1

యీముద్దు కృష్ణునివలెనే — యేభూతామో యీవూరిలో
తా మహిమా జూపూచు — న్నాదే వోహో రోహిణీ !
తథ్యామిది దబ్బారా గాదే ! 2

ఆ మాయా నివారాణా మిం — దయ్యేటందూ కందారానూ
గ్రామాజాతర జేయిం — తామే వోహో యశోదా !
గంగాకు బోనామూ లిత్తామే ! 3

ఉరగాద్రి లాధీశుడైనా — తరిగొండా హరికి మ్రొక్కి
త్వరగా నట్లానే జేయిం — తామే వోహో రోహిణీ !
తనయునీ నిందా దప్పింతామే ! 4

---

* ఇందు రోహిణీయశోదల సంభాషణ కలదు

వ అని నిశ్చయించి యా యశోద కృష్ణుని యేమరక నాదరింపుచుండగా, అందొక్కనాడు కృష్ణుడు ప్రేపల్లెలోకి దాడివెడలి పోవుచున్న జూచి యశోద యిట్లనుచున్నది

## దరువు

ముద్దుకృష్ణా రారా! వెన్న — ముద్ద లిచ్చే కోరా! ॥పల్లవి॥
హద్దు విడిచి నీవెందు బో — వద్దు వద్దు రారా! ॥ఉ.ప.॥
పొరుగిండ్లకు బోయి లేని — పోరు దేక రారా!
యిప్పు, డరసి యింట్లో రామునితో — నాట్లాడుదు రారా!
॥ముద్దుకృష్ణా!॥ 1

పొరుగిండ్లలో పొంచి పెద్ద — బూచి వుంది రారా!
గోళ్ళ, బరికీ బరికీని బొజ్జంతా — కరిచిపోయ్యా[1] రారా!
॥ముద్దుకృష్ణా!॥ 2

బొజ్జా వాడను, పచాలు — బువ్వా బెట్టే రారా!
ఘుల, గజ్జాలు వదలీనావి — గట్టిగ గట్టె రారా!
॥ముద్దు కృష్ణా!॥ 3

పరువు లెత్తితెను నిన్ను — పట్టలేను రారా!
గొల్ల, గరితలు గొట్టేరు, బొజ్జ — కందవాడా రారా!
॥ముద్దుకృష్ణా!॥ 4

తరిగొండహరితోడే కడప — దాటిపోక రారా!
వోరి, దురుసాగా పరువులెత్తక — తులువాబిడ్డా రారా!
॥ముద్దుకృష్ణా!॥ 5

వ అని పలికి కొడుకు నొడిసి పట్టికొని, బలభద్రునితో నాట్లాడుమని వియమించిన, రాముణ్ణి జూచి కృష్ణుం డిట్లనుచున్నాడు



1 'కరచిపోవును సుమా!' అని బెదరింపుతో కూడిన హెచ్చరిక

## దర్వు*

అన్నా! యింతో కన్నాముచ్చి — లాలుదాము లాలా! ॥పల్లవి॥
వొరీ, చిన్ని తమ్ముఁరా! — కండ్లూమూసే నిందు లాలా!
॥అన్నా! యింతో॥ఉ ప.॥

ఆడరగా నిచ్చోట చిడుగా — డోరుకుందాము రారా!
గుడుగుడుగుంతా మూరుకుంతా - కూచుందాము రారా! ॥అన్నా!॥ 1

చిట్లలట్లా కాయూరాను[1] — చేతులు జాచీ రారా!
గిరి, గిట్లాడుద మిందూ — గిరగిర దిరుగా రారా! ॥అన్నా!॥ 2

కుందికుంది యూట లారు — కుందా మిందు రారా!
మన, మందమైన గచ్చకాయు — లారుదాము రారా! ॥అన్నా!॥ 3

పరువూ రెత్తి వొకరీ వొకరు[2] — పత్తుదాము రారా!
ఏన, తరిగొండా నారదిమ్ముని — తాకుదాము రారా! ॥అన్నా!॥ 4

## మృద్భక్షణము

వ. అని యివ్విధంబున రామకృష్ణు లాట్లాడుచు ముద్దులు జూపుచుండి రంత నొక్కనాడు కృష్ణుండు మృద్భక్షణంబు జేయుచున్నం జూచి, రాముడు యశోదతో నిట్లనుచున్నాడు

ఉ తల్లి యశోద! కృష్ణు డల తావుల తావున జేరి ముదంబుమీరగా
నల్లని మంటిపెళ్లలను నవ్వుచు మెక్కుచునుండె నిప్పుడే
కల్లని నమ్ము దిట్టకుము, కంజదళాక్షుడు వెన్నదివ్వ నో
రెల్లను మన్ను మెత్తికొనె, నీడకు బిల్వవె! నీవు జూడవే!

వ అనిన విని యశోద కృష్ణుని చేరబిల్చి యిట్లనుచున్నది

---

* ఇందు శ్రీకృష్ణబలరాముల ముచ్చట (సల్లాపము) కలదు
1 'చిట్లలట్లాకాయాడాను' — అనగా 'చిట్లలట్లకాయ' అను ఆట ఆడుటకు,
2 'ఒకరి నొకరు' అని యర్థము

## ఏలలు*

మన్నా నీవూ దిన్నావాని — మన రాముడూ జెప్పినాడూ
వన్నాగా నిక్కానేమేమిరా ? వో ముద్దూకృష్ణా !
— భయపడాకా నాతో జెప్పరా ! 1

జున్నూ పాలూ నెయ్యి వెన్నా — తిన్నా నోతా ఛీ ! పీరా[1] నే
మన్నూ కోరి తిందూనంటావే ? వో యశోదమ్మా !
— అన్నా పూరి క్కన్నాలు పోవే ! 2

వోరి ! రాముడన్నామాట — వుత్తామాటంటి వట్టైతే
భోరూనా నీ నోరు దెరువారా ! వోముద్దూకృష్ణా !
— పాలుపూనీరా నేనే చూచేరా ! 3

శ్రీ తరిగొండా వరానారా — చిమ్మచ్చామీతోడే ! మన్నూ
నే తినాలేదూ, తిత్తానావే ?[2] వో యశోదమ్మా !
— నీవూ నానోరంతా చూరావే ! 4

వ. అని కృష్ణుండు నోరు దెరచి అనేక కోటి బ్రహ్మాండంబులు తన నోట జూపిన, యశోద భయభ్రాంతయై రోహిణితో నిట్లనుచున్నది

ద్విపద ఇది యేమొ రోహిణి ! — యీ చిన్ని శిశువు
వదనంబులో ధర — వన వహ్ని పవను
లాకసంబును, మహ — త్త్వాహంకృతులును
లోకపాలకులును — లోకముల్, నదులు
వనధులు, దీవులు — వన పర్వతములు
ఘన సూర్య సోమ న — క్షత్ర పంక్తులును
పొసగ చరాచర — భూత జాలములు
పసమీర గలిగిన — బ్రహ్మాండ తతులు
చూచితి, నటుగాన — సుతుడు వీడనుచు

* యశోదాకృష్ణుల సంవాద మిందు వర్ణింపబడినది
1 'ఛీ ! పీడ' అని యర్థము
2 'తింటానావే ?' — అనగా 'తిననే తిన' నని భావము

చూచుట దోష, మ — చ్చుగ వీడు పరమ
పురుషుం డనుచు వెంచి —పూజించి మ్రొక్కి
పరమ పదంబున — ప్రాపింపవచ్చు
నర్భకుడని వీని — నల్లిబిల్లిగను
నిర్భయంబున నెత్తి — నే సాకుచుంటె
నాపాలి తరిగొండ — నరసింహు డితడు
పాపడుగాడన్న, — బలభద్రు తల్లి
తనలోనె తా నద్భు — తంబు నొందుచును
దనరార నాయశో — దకు నిట్టు లవియె

ఆ వె భ్రాంతిపడితివేమొ బాలుని వదనమున
దిన్ని గలిగియుండు టెందు గలదు ?
పరమ పురుషు డేడ ? పసిబిడ్డ డేడ ? నీ
వుప్పతింపవలవ దో యశోద !

వ అని పలుకుచున్న తల్లులమీద వైష్ణవమాయ గప్పి, పూర్వ నిశ్చయంబును
మరపించి, కృష్ణుం డాట్లాడుచుండె. నంత నొక్కనాడు యశోద పెరుగు
జిలుకుచుండగా కృష్ణుం డిట్లనుచున్నాడు

## దర్వు (జావిళి)

అమ్మయ్యా చాచీవే! నా బా — జ్జంతా వారెనూ[1] ॥పల్లవి॥
పెరుగు, గుమ్ము గుమ్మమంతా చిలుకు — కుంతానుంతే యెత్తవే ?
॥ వొ యమ్మయ్యా ॥ఉ పే ॥

మజ్జిగా చిరాకవద్దు — మంచామునీదా గూచుంది[2] ॥యమ్మయ్యా॥ 1
వులులుక్కి పానూలు జేత్తా — వుంతే కోపాము వత్తుంది॥యమ్మయ్యా॥ 2
తరిగొండాచామీతోరే ! నే — తాళలే నాకాటిచాత ॥నమ్మయ్యా॥ 3

---

1 'వాడెను' అని యర్థము
2 'గూర్చుండి' అని యర్థము

# వెన్న దొంగ

వ అని కష్టంబు బట్టి చిలుకనియ్యక చలంబుజేసిన, కొడుకును తొడపై నిడికొని చన్నిచ్చు సమయంబున పాలు పొంగిన చల్లార్చుటకు కొడుకు నందుంచి యశోద లేచిపోయిన, కృష్ణుండు దధికుంభంబులో వెన్నమెక్కి తత్కుంభంబు పగుల నడంచి, పొరుగింటి కురికి వారి వెన్నముద్దలు మెక్కుచు కోతి కిచ్చుచున్న సమయంబున పోయిచూచి యశోద యిట్లను చున్నది

ద్విపద ఓరి ముద్దులవాడ ! — యోదుండగీడ !
యోరోరి ! తరిబాన — యొప్పులు[1] జేసి
వచ్చి నవ్వుచు నూరి — వారింటి వెన్న
ముచ్చిలింపుచు కోతి — మూతి కిచ్చెదవు
చిన్నవాడని కొట్ట — చెయ్యాడ దేను
నిమ్మ మన్నింపగా — నీ వింత మించి
తలకొని గోపకాం — తలు జెప్పినటుల
చెలరేగి దుడుకులు — జేయుచున్నావు
సహజ బాలుడ వీవు — సర్వదా గావు
మహిమల పోకిళ్ల — మారి వైనావు
గుణము చేపట్టక — కొడికెక్కినావు[2]
గుణశాలి**వో**లికె — గునిసియాడెదవు
గుణనియు గావు, ని—ర్గుణుడవు గావు
గుణహీన ! నిన్నెట్లు — గురిసేయవచ్చు ?
గణుతించి యేవేళ — గాచుకయుండి
క్షణ మేమరితినైన — జరిగిపోయెదవు

---

1 'ప్రప్పులు' అను దానియొక్క వ్యావహారిక రూపము 'వప్పలు' అనియు నందురు ఉదా బెంకాయ వప్పలు

2 'కొడి' యనవగా 'అగ్రము, పై భాగము' అని యర్థములు (చూ శ్రీహర్యనిఘంటువు ప్రథమ ముద్రణ, పుట 272)
'కొడికెక్కుట' యనగా 'పరాకాష్ఠ నందుట' యని తాత్పర్యము.

చిక్కించుకొనను పొంచిన వారికెల్ల
చిక్కుదువా నీవు ? — చిక్కులమారి !
చిక్కితి విపుడు నా — చేత బొంకించి
యెక్కడ బోయెద — వింక మీదటను ?
పెట్టు సంజీవియౌ — బిడ్డలకెల్ల
పెట్టు(న) గాని చె — ప్పినమాట వినరు
తాళుతాళుర ! నిన్ను — తాటించునట్టి
వేళ వచ్చునటంచు — వెరపించి పలికి
తనచేతి సెలగోల — తగ ఝళిపించి
పనిబూని కృష్ణుని — పట్టబోయినను
తరిగొండహరి యశో — దకు చాల వెరచి
పరువు బారుచు, బగ్గ — పడుచు[1] నిట్లనియె

## దరువు

అమ్మా ! నన్నూ కొత్తారాకవే ! ॥పల్లవి॥
అమ్మమ్మ యశోదమ్మా ! నన్ను కొత్తరాకవే !
నేను, సమ్మతమునా యింతోనే చాచి దాగుచుంతాగాని
॥అమ్మా ! నన్నూ ॥ఉ ప ॥
పొందుగా పాచాలులువ్వా — బొజ్జనిండా బెత్తితే వే
నెందు బోకా యింతో వుంతా — వే ! అమ్మ యశోదమ్మా !
॥అమ్మా! నన్నూ॥ 1
'చిన్నావారా ! ర'న్మనుచు — చేతిలో నీవు బెత్తినా
వెన్నాముద్దా దింతావుంతా — వే ! అమ్మ యశోదమ్మా !
॥అమ్మా! నన్నూ॥ 2
వూలీవాలీ యింతికి వే — నోల్లా ! పోలేదుగాని
వూలీకె యింతోనే వుంతా — వే ! అమ్మ యశోదమ్మా !
॥అమ్మా ! నన్నూ॥ 3

1 '(బతిమాలుచు' అని యర్థము ఈ యర్థమున 'బంగపోవు' అను వ్యవహారము నేడును కలదు

మాట్లాడుతా లన్నతోను — చిర్నవ్వు కాయూరుకొను
లోన్లోనే నవ్వుచుంతా — నే ! అమ్మ యశోదమ్మా !
॥అమ్మా ! నమ్మా॥ 4

నా తోనే ! శీతరిగొంద — నారవిమ్మచ్చాను చోనే !
౧ తోనే ! నే దురుకు చాయు - నే ! అమ్మ యశోదమ్మా !
॥అమ్మా ! నమ్మా॥ 5

వ అని వెరచి యురుకుచున్న కొడుకును తరిమిపట్టి, కొట్ట చెయ్యాడక రోటికి కట్టివేసిపోయి, గృహంబులో పనులు వేయుచున్న సమయంబున

## నలకూబర మణిగ్రీవులు

ద్విపద హరి రోట బద్ధుడై — యుండిందు జూచి
వెరచినట్లనె యుండి — నీగ రో లీడ్చి
మునుపు నారదు శాప — మున మణిగ్రీవు
డనువాడు, నలకూబ — రాభిధానుండు
సంగతి సుద్దులై — జనియించియున్న
సంగజగురు డప్పు — డా రెంటి నడుమ
దూరి రోలీడ్వ, మ — ద్దులు గూలె నందు
నేరుగా నమ్మహా — వృక్షరాజముల
లోనుండి సిద్ధు లా — లో వచ్చి మ్రొక్కి
యా నీరజాక్షున — కవు డిట్లు లనిరి

## దరువు

దండమూ స్వామి ! దండమూ ॥పల్లవి॥
పుండరీకాక్ష ! బ్రహ్మాండ భాండోదర ! ॥దండమూ॥ఉ ప ॥

నీపాదములు సోక — గా పాప మణగె, మా
శాపము దీరె నో — గోపాల విగ్రహ ! ॥దండమూ॥ 1

1 'కొట్టలో' అని యర్థము

మునుపు నారదు శాప — మున వృక్షరూపము
లను బూనియున్న వా — మ్మెనసి బ్రోచిన స్వామి! ॥దండము॥ 2

తరిగొండాధిప! శేష — గిరివాస! నీపాద
స్మరణ మా కొసగు భా — స్వర సచ్చిదానంద! ॥దండము॥ 3

వ. అనిన విని హరి సిద్ధులతో నిట్లనుచున్నారు

ద్విపద వినుడు గుహ్యకులార! — వివరంబుగాను
మనుజులు దుర్మదో — న్మత్తులుగాక
తమ తమ ధర్మముల్ — దప్పక ఎర్య
సముదాము నను నమ్మి — శాంతచిత్తులకు
అలర సాక్షాత్కార — మై కర్మబంధ
ముల ద్రెంచి, చూపుదు — మోక్షంబు, నన్ను
తలచనివారి నే — దలచ నెన్నటికి
సలలిత హృదయుడై — చరియించు దేవ
మునివాక్యమున జేసి — మొనసి నన్ దలచు
మనము మీకబ్బె, ని — ర్మలులైతి రింక
జమడన్న, తరిగొండ — స్వామికి మ్రొక్క
చనిరి వారలు ధనే — శ్వరుని దిక్కునకు

వ. అప్పుడు వృక్షంబులు పడిన చప్పుడు విని వచ్చిన సంగాదులు అందున్న వారితో నిట్లనుచున్నారు

ఆ వె గాలి వీచలేదు, ఖండింపగా లేదు.
నేల వృక్షయుగము నేడు పడుట
కేమి హేతువొ? విప్ప డిప్పుట జూచిన
బాలులార! తెలియబల్కు డిపుడు

వ అనిన విని అందున్న బాలకు లిట్లనుచున్నారు

ఆ వె బాలకృష్ణు డిపుడు రో లీడ్చుకొని చెట్ల
నడుమ దూరి రాగ, నుడమిమీద
గూలె మద్దు లన్న కుఱ్ఱల వాక్యముల్
దబ్బరమచు నవ్వి తడయ కపుడు

ద్విపద ఆ నందగోపకు — దబ్జాక్షు జేరి
పూనిన జాలితో — పొసగ నిట్లనియె
చక్కని తండ్రి! యి — చ్చట నీవు చెలగి
చిక్కవం ద్రెవ్వరి — చే, తల్లిచేత
చిక్కితివే నేడు — చిన్నారి కృష్ణ!
ఇక్కడ రమ్మంచు — నెదమ జేర్చుకొని
నెనరు రెట్టింపగా — నెమ్మోము నిమిరి
తనయుని కట్టు న — త్తరి తాను ఏడ్చి
ప్రియము దీపింప నా — బిడ్డ నెత్తికొని
దయమీర నా యశో — దాదేవి కిచ్చి
జిగిమీర కృష్ణుని - చెక్కిళ్ళు నిమిరి
నగుమోము దీపింప— నందు డిట్లనియె

## దరువు*

దిట్టాతనమున ముద్దు — పట్టి మొలకు తాడు గట్టి
కట్టాడి![1] నీవెందు కిట్లా — కట్టేస్తివేనే? 1

వారీవీరి యిండ్ల జేరి — దూరు దెచ్చితే నే నీని
గారావింపక నీ రోట — కట్టిపెడిలినీ 2

తాడూ గట్టేవ బొజ్జంత — దద్దు గట్టె నిందూ జూడు
చేదే! యింత బిగ్గా గట్ట - చెయ్యెట్లాడెనే? 3

దుండాగీడై పొరుగిండ్లాలో — దొంగిలించితే యీా సారి
గంగాజీము లుండే మాన — కట్టేవేతునా?[2] 4

నన్ను గన్నాతండ్రి ముద్దు — చిన్ని బొజ్జ నాడీనుంది
మన్నించి నీ వింకనైన — వెన్న బెట్టనే! 5

* ఇది నందయశోదా సంవాదాత్మకము

1 'కట్టడి!' — 'కఠినురాలా!' అని యర్థము

2 ఈ ప్రశ్నార్థకమునకు 'తప్పక కట్టివేయుదును' అని భావము

వస్పుగ యెవ్వారిండ్లకు — నన్ను విడిచిపోకుండ
వెన్న పెట్టేగాని, పోతే — వెన్న బెట్టనా 6
నా పాలి శ్రీ తరిగొండ — నరహరి వరముచేత
నీ పాపము మట్టు నా డిట్లెంచుకవేవే ? 7

ద్విపద అనుచు నందుడు బల్క — నా గోపదేవి
కనుగీటి నగి, వలి — గాంచి యిట్లనియె
ఎరు దుప్పై మన — వెన్న బానంత
నేడు నవ్వులు వేసి — గొనుచుచు పొరుగు
వారి యింటికి బోయి - వెన్నపుగ చేతి
కూరటగా వెన్న - యుట్టందుకున్న[1]
రోలు దొర్లగవేసి రూఢిగా నెక్కి
మేలుమేలని యుట్టి — మీదటి వెన్న
ముద్దలు మర్కట — మున కిచ్చి, దాని
ముద్దు జూచుచు నందు — నురియుచుండగను
వెనువెంట నే బోయి — వేగ జూచితిని
వినయమారి గరితలు — మాటి మాటికిని
క్రమముగా నీవి దొం — గతనంబు నాకు
గూర జెప్పుచునుందు — రదియెల్ల కల్ల
యనుచు నిన్నాళ్ళు కొ — ట్లాడుచునుంటి
కనుగొంటి నీవి దొం — గతనంబు నేడు
కావున బూచి కే — క్రమమునవైన
నే నీవి యిట్టులు — నిశ్చయంబుగను
హెచ్చరికెన్ జెప్ప — డింక మీరనుచు
ముచ్చటగా బల్క — ముదితను జూచి
తనలోన నగుచు మో — దమున నందుండు
సమునం తరిగొండ — హరి కిట్లు లనియె

1 'ఉట్టి+అందుకున్న' అని విభజనము

నే నవ్వితే తా నవ్వుతారమ్మా!
నే కొత్తబోతె, తాను నన్ను కొత్తవస్తారమ్మా! 2
నే నొంగితే తా నొంగుతారమ్మా!
నేను లేత్తెను, తాను లేచ నిలువబడతారమ్మా! 3
నేను జూత్తే తానూ జూత్తరమ్మా!
నే వెక్కిరిత్తె, తాను నన్ను వెక్కిరిత్తారమ్మా! 4
తరిగొండ నారచిమ్ము రోయమ్మా!
యా బూచవాని, తరిచు తరిచు కొత్తవాలెనమ్మా! 5

ద్విపద అమ్మయ్యా! బూచివా — రా నీళ్లరోను
నెమ్మదిలో నేరు — నిలిచియున్నారు
అల నాయమ్మచీని — అడుల బోగొత్తి
సొలసి యానీళ్ళు — జూసవే నాకు
లంచు వారుండక — నావల ఒసిన
నిందు నే నుందు, నా రిందుండెనైన
నిక్కంబుగా నిందు — నే నుంద వెరతు
తక్కక తరిగొంద — దాయితోరమ్మ!

## దరువు

అబ్బబ్బా బూచికి వెరతునమ్మా!—యశోదమ్మా! వో యబ్బబ్బా! ॥పల్లవి॥
ఆ బూచీవా రింతా వుంటే — యారానైనా సొంచి వచ్చి
నా బొజ్జంతా వరిచిపొయ్యా — నమ్మా! యశోదమ్మా! వో
॥యబ్బబ్బా॥ 1

నాపొదానే కన్ను బెల్తె — నన్ను వారు చూచుతారు
నా మేనంతా ఎనుకూచున్న — దమ్మా! యశోదమ్మా! వో
॥యబ్బబ్బా॥ 2

నాపాలి తరిగొంద — నారచిమ్మచ్చామీ వాని
చూపులోనే కానిపిత్తా — రమ్మా! యశోదమ్మా! వో ॥యబ్బబ్బా॥ 3

అనె అనుచు భీతి నొందినట్టి కృష్ణుని జూచి
నవ్వి యా యశోద నన్ను గన్న

వాడ! నిన్ను గొట్టవచ్చిన బూచివా
డెట్టివాడు ? వెరవ కిపుడు జెపుమ'

ద్విపద అని గోపిదేవి ఆ — న్నడిగిన, కృష్ణు
డనుయంద నిట్లనె — నా బూచివాడు
అచ్చమైనటువంటి — యాణిముత్యముల
కుచ్చులు, బంగరు — కుచ్చులు మెరయ
కరమొప్పు నొక కొండె[1] — గట్టుకున్నాడు
తరుణముగా వెల్గు ము — క్తాఫలహారంబు
ధళధళ్యముమీర — ధరియించినాడు
జాళువా తళుకుల — నందిదండలును
దొరరార నాగబం — ధము, కంకణము
లును, మణిముద్రిక — లును దాల్చినాడు
వరరత్న మణిహార — హారంబు తోడ
జరిపెణ పులిగోరు[2] — సవరించి, బొట్టు
నెరిగింప[3] మెరనింద — వేసుకున్నాడు
తిలకంబు చొగసుగా — దిద్దుకున్నాడు
బంగారు మొలకత్తు[4] — బంధించి, దాని
చెంగుల పూల కు — చ్చులు గట్టినాడు
లోచన యుగళి ని — రొంత టన్ను
చూపువారిని తాను — చూచుచున్నాడు

1. రాజులు సొగసువారు మొగముతట్టు వేసుకొనెడు వెండ్రుకల ముడి (చూ. శ.ర., పుట 197)
చిన్నపిల్లలకు ముఖమువైపు వేసి చుట్టెడి జడను 'కొండె' యందురు 'కొండెజడ, కొండెసి' మొదలగునవి దీని పర్యాయపదములు

2 'పులిగోరు పొదిగిన పతిపెణ (బంగారు గొలుసు)' దీనినె పులిగోరు పతకమనియు నందురు

3 ఇచ్చట 'నెరిగింపక్' ప్రేరణార్థకము కాదు ఇది 'మేలిల్లు, రంచిల్లు' అనునానివలె స్వార్థకము 'ప్రకాశింపగా' అని యర్థము

4 'నడికట్టు'

తు॥ చింతపూని తేనైన – త్రాగేవటరా కృష్ణా ?
నీవు, త్రాగేవటరా కృష్ణా ?
తు॥ వగా తేనే, వెన్నితే్త – తింటానే గొపెమ్మా ! 3

వెన్న వద్దు, తేనియు త్రా – వించే రార కృష్ణా !
త్రా, వించే రార కృష్ణా !
యన్నా ! పాత్రి తేన దాగే – దెత్తానె గోపెమ్మా ? 4

పిప్పళతోడి తనె ఁని — పించే రారా కృష్ణా !
(తిని, పించ రారా కృష్ణా !)
అప్పప్పా ! కారము దిందు — రంతానే గోపెమ్మా ? 5

గురుతూగా పిగద, పాలు — త్రాగేవటరా కృష్ణా ?
పాలు, త్రాగేవటరా కృష్ణా ?
తరిగొండాహరితో రేనది[1] — లాగేనె గొపెమ్మా ! 6

## కాళీయుడు

వ॥ అనిన విని నవ్వుకొనుచు యశోద గారవింపుచుండె, నంత కృష్ణుం డట్లనేక బాలలీలలు జూపుచు, బృందావనంబున లేగల మేపుచు, వత్సబకాసుర ప్రముఖ రాక్షసులం జంపుచు విహరింపుచుండి, యొక్కనాడు గోగణంబుల దోలుకొని కాళింది మడుగునకు బోయి, కాళియ విషకలితతోయంబులం ద్రావి సొలిపడియున్న గోవుల, బాలకుల మరల బ్రతికించుకొని నందకు వచ్చినం జూచి, తద్వృత్తాంతంబు విచారించుకొని భీతిల్లి యశోద కృష్ణునితో నిట్లనుచున్నది

## ఏలలు*

మాతండ్రీ కృష్ణా ! కాళింది — మడుగూదిక్కూ పోవద్దండా
పాతాకాసర్ప మున్నాదిరా ! నా ముద్దూ కృష్ణా !
— నీకి బుస్సూమాని ఊగసీరా ! 1

---

1 'హరితోరు+ఏను+అది' అని విభజనము

* ఈ యేలలు యశోదాకృష్ణ సంవాదాత్మకములు

నమ్మా నేరా వినగానే — భయమూ నిందుచుండగాగానా
నే మించి యుండేలా పొంచ్చనే ! ఓ యశోదమ్మా !
— నీ బాల్యాల్ జగీషలంటనే ! 2
సిరికీవాడవూ నాతండ్రీ ! — పరగ పసుల మేపే నంటా
పరువూటారుచూ పోవద్దు రా ! వోముద్దూ కృష్ణా !
— పట్టుగా నా చెంతా నుండారా ! 3
తరిగొండా వారాధింపుల — పరుగానా నే నుంతా గానీ
పెరుగూటున్నా తానా వెట్నానే ! వో యశోదమ్మా !
— పెద్దవణ్ణిగా నే పెరిగెనే ! 4

ద్విపద అనుచు మాయలనాట - లాడి, గోపెమ్మ
మనసు రంజిలజేసి - మదుసూదనుండు
పరువాటు వేడ్క సె- మ్మదువున కరిగి,
తెరచి బాలకులని — ర్విణ్ణులై చూడ
సరిలేని బంగరు — పలడంబు దొడిగ
సరిగ కుచ్చులతోడ - చాల వెల్గుచును
దట్టమై తరు పట్టు - ధట్టు బిగించి
దిట్టలై మంచి ఉ - త్తరంపునందు
ప్రవహించు ఘన కదం - బక భూజమెక్కి
యబల కంఠీరవ - రూపమున నెగసి
క్రోధంబుతో మహా - కుధరం బనూడ్కి
మాధవు డప్పుడ - మ్మడువులో దుమికె

ఇట్లు దుమికిన బాలకృష్ణుని కాళియోరగుండు గరచి యతని దివ్యదేహంబునకు చుట్టుకొనియుండె, నంత యశోదాదులు అచటికి వచ్చి, పామునోత చిక్కి కదలకున్న హరిని జూచి, అందు గోపగోపికావ్రాతంబులు నావోవ్రుచున్నం జూచు రోహిణీయశోదలు తత్తరంపడుచు నిట్లనుచున్నారు

## దరువు

పామునోత చిక్కినాడు — బాలుడూ, మొడల డింక
యేమి సేతామమ్మా ? మన — మేమి సేతామే ? 1

కటకట ! ని న్నీ — కాకోదర మిపు
డీటు చుట్టెను, నె — నెటు విడిపింతుర ?
॥ నా చిన్ని కృష్ణా ! ॥ 1

నీ ముద్దులు, మరి — నీ జిగి సుద్దులు
నీ మురిపెంబులు — నే నెటు మరతుర ?
॥ నా చిన్ని కృష్ణా ! ॥ 2

తరిగొండ నృకే — సరి కరుణను ప్రా
వెరవు దీర్చి నిను — విడిపింపఁగలె
॥ నా చిన్ని కృష్ణా ! ॥ 3

ద్విపద అని యివ్విధంబున — నపుడా యశోద
యును వెందు తా సుతు — నొయ్యన గాంచి
'హా వంశ భూషణ ! — హా నోముఫలము !
హా వీర ! హా ధీర ! — హా సత్కుమార !
మున్ను రాక్షసి వచ్చి — మోసంబు జేసి
చన్ను బాలసుచు వి — షంబిచ్చినపుడు
విష విజయుండవై — వెరవని నీకు
విషధిశయన ! సర్ప — విషమెక్కె నకట !
నీ మంజు భాషలు — నీ వినోదములు
నీ మన్ననలు జూడ — నే నెందు బోదు ?
మా జోలి లేక ని — మ్మాత్మడ్కి మైమరచి
ఈ జల మధ్యమం — దిట్లున్న నిన్ను
కనుగొనుచుండియు — కాయముల్ విడువ
మనసు ! మాయంత క్రూ — రాత్ములు గలరె ?
బిడ్డలు లేకనే — పృథ్వీతలమున
గొడ్డాల[1] మనిపించు — కొనియుండి, తుదకు
నీవంటి సత్కృపా — నిధిని పుత్రకుని

1. 'గొడ్డు + ఆలము' అని విభజనము ఇది ఉత్తమ పురుష బహువచనము 'ఆలు' శబ్దము పరమైనను, రుగాగమము రాకుండట ఇందలి ప్రత్యేకత

గా వేడ్కతో మేము — గన్నందు కేమి
గట్టు కొంటిమి ? యిందు - గలిగి నీవేమి
గట్టుకొంటివి ? కట్ట — కటా కట్టులయ్యె
మా ముద్దులయ్య ! వా — మన్నారు కృష్ణా !
ఏమి సేయుదము ? ని — న్నీ చిన్నవాడె
పాపాత్ములము మేము — పశువుల వెంట
నేప నంపితిమి నీ — చే పోర్వలేక,
మాకేల పశువులు ? — మాకేల బ్రతుకు ?
మాకేల తనువులు ? — మాకేల సుఖము ?
†కొదుకక వెంటనే — గనిపావు మమ్ము'
అని పల్కి యిరువురు — హా ! యని యేడ్చి
మానసులు హరియందె — మగ్నముల్ జేసి
'పదపద మడుగులో — బడుద' మటంచు
పదరి పోవుట జూచి — బలు డిట్టు లనియె

ఆ. వె. తల్లి దండ్రులార ! తత్తరమున మీరు
మడుగులోన బడుట మంచిదగునె ?
పాము నదరదట్టి పద్మాక్షుడిక వచ్చు
చూచుచుండు డింక శోకపడక

## దివ్య నాట్యము

ద్విపద అని పల్కుచుండగా — నంబుజాక్షుండు
తన దేహమును బెంచ — దండశూకంబు
చుట్టిన చుట్లు వీ — డ్చుచును, తత్పుచ్ఛ
పుట్టహంబుతో — నలరి చెట్టి

---

† ఈ పంక్తికి ముందుండ వలసిన పాదమొకటి లేఖకుని ఏమరుపాటువలన లుప్తమైనట్లు ప్రాసనుబట్టి స్పష్టపడుచున్నది

గిట్టదై గిరగిర — ద్రిప్పి యచ్చోటు
గట్టిగా బడవైచి - పునతర యమున
లోపల నించు క — ర్నోల ఘోషంబు
లాలితమగు మర్ద — ళ ధ్వనిగాగ
బృందావనములోని — భృంగాళిమోత
క్రందైన గాయక — గానంబుగాగ
కలహంస శుక పిక — కలకల ధ్వనులు
సలలితమగు తాళ — శబ్దముల్ గాగ
నాకమందుండి యా — నంద మింపొంద
లోకతో జూచెడి — సుత్రామముఖులు
సరసులై వీక్షింప — సభ్యులుగాగ
సురుదివ్యమణిసట — లుజ్జ్వల కాంతి
మహిత కాళీయఫణి — మంటపమందు
బహువిచిత్రంబుగా — ఎటునటుభంగి
నటియించె వేల్పు లా — నంద మింపొంద
తటుకున భేరికా — ధ్వనులు మ్రోయించి
కుసుమముల్ వర్షించి — కోలాహలముల
వెస ఘటించిరి తాళ — విధి దప్పకుండ,
వర తరిగొండ ని — వాసుడై శేష
గిరివాసుడగు బాల — కృష్ణుడు సల్పు
వింత నాట్యమునకు — వెరగు నొందుచును
సంతోష మొందిరి — సకల యాదవులు

## దర్వు, ఆదితాళం

ఆడెనే! కృష్ణు — డాడెనే! ॥పల్లవి॥

పాడుచు నా గో — పకు లందరు తన
వేడుక జూడగ — వింతగ నగుచూ 4 ఆడెనే ॥అ.ప.॥

తతకిట తకఝుం — తది గ ధిమిత యని
గతులు[1], చొల్లు[2] లతు — లితముగ మెరయా ॥ఆడెనే॥ 1

చెరుచు చిరు గ — జ్జెలు, నూపురములు
ఘలు ఘలు ఘుం ఘులు — ఘల్లని మ్రోయగా ॥ ఆడెనే ॥ 2

ధాధా ధణంధణ — ధణిత యనుచు గీ
ర్వాణులు నభమున — వరుసగ బొగడా ॥ ఆడెనే ॥ 3

మణిభూషణములు — మరి మరి కదలగ
ఘణ ఘణ యని మొల — ఘంటలు మెరయగా ॥ ఆడెనే ॥ 4

తారి తకిణఝుం — తకకిణ తకఝుం
తారి తకిటతక — తాతై యనుచూ ॥ ఆడెనే ॥ 5

వర తరిగొండ ని — వాసుడు వేంకట
గిరి నిలయుండగు — కృష్ణుడు చెలగ ॥ ఆడెనే ॥ 6

## శరణాగతి

ఉ. అప్పుడు కాళియోరగుని యంగన లా విధమ్ము జూచి, బల్
తప్పైన కార్యమంచు పరితాపము నొందుచు కృష్ణుపాలికిన్
జెప్పున వచ్చి మ్రొక్కి, అతిదీనత నొందుచు పల్కిరిట్లు మా
తప్పు సహించి, కృష్ణ! యిక తాండవమాడక నిల్చిపోవవే!

వ. అని మరియిట్లనుచున్నారు

---

1 నాట్యమున తాళానుగుణముగా అడుగు వేయుటకు 'గతి'యని పేరు. ఇది I ఏకసరగతి II ద్విసరగతి III త్రిసరగతి యని ప్రధానముగా మూడు విధములు. ఈ త్రివిధగతుల లక్షణములకు చూ. నృత్తరత్నావళి, VIవ అధ్యా, 181–184 శ్లోకములు.

2 'శొల్' అను ద్రావిడ శబ్దము దీనికి మూలము. 'చొల్లు' అనగా 'తతకిట, తధిగిణ' వంటి వాద్యజతులు (Rhythm-syllables). నాట్యసందర్భమున వీటిని ఉచ్చరించుట (Oral recitation)ను నృత్తరత్నావళీకారుడు 'వక్త్రవాద్య' మని పేర్కొనెను (చూ. నృత్తరత్నావళి, VIIవ అధ్యా, 12 శ్లో.)

కరుణించి, తెమ్మని — కాళియోరగుని
ఫణములపైనుండి — చెచ్చెర దుమికి
యలఘుశాంతి వహించ — యాత్మ మోదించ
కలికికృష్ణుం డొక్క — కడ నిల్చియుండె

వ అంత కాళియోరగుండు హరికి మ్రొక్కి అపచాంక్షమజేసికొని తన కాంతలతో నిజస్థానంబు జేరె. నంత రామకృష్ణులం దోడ్కొని నంద యశోదాదులు గోష్ఠంబునకు జని యుక్తస్థల నుండి, రందొక్కనాడు హరి బృందావనంబులో నిల్చి వేణుగానంబు జేయుచుండగా విని గోపకాంతలు వారి కెదురుగా బోయి తమలో దా మిట్లనుచున్నారు

## మురళీగానము - గోపికల ఆరాటము

ద్విపద సుందరీమణులార! — చూడు డీ దిక్కు
బృందావనంబులో — ప్రియుడైన నంద
నందను డిప్పు డా — నందించి, మురళి
కందర్పుడై పూర్ణ — కళలతో వాము
భాగానతానన — పద్మంబు గదుర
బాగుగా డాకాలి — పై సాచినట్టి
చరణనఖద్యుతుల్ — జగతిపై నిండ
శిరమున నవరించు — శిఖిపింఛమాల
అల్లాడ, ఘనకంఠ — హారంబుతోడ
మల్లాడు[1] నవమాన — మాలికల్ వీడ[2]
చెలగి కర్ణావతం — సిత కర్ణికార
కళ దివ్యగండభా — గ ప్రభ మెరయ
కరపంకజాంగుళీ — క్రమనటనంబు

---

1 'మల్ల+ఆడు' అని విభజనము 'పెనగాడుచున్న' అని యర్థము (చూ శ.ర. పుట 609)

2 'విద్చుకొనగా' అని యర్థము

సరస స్వరౌఘ భా — స్వర సర్మంజరీ
జూప, భ్రూయుగళంబు — శోభిల్ల, వార
చూపులతో[1] లోక — సుందరమూర్తి
యాదవపై తగ వేడ్క — నధరంబునందు
పొందించి యూదుచు — భూరి శృంగార
రస ముప్పతిల, నవ్య — రాగానుసరణ
నెమరు నటియించి — బహుతాళగతుల
మనమీద నత్యంత — మానసమందు
పెనగొన కన్నులు — బెళికించి[2] నగుచు
చూచుచున్నాడమ్మ — సొగసు చూచితిరె!
యీచెలి వదింరే — సుందరులార!
శ్రీ తరిగొండ నృ — సింహుని వేడు
నీ తీరుగా నంట — విడబాయకుండ
మురళి యామునతట — మ్మున నిల్చి మున్ను
చిరముగా తపమేమి — చేసెనో యమ్మ?

## దరువు*

ఏమి తపము జేసెనమ్మా? — యీ మురళి పూర్వ
మేమి తపము జేసెనమ్మా? ||పల్లవి||

హేమాంబరు నెపు — డెడబాయక తగ
వేమరు హరిమో — వి నిలు బొందెదనని ||యేమి తపము||అ.ప|| 1

సుమలక్షైనను బొంద — రాని ఘనతరపదవి
మురళి కెక్కడ వచ్చె పూని?
వనసీమ సుతకై — నను గలుగుట లరు
దని జను లెన్నుదు — రవురగ ధరపై ||ఏమి తపము|| 2

---

1 'ప్రక్క (ఓర) చూపులతో' అనగా 'కడగంటి చూపులతో'నని యర్థము.

2 'తళతళమని ప్రకాశింపజేయుచు' అని భావము

* ఈ దరువులో ప్రథమ చరణమందలి తొలి రెండు పాదములు పల్లవిగను, మలి రెండు పాదములు ఉపపల్లవిగను పేర్కొనబడియుండుట గమనింపదగినది

తరిగొండ నారసింహు — డైనా శేషాద్రి విభుని
కరుణ దానికి గల్గెగానా
హరి యధరామృత — మిగవుగ గ్రోలెడి
గురుతర భాగ్యము — దొరికెను నిజముగ ॥నేమి తపము॥3

ద్విపద ఓయమ్మలార! యిం — కొకమాట వినుడి
మాయా ప్రపంచ ధ — ర్మముల బోనాడి
సారంబులేని సం — సారముల్ విడచి,
శ్రీరమాధిపు జేరి — సిగ్గులు విడచి
'యెలమి పద్మాక్ష! మ — మ్మేలవయ్య' యనుచు
పిలుతమా సఖులార! — ప్రియభాషణముల,
కామమార్గణముల — కనులలో నుంచి
తామరసాక్షు చి — త్తము గరిగించి
చూతమా సఖులార! — సొగసులు మించ,
నూతనమైన యా — నందంబు కొంత
జేతమా సఖులార! — చిత్తంబు దలర
ప్రీతితో కృష్ణుని — బింబాధరంబు
గిరుతమా సఖులార! — కౌగలిమ్మనుచు
కరములుసాచి యా — ఘనుని చేపట్టి
పురుతమా సఖులార! — ముద్దులుబెట్ట,
సరసంబు లాడుచు — జలజాక్షు వెంట
పోదమా సఖులార! — భూధరంబులకు
నేడియు వెరియు కి — ట్టమ్మహామహుని[1]
చెనకిన, మనల మ — చ్చిక గమనట్లు
తనవారమని చాల — దయజేసెనేని
ఎరిం దయలేక ర — చ్చల బెట్టెనైన
నరుసగా మన మగ — నారు ప్రాణములు
అశింతురా? మన — మటు జేయదగునె?

1 'ట్టిమ్మహామహుని' అని యుండిన యతిమైత్రి కుదురును.

తరిగొండ నారసింహుని - శరణు బొందరే ।
మనకు, సారిదీగ కృష్ణుని దెప్పి చూపుచున్నారే ।
॥వెడలెంద ఉద॥

## దరువు (కోలాట), అటతాళం

హరికృష్ణ ! హరికృష్ణ ! హరికృష్ణ ! శరణని
యులరుచు కోలాట లాడుదామా ? ॥పల్లవి॥

ఝమ్మని మన చికు — రమ్ములవలె — నుండే
తుమ్మెద కొదముల — తోలుదామా ? 1

మన వదనము కన్నసు — మంచేమని యుండే
వనజములను గోళ్ళ — గ్రచ్చుదమా ? 2

కళలచే మన నేత్ర — ముల ధిక్కరించు ని
కలువరేకుల పట్టి — పులుముదామా ? 3

పావనమగు మన — మోవితేనెలవంటి
తావిమకరందము[1] — త్రావుదామా ? 4

మురిపైన మన బా — హువులను హసించు తా
మరనాళముల ద్రెంచి — మరలుదామా ? 5

గురుతరముగ మన — కుచముల గేలించి[2]
నెరయు చక్కవలను — తరుముదామా ? 6

మదమొప్పు మనప స్త — ములవలె దగు కోక
నదములాల గదలించి — తోదుముదమా ? 7

ధర మన పెక్కుళ్ల — కరణ పట్టువగాను
తిరుగు ఎళ్ల సుళ్ల — నోరయుదామా ? 8

1. తావిగల మకరందము
2 'పరిహసించి' అని యర్థము

పట్టుగ మన నితం — బముం పెలికె నుండు
నట్టి సైకతములం — దాడుదామా ? 9
ఎలరాగ మనపాద — ములనల నిచ్చట
కులికె కమరమలాను — గొట్టుదామా ? 10
రంగుగ [సొం]గు త — రంగమాలికలపై
వ్రంగి వుయ్యల లూగు — చుండుదామా ? 11
సమ్మతిగా ఎరి — అమ్మ నొండారులపై
చిమ్మన గ్రోవుల — జిమ్ముదామా ? 12
పోడిమి యాలలు — బాడుచు జోడుగా
వేడుకగా నీటు — లాడుదామా ? 13
ఉల్లాసములర యీా — చల్లని జలమెత్తి
చిల్లాపొల్లుగ[1] నెగ — జల్లుదామా ? 14
దిట్టముగ నీ — నది నీరు పై కుట్టు
నట్టుగ సేతువ — గట్టుదామా ? 15
శేషాద్రి పతియైన — శ్రీ తరిగొండ నృ
సింహాని కృష్ణుని — జేరుదామా ? 16

ద్విపద అనుచు నొండొరులు గో — పాంగనామణులు
గొనకొని చిమ్మన — గ్రోవుల నిండ
సలిలంబు నించి యా — శ్చర్యంబుగాను
చెలగి యొండొరులపై — జిమ్మ నవ్వుచును
శ్రీకృష్ణు బాడుచు — చెలరేగి మురిసి
ఏకతో విహరించు — నేళ కృష్ణుండు
వారిజనేత్రలు — వారి వేడుకకు
వారి మధ్యమున ని — ర్వాణులై యున్న
సరణి భావించి యు — క్కడికేగి[2], వారు
చరియించు టీక్షించి — సరితరి[3] యనుచు

---

1 'సంక్షోభమగునట్లుగా' అని యర్థము (చూ శర పుట 270)

2 'యచ్చటి కేగి' అని యుండిన యతిమైత్రి కుదురును

3 సరియైన సమయము.

చలికాంట్ర కనుచుస్సు — ఒసి యుందందు
నిలిపి, తానొక్కడే — నిపుణత మెరయు
సుదతు లెక్కడ తను — జూతురో ? యనుచు
పొదలమాటున డాగి — పొంచి లో నగుచు
నల్లరితాళ్ళ మిరి — శ్వరుడునై యుండి
మెల్లన నడచుచు - మేను వంచుచును
బాలుని భంగి న — పద్మలోచనల
చేలంబులెల్ల క్రము — చ్చిలి కొనిపోయి
తరిగొండహరి పొన్న — తరువుపై నెక్కి
తరుణుల చిహ్నముల్ — తగ జూచుచుండె

ఇట్లు గోపకాంతలు జలక్రీడలాచరించి, కట్టు పుట్టంబులు గానక చలిచేత వణంకుచు తనుతోదా మిట్లనుచున్నారు

## చీరలు వెదకుట

### దర్వు, అటతాళం

మనచీర లెవే వోయమ్మా ?
అమ్మా! యీమాయ యేమే వోయమ్మా ? 1

యింకెట్ల జేతా నోయమ్మా ?
అమ్మా! యిందెవ్వరుండీ రోయమ్మా ? 2

యిందె వుంటి వోయమ్మా!
అమ్మా! యెవరెత్తుకపోయా రోయమ్మా! 3

సుడిగాలి రాలే దోయమ్మా!
అమ్మా! చుట్టుకపోలే దోయమ్మా! 4

ముచ్చు లెత్తినా రోయమ్మా!
అమ్మా! యీపూల జాడా డోయమ్మా! 5

ఆ దిక్కు వెదకూ డోయమ్మా!
అమ్మా! యీదిక్కు జూడూ డోయమ్మా! 6

కాడలు ఒట్టా డోయమ్మా !
లమ్మా ! యేడ బాలా లే దోయమ్మా !

చారు తిందున్నా రోయమ్మా !
అమ్మా ! కోదించిచూడూ డోయమ్మా !

తరిగొండహరికీ వోయమ్మా !
లమ్మా ! తక్కక మ్రొక్కు కోంవమ్మా !

ద్విపద అని గోపికలు చీర — లందందు వెదకి
కనలేక భీతిచే — కళవళంబంది
తక్కక తమలోను — తా మిట్టులనిరి
ఎక్కడ పోయె నె — డీ చీరలన్ని ?
నాచీర యెట్టిద న్నమ విచిత్రముగ
పూసిన బంగరు — పువ్వుల చీర
నెలతరో నాచీర , — నీదెట్టి ? దనన
తళుకుల నొప్పు [ర—క్త]పు పన్నె చీర
కమలాక్షి ! నాచీర — కరకంచు చీర
రమణి నాచీర వా — ర బవంతు చీర
సఖియరో ! నాచీర — సరిగెంచు[1] చీర
ఒకవాణ ! నాచీర — పెమబాల చీర
ఎంనాగ ! నాచీర — యెఱ్ఱని చీర
నలువొప్పు నాచీర — నల్లని చీర
లలన ! నాచీర లె — ల్లని [చాయ] చీర
కలకంఠి నా చీర — ఘనపట్టుచీర
అని తమతమ చీర — లట్టిట్టి వనుచు
నానరగా నిరీతి — నొక్క రొక్కరికి
జెప్పుచు మోములు — చిన్నజేసికొని
తప్పక తరిగొండ — ధామ ! నీవైన

---

1 'సరిగె+అంచు' అని విభజనము

మాపాలిటికి వచ్చి — మాచిరలన్ని
జూపవే! మానముల్ — [చూర] బోనియక'

వ ఇట్లు హరికి మ్రొక్కి, మరిన్ని ఒకర్లోగా మిట్లనుచున్నారు

సీ ఈరీతి నెరవగానె? యిచ్చోటనే
చోరుల వెదకరే సుదతులార!
పూరుషుడైనట్టి చోరుని ఎట్టితే
సిగ్గులు దక్కునా చెలియలార?
కోకలన్నియు సిగికొని దిగంబ[రలమై]
యిక నెందు పోదమో యింతులార?
ఇండ్లలో సుండగా రీరీతి దెలిసితే
చీరలు దెత్తురె చేడెలార!

గీ వారి కిది యెట్లుదెలుసునే వనితలార?
తెలిసితే తిట్టకుందురా తెరవలార!
మోసపోయితి మికనెట్లు ముదితలార?
ఇంత భయ మెన్నడెరుగమో కాంతలార!

వ అని స్వామి నుద్దేశించి యిట్లనుచున్నారు

## దరువు, కాంభోది(జి?) రాగం, ఆది తాళం

మాతప్పు నున్నించి — మానము గావవే దైవరాయా!
నీకు, జాతర జేసేము — సద్భక్తితో నేము దైవరాయా! 1
యిచ్చోటికి పురుషు — [లెవరు రాక] మున్నె దైవరాయా!
నీవు, వెచ్చేర వచ్చి మా — చీరలు జూపవే దైవరాయా! 2
వరతరిగొండని — వాస! నీ పుణ్యము దైవరాయా!
పరగ కొన్నాళ్లింక — బ్రతికేట్ల[1] జూడవే దైవరయా! 3

1. 'బ్రతికే+అట్ల' అని విభజనను,

ద్విపద అని యిట్లు తరిగొండ - హరిని ప్రార్థించి
[తను]వులు గంపింప — తనుకించి, యొకరు
ఒక్కరి నిక్షించి[1] — యో యక్కలార !
ఎక్కడ బోయె నే — డీ యంబరములు ?
సుడిగాలి వచ్చి దా - చుట్టి వేచెనొ ?
జడియక మ్రుచ్చు లి — చ్చట డగియుండి
కొనిపోయిరో గాక — కోమలులార ?
పనవెంగు [కి] చటి కి — మ్మార్కిటి వచ్చితిమి ?
వచ్చినవార మా వసనముల్ విడిచి
యచ్చట బెట్టి భ — యంబేమి లేక
నిచ్చట నెటిరో - గేల తొచ్చితిమి ?
చొచ్చినవార ము — చ్చోటి చేలములు
ఎచ్చట బోయిన — దెరుగ కందగము
ముచ్చట లాడుచు — మోసపోయితిమి
ఇచ్చట కెవరైన - నేతెంచి మనల
నుచ్చికలో జూడ — మనకేవి తెరువు ?
మందబుద్ధులు బట్టె — మన కందరికిని
ముందర గతి యెట్లు — ముద్దియలార ?
యనుచు నొండొరులు న — య్యాక్రాంతలగుచు
తనువులు గంపింప -- తమ సమీపమున
చేలముల్ గొని పొన్న — చెట్టెక్కియున్న
బాలకృష్ణుని జూచి — బాగాయె ననుచు
సొలతులు మొగమొగం — బులు జూచికొనుచు
తలకొని తరిగొండ - ధాముని మాయ
కనరాదనుచు చాల — కళవళంబంది
గునిసి[2] కొందరితోను — కొంద రిట్లనిరి

---

1. 'గోపికలు పరస్పరము వీక్షించి' అని భావము
2. 'గొణిగి' అని యర్థము (చూ ఆం శ్రీ స్వ ము దీపిక పుట 374)

## మ్రానిపై కృష్ణుడు - కొలనిలో గోపికలు

### దర్వు, ఆది తాళం

ఎదిగినే మానిమీద కృష్ణుడమ్మా!
నేడెంతవాడు? కురురుగా గూచున్నా డోయమ్మా!
యెందుకుంటే ఎదు వచ్చెనమ్మా?
చూడకపోతె, మీదనే వుండెనుగదరమ్మా!
వీడు చోరవిద్యవాడే నమ్మా!
లేకుంటె వచ్చె, జాడ గానిపించదటరమ్మా?
వేడుకొని చీర ఒడుగరమ్మా!
కృష్ణుని నెమ్మి, చూడ సిగ్గయ్యెని గదరమ్మా!
సిగ్గు పోనేపోయె గదరమ్మా!
తరిగొండ నార, సింహుని భజన జేయరమ్మా!

క. అని కాంతలు లజ్జింపుచు
గానకొని నదిలోని కరిగి కుత్తుకదనుకన్
తనువులు దాపుచు, కృష్ణుని
కనుగొని మ్రొక్కినిరి చాల కళవళ పడుచున్

## ప్రార్థన

శ్లో॥ సూర్యాది గ్రహ తారకాంతరగతం సూక్ష్మాదిసూక్ష్మం, జగ
త్కార్యాకార్య వివేచనం మునినుతం కారుణ్యసద్వారిధిం।
తుర్యాతీతసమాదిపూర్ణ మచలం దూరీకృతాఘం, మహా
శ్చర్యం శ్రీతరిగొండ శేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥

ద్విపద ఓముద్దుగోపాల! — యో శర్మచేల!
ఓమన్మథాకార! — యో మేరుధీర!
తోయజేక్షణ! — నీవు — దొంగవై వచ్చి
మా యంబరంబులు లే — మరిన, మ్రుచ్చిలుచు

గ్రక్కున చెట్టెక్కి — కదలి కిచ్చోట
చొక్కమున మ్మీరిలి — జూచుచున్నావు
మానినులను జేరి - మర్యాద విడిచి
మానముల్ జూతురే — మగవార లిట్లు?
మునవర్ణ! నీకు గా — గా నెట్ల, నింత
పని జెల్ల దెవరికి — పరికించి చూడ,
కోరి మా [సిగ్గులు] — గొంటి విం కేల?
చీరలనైన మ — చ్చికతోడ నొసగు
మని తరిగొండేశు — నహిశైలపతిని
మొనసి ప్రార్థింప, వి — మ్మగ కృష్ణు డనియె

## ఏలలు*

యీా రీతినీ చోరుడాని — దూరుచున్నా రంతెగాని
చీరాలు నే నెరుగాను పోరే! వో కొమ్మాలారా!
— చిడిముడిపాటా లాడకారే! 1

చీరా లెత్తూ కాపోయినా — చోరూడావూ నీవేగానా
చీరాలన్ని మా కందియ్యారా! వో ముద్దూకృష్ణా!
చేరి నిన్నూ సేవించేమూరా! 2

మీ చీరాలు గాలిచాత — మింట కెగిరీ పోవుచుంటె
చూచీ తెచ్చి యిందుంచినానే! వో కొమ్మాలారా!
— తేచీవచ్చి గైకోని పోరె! 3

తగ్గి తగ్గి నీట లోనూ — తనువూలిలా దాచీనా మేమూ
సిగ్గూలేకా వచ్చేదెట్టూరా? వో ముద్దూకృష్ణా!
— చీరలూ దెచ్చి మా కియ్యారా! 4

తరిగొండా నారాసింహుడూ — దండించీని మిమ్మిప్పూడూ
సరగునా లేచిచటికి రారే! వో కొమ్మాలారా!
త్వరగా చీరాలూ గట్టూకోరే! 5

* ఈ యేలలు మొదలుకొని, చెట్టుపై నున్న కృష్ణునకు, నదిలోనున్న గోపికలకు నడచిన సంవాదము విపులముగా వర్ణింపబడినది.

రాజాసామూాతో నీవూ చీ - రా ఒన్నేసం వెనూ మెమూ
రాజాతో జెప్పాకాపోమూరా ! వో ముద్దా కృష్ణా !
— రవ్వలేలా ? చీరా లియ్యారా ! 2

రాజాలో [జెప్పా] నూ మీా - రారంభించియున్నా రట్టైతె
రాజెవ్వాడో నాకూ జూపారే ? వో కొమ్మాలారా !
— రాజుకడకూ పోదామూ రారే ! 3

రాజూకడకూ బిరబిత్తాలే - రమ్మాని వట్టైతే నేలే !
వ జాగా, దీ మాటూ లనకూరా ! వో ముద్దూ కృష్ణా !
— నచ్చి మా చీరా లం[దియ్యా]రా ! 4

మీాకెందూ రాజున్నాడాని — ేకగా వంటరీ వూనీ ?
నాకూ మీారాజూనూ జూపారే ! వో కొమ్మాలారా !
- నాటికి మీ చీరా లిచ్చేనే ! 5

శ్రీ తారీగొండా వూ నరా - సింహా ! మాకూ రాజావీవే !
ఖ్యాతిగా నన్యాలూ తే[రూరా !] వో ముద్దూ కృష్ణా !
- కావున మా చీరా లియ్యార ! 6

ద్విపద అన విని శ్రీకృష్ణు — డతివల జూచి
కసుగీటి పలికె నో — కామినులార !
ఎవని వీక్షించి మో — హించితి రిచట ?
ఎవడు మీ హృదయంబు — లెల్ల హరించె ?
మరువ కే పురుషుని — మగనిగా దలచి
మురియుచున్నారు ? మీా — ముచ్చట లెల్ల
తెలుపు డన్యుడగాను — తెలియ బాధ్యుడను
తలపులు మీారేల — దాచెదరింక ?
మొనపి చల్లకు వచ్చి — ముంత దాచినను

---

1 'బంధువు' అని యర్థము 'బాధ్యుడు, బాధ్యము' అను పదములు సన్నిహిత బాంధవ్యము ను దెలుపునవిగా చిత్తూరు మండలమున నేటికిని వ్యవహారములో నున్నవి

అని యౌనె చెల్వ, యం — బరవు రాసిద
[నడిగి]తే లేదన. — నటమోర నేను
నడిగిన నిచ్చెద — మని మాటచేసి[1]
వచ్చి కైకొనుడు మీ — వసనంబులన్ని
యిచ్చెద, నీటలో — నిటు నానవలదు
చలిచేత వాతంబు — సంభవించీని
కలకంఠులార! శీ — ఘ్రమె రారె! యనుచు
పలికిన తరిగొండ — పతిని వీ[క్షిం]చ
లలిరాకుబోణు లం — దరు నిట్టు లనిరి

## దర్వు, ఆట తాళం

చీరాలు కట్టక — నె రీతి ఎత్తుము బాలకృష్ణా?
మీ రీ, వారి వెడలివచ్చి — చీరలు గట్టరె చెలియలారా! 1
చేరవచ్చేము మా - చీరలు ఇయ్యర! బాలకృష్ణా!
నన్ను, చేరితేగాని మీ — చీరలియ్యను పోరె! కొమ్మలారా! 2
తరిగొండవాస! యెం — తటి నేర్పరివౌర! బాలకృష్ణా!
నన్ను, దురుసుగ మీరింత — దూరితే నెరతునా కొమ్మలారా? 3
[వ అని పల్కిన విని గోపకాంత లిట్లనుచున్నారు ]
గీ అయ్యయో! నీట దేహంబు లదరసాగె
నేమి సేతుమురా కృష్ణ? యెంచి కంక
నారి మగవారు రాకమున్నె రయమున
తెచ్చి మాచీర లీర! సందేహమేల?

ద్విపద. అన విని శ్రీకృష్ణు — డతివల జూచి
తనలోన నగుచు న — త్తరి నిట్టు లనియె
వనితలార! మగ — వారెవ్వరైన
మొనసి వచ్చిన సిగ్గు — మోసమౌ ననుచు
దిగులు నొందెదరైతె — తెలిసి చూచినను

---

1 'వాగ్దానము చేసి' అని యర్థము

మగువనే నేనైతి ? — మగవాడగానె ?
మీదగ్గరికి వచ్చి — మీకు నన్ చీర
రాదరంబుగ నియ్యి — మనుటకు మీకు
సిగ్గులేకను, నన్ను — చెరవచ్చుటకు
సిగ్గంటి రటుగాన — చీర లెత్తికొని
మీకూలినాడనై — మీకిచ్చు పనిక
నాకు సిగ్గయ్యె [ని — నా] తల్లిదండ్రి
యుది ఎన్న చెట్టుదు — రింక మీతోను
మదవతులార ! నే — మాట్లాద వెరతు
మీ చీర లిచ్చటికి — మీ మగల్ వచ్చి
మీ చేతులందుంచి — మీ సిగ్గు గావ
వలె, నిందు పర నుగి — నడకై నెను
చెలగి మీ చీర ల — ప్పిన సిగ్గు చోడె ?
కొంటెలై ఎడచి
జంటగా నుర లి — చ్చట నుండు నేళ
నొంటిగా నిచట నే — నుంటినేని
కంటు దొచును మీ మ — గండ్ర కందరికి
కావున నాతోడు — గా మీ మగండ్ల
వావిరి నిచటికి — వచ్చిన, నాకు
భయము దీరు నటంచు — పలికి, వేణువును
రయ[ము మధు]రాగ — రంబుపై నుంచి
తగ నూది తరిగొండ — ధాము డా చెలుల
మగలను బిలిచె న — మ్మతి నిట్టు లనుచు

### ఏలలు

కియ్యో ! యూని ఎసుూ నెల్గా — గెంటా కి దిక్కూ మళ్లించి
ఉయ్యానా నిందూ రండోండ్లాలా ! వో గౌండ్లాలా !
— సరవిపీ జాడుడీ [సెండ్లాలా]

యీ రథసామెల్ల నారి — వారందారూ విని పరువు
బరి ఏచ్చితే వేమెట్ల — బ్రతుకుదు ? మయ్యయ్యో ! యింకా
॥పిలువావద్దురా ॥ 2

నవ్వుగదు తారిగొండా — [నర] హరితోడే ! మమ్మిందు
రవ్వ జేయవద్దు ! మా చీ — రా లిచ్చి సిగ్గు నిల్పారా !
॥పిలువావద్దురా ॥ 3

(ఏ లనిన గోపికలతో కృష్ణుం డిట్లనుచున్నాడు )

## ఏలలు

మగలాను నే బిల్చేనాని — పగులు నొందేరైతె గాని
నే గట్టిగా పిల్చుట మానేనే ! వో కొమ్మలారా !
— వేణునాదామైనా జేసేనే ! 1

పొందూగా వెణువూదీనా — యందరు ఎత్తూరుగనా
నెందాకూ రచ్చవెట్టేవురా ? వో ముద్దూకృష్ణా !
— యింత నిర్దయా నీకేలార ? 2

యెంతా నే బిల్చినా రాక — పంతాముతో నంటె యున్నా
రింతా నెనరూ లేదినే ? వో భామలారా !
— యేమి మీకూ నన్నుడానేమే ? 3

బిరబిత్తాలే రమ్మానూచు — తరుణాలాను చేరా బిలచె
పురుషూ లెందున్నారు తెలుపారా ? వో ముద్దూకృష్ణా !
— ఘూటిసితి మదిలో దలపారా ! 4

నరిసి చీరాలు విడచి — జలమూలాలో పీదులాడె
తరుణాల మీరెందు గన్నారే ? వో భామలారా !
— అప్పు నిన్నే లెన్ని యన్నారే ? 5

సమ్మతముగా తారిగొండా — స్వామీ ! నిర్వాణముగా నీవూ
మమ్మూ చూడావలె నేమిరా ? వో ముద్దూకృష్ణా !
— మంచి, దైవె వత్తూ వేమిరా ? 6

## నిర్వాణులు - గోపాలుడు

ద్విపద అని పల్క యాకాంత — లందరు ధైర్య
[ము]న కృష్ణు నీక్షించి — 'ముద్దుగోపాల!
లచ్చుగా నీవంట — యభిమానవారి
రచ్చ బెట్టునే — రమణీమణులను ?
ఎమ్మిటు గనుట నీ — మానసంబునకు
నమ్మతమైన న — చ్చటికె వచ్చెదము
లోకాత్మ! నీ యాజ్ఞ — లోనె నిల్చెదము
మాకెల మానవ — మానంబు ?' లనుచు
మానినీమణులు వా — మ కరాబ్జములను
మానరక్షణము స — మ్మతిని గావించ
పాలిండ్లు దక్షిణ — పాణిపద్మముల
చాల గప్పుచు జలా — శయముద్ర వెడలి
వచ్చిన వారి ని — ర్వాణ చిహ్నంబు
లచ్చుగ తరిగొండ — హరి గాంచి పొన్న
చెట్టుపై నుం [చిన — చీ] రల మూట
దిట్టడై కొని ప్రాకు — రిగ యిట్టు లనియె

### దరువు, ఆదితాళం

నమ్మితినాయనే ముద్దు — గుమ్మలారా!
నే మీ, సొమ్ములైతినె బంగారు — బొమ్మలారా! 1
మీరు రెండు చేతులెత్తి — మెలతలారా!
నాకు, నెరుపుతో మ్రొక్కవె — [నెలతలారా! 2
ఆరగొం]డ వాసుని తోడె — తరుణులారా!
నాకు, వరగానా చీర లిచ్చేసె — సఖియలారా! 3

వె చిన్నికృష్ణ! రెండు చేతులతో నీకు
మ్రొక్కుమన్న నిపుడ మ్రొక్కలేము,
మొవసి యొక్కచేత మ్రొక్కుమనిన, మేము
నీకు మ్రొక్కగలము నీరజాక్ష!

[ఆ వె చేడెలార! యొక్క] చేత మ్రొక్కిన మ్రొక్కు
లెందు కిపుడు మెచ్చు నీశ్వరుండు?
రెండుచేతు లొక్కరీతిగా పైకెత్తి
విడిచి మ్రొక్కుడింపు నెంతవార!

## జంపె

ఇటువంటి యన్యాయ — మెందైన గలదటరా కృష్ణా?
కటకటా! కృష్ణ! మా — పటము లందియరా! 1

న్యాయంబుగా [నేను] — నమ్మింప, మిరం
న్యాయమిది యని పలుక — నర్హమగునటరే! 2

యిపుడు చేతులను పై — కెత్తుడని పలికేవు
కృపాత్మ! నీకు కని — కరము లేదటరా? 3

కనికరము నామదిని — కలుగగాను[1], నవ్వి
మొనసి నాకెటులైన — మ్రొక్కుమనరానే! 4

తరిగొండవరి! నీకు — తగ మ్రొక్కితిమి గాక
నిరవంద నాదాయ — నేమిరా కృష్ణా? 5

## దరువు, ఆదితాళం, మధ్యకాలం

శ్రీకరముగ మా చీరె లిచ్చితె — నా కాదాయంబేమే?
మరి, నా కాదాయం బేమె? 1

మా కి చీరె లొసగ నిచ్చిన — నీకూ పుణ్యమురా కృష్ణా!
మరి, నీకూ పుణ్యమురా కృష్ణా! 2

చీరల మా కిచ్చిన నా కొసగ — మీ రేమిత్తురె భామా?
(మరి, మా రేమిత్తురె భామా?) 3

తరిగొండాధీశ్వర! నీ పదిగిన — దిరవుగ నిత్తుమురా కృష్ణా!
మే, మిరవుగ నిత్తుమురా కృష్ణా! 4

---

1 'కలిగినందువలననే' అని యర్థము

## ఏలలు

ఎవడూ మగడూగా దలంచి — యిలఁ గౌరిదేవి వ్రతము
సవినయముగా జేయూచున్నారే? వో భామలారా!
— సత్యముగాగా నాతో జప్పరే! 1

లంతటికీ పరుడై విశ్వ — మంతా రక్షింపుచున్న శ్రీ
కాంతు పొందూ గౌరీనామూరా! వో ముద్దు కృష్ణ!
— గౌరినోమూ నోమినామూరా! 2

వ్రతమూ సాంగమూగాకానే — వసనమూలూ విడిచీ, నీటా
హితమూగా జొచ్చితిరందునా వో భామాలారా!
యీ వ్రతా మింకా ఫలింతూనా? 3

వెలయా గౌరివ్రతమూ జేయా — ఫలియించే పాట వుపాయూ
మెలమీతో నీ విపుడూ దెలుపారా! వోముద్దూకృష్ణా!
— చెలగీ నే మన్నన జేసేమూరా! 4

కరమూలూ పైకెత్తి మీరూ — తరిగొండా నరాహరికీ
వరుసాగానూ నించీ మ్రొక్కారే! వో భామాలారా!
— వాడు వ్రతసలామూ నిచ్చూనే! 5

ఆ వె మొనసి యొక్కచేత ముందుగా మ్రొక్కెద
మంబరంబు లియ్యి! మంది కట్టి
యువల రెండు చేతు లమరగా పైకెత్తి
నీకు మ్రొక్కెదముర నిరజాక్ష!

(వ అనిన శ్రీకృష్ణు డిట్లనుచున్నాడు)

ఆ వె ఒక్కచేత మీరు మ్రొక్కిన నే చీర
లియును! రెండు చేతు లెత్తి మ్రొక్కి
చీరలందుగు డెను చెచ్చెర నిచ్చెద
నెమి మ్రొక్కకున్న నియను పోరె!

వ. అనిన విని గోపకాంతలు తనుతో ధా మిట్లనుచున్నారు

## దరువు. ఆటతాళం

బాలగోపాలుడు — పద్దాతో నున్నాడు
చేలము తీయ దేమి — సేయుదామే ? 1

తిన్నతిన్నగ బోయి — చిన్ని గోపాలుని
పన్నుగ నిక పొంచి — పట్టుదామే ! 2

పట్టబోయిన వీడు — పటములాలు గొని మంద
కట్టె బోయిన, వీని — కడ్డమేమే ? 3

కూరిమితో వాని — జేరి, చుట్టును పొంచి
కోరి చీరలు నాచి — కొందామేమే ? 4

తరిగొండ వరహరి — దండసాధ్యుడుగాడు
శరణను టే మంచి — సదుపాయమే ! 5

క అని పల్కిన సుందరులను
గనుగొని దరహాసవదన కలితుండగుచున్
కనకాంబరు డంబరముల
గొనిపోవుచునున్న జూచి గోపిక లే మిన్

వ శ్రీ కృష్ణుడు జనుచున్న మార్గంబున కడ్డంబుగా బోయి యిట్లనుచున్నారు.

## దరువు, ఆటతాళం

గోపాల ! మందకు బోకురా ! సుగుణాకరా !
నీపుణ్యము, మమ్మా

రాపూరవ్వలు సేయవద్దురా ! యేటి పద్దురా ?
మేము బ్రదికే వుపాయ

మీపట్ల నివు చింతించరా ! కరుణించరా !
మాచీర లందిచ్చి

యాపాద వారించి శ్రీవరా ! సిగ్గుగానరా ! 1

[అగ] రా! యిది యేటి సద్దురా? యేమి రద్దురా?
యీ సందడి విని
మగవాండ్లింకెవరైన వచ్చేరా, మమ్ము జూచేరా
నారు జూచితె మేమూ
ఆగతి నెవ్వరి నెట్ట జూతామూ? యేమి సేతామూ?
మా కిపు డంటియుండే
దిగులు దీరిచి నీవే ప్రోవరా! సిగ్గు గావరా! 2

యేమూ నేరము జేసినాముర! నెరచెయురా!
కట్టు చీరాలు విడిచీ
మేమూ నీళ్లలో జొరరాదురా! బుద్ధిలేదురా!
యీ తప్పు మన్నించి
మామీద నీదయ నుంచరా! పరిపాలించరా!
వో తరిగొండనగరా
దామా! మమ్మేలైన ప్రోవరా! సిగ్గు గావరా! 3

ద్విపద అని భంగిపడెడి[1] గో — పాంగనామణుల
గని హరి దరహా — కలితుడై పలికె
పలిని గోరుచు రతి — పతిని గెల్చుటకు
వ్రతనిష్ఠతోనుండి — వసనముల్ విడిచి
నీటిలో జొత్తురె — నియమంబు లేక?
నేటికి కాత్యాయ — నీ దేవి వరము
కల్ల జేసుకొగాని — కల్గునె ఫలము?
పల్లవాధరలార! — పాణిపద్మముల

---

1 'భంగపడెడి' అని యుండదగును 'బతిమాలుచున్న' అని యర్థము ఈ యర్థమున రాయలసీమయందలి కొన్ని ప్రాంతములలో 'భంగపోవు' అను ప్రయోగము నేటికిని వ్యవహారమున నిలిచియున్నది

నెత్తి మ్రొక్కిరి రైత — యీ ప్రవరమును
నిత్తు, మీచేయంబు  లిత్తువటంచు
పలికిన తరిగొండ — పలిని నిక్షించి
పలినాక్షు లందరు — నగి యిట్టు లనిరి

## దర్వు, ఆదితాళం

సిగ్గు లె లెరువయునాగాని — చిన్నికృష్ణున
కిచ్చోట, లగ్గి చేతులెత్తి మ్రొక్కు — దామె పేడ్కనా 1
రెండు చేతు లెత్తి మ్రొక్కే — దుండకుంటెపూనె
పెద్ద, కొండగవిలో తపముగాజేయు -- చుండవచ్చునే! 2
ధైర్యమూన మ్రొక్కకుంటె — కార్యముగా దింకమీద
నార్యు లిచ్చోటికి వచ్చే — రమ్మా! జిల్లారే![2] 3
పదరి చేతు లెత్తబోతె — కదిసిపుట్టె సిగ్గు చేత
పదలి, గుండె లదరూచున్న — విదిగో చూడారే! 4
యేమైనాగాని చేతు — లెత్తి తారిగొండాహరికి
క్షేమముగా మ్రొక్కాకుంటె — సిగ్గు దక్కాదే! 5

వ అనిన విని మరిన్నికొంద రతివ లిట్లనుచున్నారు

ద్విపద కాంతలార! యింత — కళవళపడుచు
నెంతసేపుండిన — నీ మాధవునకు
దయబుట్టి మనకు వ — స్త్రంబు లందియడు
రయమున మన మంద — రము నొకమాటు
కనుగవల్ ముకుళించి — కరముల నెత్తి
తనువుల వంచి నం — ద తనూజుమోము
మొనసి చూడక వేగ — మ్రొక్కి కూర్చుంద

---

1 'మ్రొక్కనచో' అని యర్థము

2 ఇది 'పురే! బాపురే!' — మొదలగువానివంటి ఆశ్చర్యార్థకమగు అవ్యయము

మని నిశ్చయింపుచు — నాకాంతలెల్ల
వరతరిగొండ పై — వాసుడౌ శేష
గిరిధాము నీక్షించి — గెంట కిట్లనిరి

ఆ వె విసర కృష్ణ ! మేము కనుగవల్ ముకుళించి
కాయములను వంచి, కరము లెత్తి
తనర నీకు మ్రొక్కెదము నను వూదిక్క
చూడ కంబరంబు లిడ నుంచు

ద్విపద అని గోపికలు బల్క — వంబుజాక్షుండు
విని, వారియుక్తికి — వెరగున్దుమనును
కరము ద్రిప్పుచు గిర — కంసంబుచేసే
పరిహాసించుచుగా — పలికె నిట్లనుచు
నెరజాణవార ! నీగా — నిపుణత నేను
వెరుగుదు కొంతైన — నీ మాటలేల ?
చక్కగా లేచి హ — స్తములు పైకెత్తి
మ్రొక్కకుండిన, చేల — ములను మీ కియను
మీ కన్యుడనుగాను మిత్రుడ గాని
మీకు సంకోచ మే — మిటికి నాచెంత ?
నయము[తో] నే చిన్న — నాటినుండియును
ప్రియుడనై మీతోడ — పెరుగుచున్నాడ
మెరయుచు మీలోనె — మెలగుచున్నాడ
మరి నేను చూడని — మర్మంబు లేవి ?
ఇచ్చట నీకన్య — లెవ్వరు లేరు
ముచ్చటగా నాకు — మ్రొక్కి చేలములు
[ధరియింపుడ]ని పల్క — త[రిగొండ] హరిని
చిరునవ్వుతో నవ్వి — చేడె లిట్లనిరి

## ఏలలు

ఎంతా వేడీనానూ చెతూ — లెత్తీ మ్రొక్కాడని పలికే
పంతామూ నీవ వింకెట్రారా ? వో ముద్దూకృష్ణ !
— బ్రతుకూ బయిలుజేసేవేమిరా ?

తక్కాకా కరాము లెత్తి — మ్రొక్కామంటె నన్నూ మీరు
చిక్కా[లు బె]ట్టాచున్నారే! వో కొమ్మలారా!
— తక్కా లెప్ప నేర్చుకున్నారె! 2

తరిఁగొండవాసా! నీ కిది — ధర్మమూగా దోచియుంటె
కరమూ లెత్తి మ్రొక్కేములేరా! వో ముద్దూకృష్ణా!
— వరుసానా మా చీరా లియ్యారా! 3

## ఆత్మ నివేదనము

ద్విపద అని గోపభామిను — లందరు ధైర్య
మున కృష్ణదేవుని — ముందర నిలిచి
తొలఁగక రెండు చే — తులు ముకుళించి
నలువొప్పగా 'నమో — నలినాక్ష!' యనుచు
'తరిగొండపురవాస! — దండశూకాద్రి
వర! విశ్వరూప! స — ర్వజ్ఞ! గోవింద!
పురుషోత్తమా!నంత — పుణ్య! తపంబు
లెరుగము మమ్ము నీ — వేరీతినైన
రక్షించు' మనుచును — రాకేందువదన
లకేణ భక్తితో — నప్పు డిట్లనిరి

శ్లో॥ ఆధారాది పయోరుహోపరి సహస్రారాబ్జ మధ్యస్థితం
బోధానందఘనం వికారరహితం పూర్ణానుభావోజ్జ్వలం।
రాధాలోచనకైరవామృతకరం రాజీవపత్రేక్షణం
వ్వాధారం తరిగొండశేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥

## చూర్ణిక

శ్రీమదఖండ బోధప్రద సకల నిగమ నిగమాంత శాస్త్ర పురాణేతిహాస
ప్రతిపాద్య సచ్చిదానంద నిత్య పరిపూర్ణ దివ్య మంగళ విగ్రహం,
కమలా పరిగ్రహం 1

ఉరుతర సారీస కమఠ వరాహ నరకంఠీరవ వటుక పరశుధర కోదండ
ధరణ సీరహస్త బుద్ధ కల్కి ప్రముఖ వివిధావతారం, సుజనమందారం 2
సనక సనందన సనత్కుమార సనత్సుజాతాద్యధాన ప[రమ][1] యోగీంద్ర
కోపోదిత శాప సంజాత హేమాక్ష హేమకశిపు దశకంఠ కుంభకర్ణ
శిశుపాల దంతవక్త్ర భీకర గర్వాంధకార ప్రభాకరం, బృందారక జన
ప్రీకరం 3
కమలగర్భ రుద్ర కశ్యప వశిష్ఠ శక్తి పరాశర వ్యాస శుక శౌనక గౌతమాంగీర
అత్రి భరద్వాజ నా[రద శ్రీవత్స][2] కౌత్స భృగు జమదగ్ని వాలఖిల్య
వాల్మీకి విశ్వమిత్ర ముఖ్య మునిబృంద వందిత చరణారవిందం, జగ
న్మోహనందం 4
సహస్ర మార్తాండప్రభా భాసమాన నానామణిగణఖచిత నూపుర కింకిణీ
మేఖలాంగద కంకణ హస్త [శ్రీ గ్రైవేయ][1] హార కుండల మకుట దివ్య
కనకాంబరాలంకృతం, దూరీకృత ప్రాకృతం 5
శంఖ చక్ర గదా ముసల కౌక్షేయక ధనుర్బాణ ముద్గర భిండివాల పరశు
పట్టిస పరిఘాద్యనేక దివ్యాయుధధరం, శ్రితజనవాత్సల్య మ[హీధరం][1] 6
మగధ మాళవ మళయాళ చోళ నేపాళ కొంకణ ద్రవిడ తెంకణ
పాళ్య సౌరాష్ట్ర సౌవీర కురు కుకురు కోసల పుళింద లాట విరాట
ఘోట కర్ణాట కాంభోజ కాశ్మీరాది సకల దేశాధీశ్వరాధీన సమస్త విత్తాప
హరణం, స[ధు సంపత్కారణం][6] 7
నిరంతర కిసలయ పత్ర కోరక కుసుమ ఫల మిళిత విలసన్మహీజాత
పరివృత శేషశైలాగ్ర శాతకుంభకలశోన్నత గోపుర ప్రాకార మంటపాలయ
ద్వార కవాటశోభితానందనిలయ నివేశం, శ్రీవేంకటేశం 8
[నిరుపమ నిరుపాధిక ని][6]రాలంబ నిష్కళంక నిరామయ నిర్వికారాది
మధ్యాంతరహిత స్వయంప్రకాశం, తరిగొండ పట్టణాధీశం భజేఽహం,
భజేఽహం, భజేఽహం 9

అని మరి ప్రెట్టనుచున్నారు

---

1, 2, 3, 4, 5, 6–అం శిథిల భాగములు 'విష్ణుపారిజాత' మందుగల యుదే చూర్ణిక ననుసరించి పూరింపబడినవి

## దరువు

దండమూ కృష్ణా! దండ [మూ] ॥పల్లవి॥

[అండజవాహన! ]
కుండలిశయన! బ్ర - హ్మాండశరీరా! ॥దండమూ॥ 1

మందరగిరిధర! — సుందర విగ్రహా!
నందతనయ! గో — వింద! ముకుందా! ॥దండమూ॥ 2

గురుతరవేంకట — గిరివరనాయక!
తరిగొండాధీ — శ్వర! నరసింహా! ॥దండమూ॥ 3

## వస్త్రదానము

గీ అనుచు మ్రొ[క్కు]చు బలికిన, నంబుజా]క్షు
డిట్టులని సత్కి మీచీర లెట్టి? విపుడు
దెలుపరే! యన విని గొల్ల తెరవ లెల్ల
బాలకృష్ణుని వీక్షించి పలికి రిట్లు

## దరువు, ఆనందభైరవిరాగం, ఆదితాళం

నా చీర యెట్టిదన్నను — నందనందన వినరా!
పూచీరట్లుండు లా చీరరా! 1

నెళవుగా నాచీర మరి — నీ వెట్టిదనిన విను
కళలచే నొప్పు చందురు — గావి చీరరా! 2

శ్రీలలనాధీశ! నాదు — చీర యెట్టిదంటె వీను
మేలు కమ్మిన మరు పెను — బాలా చీరరా![1] 3

చిన్నికృష్ణ! నే గట్టిన — చీ[ర యెట్టిదంటె] విను
పన్నుగా మెరసే లింగాల[2] — పట్టుచీరరా! 4

---

1 'పెనుబాల (పెనువాలపేట ?) అను ఊరిలో తయారు చేయబడిన మేలు కమ్మిచీర' అని యర్థము 'మేలుకమ్మిచీర' యనగా అంచు నూడంగుళముల వెడల్పు ఉండునటుల చాయనూలితో నేసిన పెద్దంచులు గల కోక (చూ శ ర పుట 643)

2 'లింగాల' — అనునది చీరల నేతకు ప్రసిద్ధి గాంచిన ఒకానొక గ్రామం పేరు కావచ్చు

వేణుగానలోల! నీవు — విను నా చీర యెట్టిదంటె
నాణెమైన యెర్రని బా — ణాలా[1] చీరరా! 5

బాలకృష్ణ! నా చీర యే — పాటి చీరంటేను వినుము
లాలితమైనట్టి కలిక చీరరా! 6

కలికికృష్ణ! నా చీర యె — ఘనమైన చీరంటవైన
బలు మేలైనా కంబావతి — పట్టు చీరరా![2] 7

నీరజాక్ష! నే గట్టిన — చీర యే చీరంటేనైనా
కోరి కొన్నట్టి ప్రాప - ళ్ళాల చీరరా![3] 8

అనుచు తమతమ చీర లట్టిట్టివని [గోపిక] లందరు వినిపింప, నవ్వి తరిగొండ విభు డిట్లనెను

ఓ గోపకాంతలార! కోక లిచ్చెదనని,
నాయెదుటను మీరు నగుచు నిలిచి
మీరు కట్టికొనుడ విగాయంబరంబులు
మరుగు కేగవలదు మగు[వలార!]

అనిన విని గోపకాంత లిట్లనిరి కృష్ణ!
యిలను మానవమానంబులెల్ల నీకు
ప్రీతి చెల్లింపగా సమర్పించి మరల
మ్రొక్కెదము వల్వ లియ్యరా మోహనాంగ!

---

'బాణాల' (బాడాల ? లేదా బాణావరం) — ఇదికూడ చీరల నేతకు పేరుపడిన గ్రామ నామం కావచ్చు

మడుగు వస్త్రముగా నుపయోగించుటకై ప్రత్యేకముగా తయారు చేయబడిన ఎర్రని పట్టు దోవతిని 'కంభావతి' యందురు అటువంటి పట్టుతో నేసిన చీరయే 'కంభావతి పట్టుచీర'

ప్రాసలుకునగా వేదములు నాలుగు వేదములకు నాలుగు వర్ణములు పురాణ ప్రసిద్ధములు అందు ఋగ్వేదము పసుపు యజుర్వేదము తెలుపు సామవేదము ఎరుపు అథర్వణ వేదము నలుపు ఈ నాలుగు రంగుల తంతులతో ప్రత్యేకముగా నేయబడిన చీరకు 'ప్రావళ్ళాల చీర' యను వ్యవహార ముండి యుండవచ్చును

అని మ్రొక్కిన గోపికలను
వనజాక్షుడు మెచ్చి మెచ్చి వసనము లొసగన్
ఘన
[కొని] తమవస్త్రములు గట్టికొనిరి ముదమునన్

క అప్పుడా శౌరి గోపకాంతల జూచి యిట్లనుచున్నాడు -

## వ్రతఫలము

ఉ సతులారా! వరగౌరిదేవి వ్రతమున్ సంకల్ప పూర్వంబుగా
పతి గామింపుచు జేసినారు, భళి! మేల్, బాగౌను మీ కోర్కెలన్
వ్రతము[న్ పొంగముగా ముగి]ంచి, యుట సర్వస్వంబు నారాయణా
ర్పితమంచున్ వచియించు డా ఫలము నిప్పింతున్ విశేషంబుగా

వ అనిన విని గోపకాంతలు పద్మాసనాసీన[లై కూర్చుండి] గౌరికి షోడశోపచార
పూజలు సమర్పించి, వ్రతోద్యాసనంబు[జేసి, గౌరిదేవిని] మది నుద్దేశించి
యిట్లనుచున్నారు

శా గౌరీ! పార్వతి! చంద్రమౌళితరుణీ! కళ్యాణసంధాయినీ!
పారావారవిహారిణీ! శుభగుణీ! సౌందర్యరూపిణీ!
కారుణ్యామృతవీక్షణీ! భగవతీ! కంకాళినీ! భైరవీ!
శౌరే మమ్ము వరించు సద్వరము ని[ప్పింపన్ కృపన్ బూనవే!]

వ అని ప్రార్థించి, అర్తికంబుగైకొని మంగళంబు బాడే విధం బెట్టిదనిన

### దరువు (లావిణి), ఆదితాళం

శైలజతాకూ గౌరికి — జయమంగళం ॥ప॥
శ్రీ, శూలధరునా కభవునాకు — శుభమంగళం ॥శైలజతాకూ॥ ॥అ.ప॥
మహిషాసుర సంహారిణికి — మోనిజనోద్ధారిణికి
బహుచరా వరపూతమునకు — భవ్యమంగళం శ్రీ ॥శైల॥ 1
సుగుణాభరణధారిణికి — సురసమూహోద్ధారిణికి
నిగమాంతసంచారిణికి — నిత్యమంగళం శ్రీ ॥శై॥ 2

తరిగొండ నరహరి శౌ — దరికి, శ్రీకంకాళినికి[1]
సురుచిర సువాసినికి — శుభమంగళం శ్రీ॥శ్రీల॥ 3

అని గోపికలు మంగళంబు బాడి, గౌరీవ్రతంబు సంపూర్ణంబు గావించి, హరిని జూచి యిట్లనుచున్నారు

## ఏలలు

గౌరీవ్రతమూ — సాంగామైన వెనకా, వ్రాతఫలము
నిచ్చేనంటి వియ్యారా! వో బాలాకృష్ణా!
— పలికి మాతో బొంకావలదూరా! 1

గౌరీనిగూర్చి యీా వ్రతమూ — గావించితిరీగాదా? మీా
కోరికే నాతోమా దెలుసారే! వో భామాలారా!
నానా ఫాలా మియ్యానే! 2

సారాసాక్షా! ఏా మాదిలో — కోరికే నీతో జెప్పాము
తేరా! నీవే తెలూసూకోరా! వో బాలాకృష్ణా!
— తెప్యనా తత్యార్థా మియ్యారా! 3

మానాసామూలో కోర్కెలా — పూనీ మీాతో జెప్పగాటా[కూ
నేనూ సుద్దీవా] డానూ[2] గానే! వో భామాలారా!
— నిజమూగా మీా రంటే వివేనే! 4

శ్రీతారిగొండా మా నారా — సింహునీతోడే! మా కోర్కె
నీతొ జెప్పా సిగ్గయ్యానీరా! వో ముద్దూకృష్ణా!
— నీలో నీవే తెలూసూకోరా! 5

ప్రవర అని గోపికలు ఒల్కె — నా మా[ధవుండు
నను గౌరి] చింతించి — నారు, మేలయ్యె
సిగ్గుచే మీారది - జెప్పజాలకను

---

'కంకాళిని' అనునది దుర్గయొక్క వివిధ స్వరూపములలో నొకదాని పేరు (మా మోనియర్ విలియమ్స్ సంస్కృత — ఇంగ్లీషు డిక్షనరి, న్యూ ఎడిషన్ పుట 242)

'సుద్ది (ఎరుక)చెప్పెడువాడు' అని యర్థము

తగ్గగా వేనే మీ — తలపు జెప్పితిని
సారసేక్షణలార! — సంప్రీతితోను
వీరు రాత్రులయందు — మెరయుచు వచ్చి
అనుహొంద తరిగొండ — హరి మెచ్చగాను

వ [అని పల్కిన, గో]పకాంతలు నమ్మక హరితో నిట్లనుచున్నారు

## దర్వు. అటతాళం

మగవాని మాట యి — మ్మహి మంచుమాట
పగలు జూపే మేలు — వనధిపై వ్రాలూ 1
కామించె విభ్రమము — గగనకుసుమము
భూమి పురుషుని నిందు — పు [రి జున్ను మందూ 2
నీరజేక్షణ] మాటలు — నిజమనరాదు
తరిగొండహరి తోడె! — దబ్బరా గాదూ 3

వ అని గోపికలు సందేహింపుచున్న, నవ్వి నందకుమారుం డిట్లనుచున్నాడు

ద్విపద నను నమ్మజాలక — నలినాక్షులార!
యనుమానము
రమణతో మిము నేను — రక్షించుపనికి
అనుర మీ మధురాధ — రాబ్జులు సాక్షి
కాదవేమి ? మీ కుచ — కులగిరుల్ సాక్షి
కదియ మీ నాభి పు — ష్కరిణులు సాక్షి
ఎదుట రోమాళి ఫ — ణీంద్రులు సాక్షి
యదిగా! మా తరిగొం[డ — హరి నిత్యసాక్షి
నమ్ముడు నా] మాట — నవబోణులార!
మిమ్ము రక్షింతు, నే — మిటికి సందియము ?

వ అని గోపకాంతలకు నమ్మిక లిచ్చి, వారితో విలాసంబుగా నిట్లనుచున్నాడు

## దర్వు, అటతాళం

వేడూక గొరన్మ — జాడాగా నెడు శ్రీ

1

[తూగుటు] య్యాలవలె వుండె — వుయ్యాల తీగెల
మాగుదామా ? వో — చెలులారా । 2

వాడిగా తరిగొండ — వానూని సరములు
పాడుదామా ? వో — భామినులారా । 3

## దర్వు*, ఆదితాళం

రారే వేడ్కను — రామలా [రా ।] 1

॥రారే॥ 2

తుమ్మెద కొదనుల — తోలుదాము రారే । ॥రారే॥ 3

కుసుమ ఫలంబులు — గోతాము రారే । ॥రారే॥ 4

శ్రీ తరిగొండ న్ప — సింహుని మీరే ॥రారే॥ 5

ప్రార్థింపుచు న — త్పద మిమ్మనరే । ॥రారే॥ 6

ఆ వె అనుచు వారితోడ వనవిహా [రము జేసి]

['మంద క] రుగు డింక, మన ధేనువుల మేప
పోయివత్తు వేమ పొలతులార ।'

వ అని పలికిన హరిని సాభిప్రాయంబుగా జూచి గోపికలు మంగళంబు బాడే విధం బెటువలెను

## మంగళము

## దర్వు, ఆదితాళం

మాధవునకు జయ — మంగళం ॥పల్లవి॥

శ్రీమ ॥ ఉప ॥

---

* ఈ దర్వు యొక్క మొదటి పాదము పల్లవి వలె అవృత్తి పొందియుండుట గమనింప దగినది ఇది యిందలి కొన్ని గేయములకు సహజముగా కనబడుచున్నది

విదురవరదునకు — విశ్వంభరునకు
మదనజనకునకు — మంగళం
సదయహృదయునకు - చపలాసుర దు
ర్మదభంజనునకు — మంగళం ॥ మాధవునకు ॥ 1

సహజానంద ర — స స్వాంతునకును

చేతవ — భరితోదరునకు
మహిమాఢ్యునకును — మంగళం ॥ మాధవునకు ॥ 2

గురుతర వేంకట — గిరిపతియై మను
మరువని సామికి — మంగళం
తరిగొండాధీ — శ్వరుడై మ మ్మే
మరని నృహరికిని — [మంగళం ॥ మాధవునకు ॥] 3

## అనంతర కథా సంగ్రహము

ద్విపద [అని భక్తితో మం]గ — ళారతు లెత్తి
మనములు గరుగంగ — మందకు గోప
తరుణులు జని రంత — దనుజసంహారుడు
పరుగెత్తి చని గోప — బాలుర గూడి
పసుల మేపుచునుండి — బ్రాహ్మణస్త్రీల
పసమీర రక్షించి, — పర్వతమెత్తి
ఆపీ
కామినీమణులకు — గలిసి, యానంద
కల్లోలముల దేల్చి, — కరిని, చాణూర
మల్లుని, కంసుని — మరి ద్రొక్కిపట్టి
దుష్టరాజుల నెల్ల — దును మాడి, వరుస
శిష్టులనెల్ల ర — క్షింప చుచునుండి
వనధిమధ్యంబున — ద్వారక గట్టి
షంఘా, , , , , , ము
బహుసంఖ్య నొనర చే — పట్టి, పుత్రకుల

మహిమ మీరగ పెక్కు — మందిని గాంచి
పరమసంతోష నం — భరితుడై [illegible]రి
సురుచిర లీలల - సుఖియింపుచుండె

## సమర్పణము

అని యిట్లు శేషాచ — లాధీశు డగుచు
తను నేఁ తరిగొండ — ధాముని పేర†
•[వాసి కెక్కిన నంద — వరకులోద్భవుడు
శ్రీవాసుండు వా — సిష్ఠగోత్రుండు
కానాలవంశ సా — గర శశాంకుండు
నైన కృష్ణార్యున — కతివయై వెలయు
మంగాంబ సుతయయి — మహి బుట్టినట్టి
వెంగమాంబిక మోక్ష — విభవంబుకొరకు
వలుపొప్ప తరిగొండ — నరసింహు కరుణ
లలి జలక్రీడా వి — లాసమున్ యక్ష
గానంబు జేసి వేం — కటగిరీంద్రునకు
పూని సమర్పించె — బుధసమ్మతముగ
భూచక్రమందు పెం — పుగ నీ ప్రబంధ
మా చంద్రతారార్క — మై యొప్పుగాత !]



† మూలప్రతిలో గ్రంథ మింతవరకే యున్నది తరువాతి భాగము గల చిట్టచివరి తాళపత్రము లోపించినది అందు కవయిత్రి నామధేయము, అంకితప్రసక్తి గల ఐదారు ద్విపద పంక్తులు, ఆటుపిమ్మట — అనగా గ్రంథాంతమున — లేఖకుడు, లేఖనకాలము ఇత్యాది వివరము లుండియుండును

'[ ]' — ఈ గుర్తుల మధ్య గల ఆరు ద్విపదలు 'విష్ణుపారిజాతము' నుండి గైకొనబడినవి అందు నాల్గవ ద్విపదలో నున్న 'నల పారిజాతాపహరణంబు యక్ష' అను పదమునకు మారుగా నిందు 'లలి జలక్రీడావిలాసమున్ యక్ష' అని చేర్చబడినది

# అనుబంధము - (i)

**Note —** దిగువ నీయబడిన పాఠాంతరములు P ప్రతియందుండి స్వీకరింపబడినవి నీటిలో కొన్ని మూల ప్రతియందలి శిథిల భాగములకు పూరకములు

| పుట | పంక్తి | పాఠాంతరము |
|---|---|---|
| 3 | 9 | బాల — కృష్ణు లీలలను |
| 5 | 4 | జాహ్నవి పినతల్లి మాకు |
| 5 | 15 | అనిన విని వారు సంతసించి• రంత విఘ్నేశ్వరునకు |
| 8 | 11 | అరసి గోపకులు, |
| 10 | 19 | బ్రతుకు మీదా జోరీ విడువారా! |
| 22 | 7 | విజిత శతకోటి మదనం, సత్య ధర్మ |
| 25 | 16 | గర్భమున దాల్చి |
| 35 | 7 | ప్రవిమలాకార! |
| 36 | 4 | గచ్ఛాలవారి! నీ—కనుగవ మోడ్పావు ॥ చిచ్చో ॥ |
| 37 | 16న పంక్తికి తరువాత | మాట యురవై యయిదేండ్లు జీవిస్తున్నాడూ |
| 38 | 8 | నలరుచు పురుడు పు—ణ్యాహవాచనము |
| 41 | 20, 21 పంక్తుల నడుమ | నావరింపుచు కన్ను — లప్పుడు దెరచి |
| 45 | 22 | యచ్చెరు వికనేమిసేతు నమ్మయలారా? |
| 47 | 2 | నడర నవ్వుల జూడ — నమితంబుగాను |
| 60 | 2 | బాలు డెరుగునటరె భామలార? |
| 70 | 8 | గోపిదేవిసుతుని కొట్టు మంటివి, వాడు |
| 76 | 2 | తనయూల గన్నవారు గాదా? |
| 83 | 14 | కామాక్షి! జగదీశ్వరి! జంబుకేశ్వరాఖిలాండేశ్వరి! |

| పుట | పంక్తి | పాఠాంతరము |
|---|---|---|
| 143 | 24 | అలవ ! నా చీర తె — ల్లని చల్వ చిర |
| 152 | 14 | కొంటెలై కట్టిన — కోకలు విడిచి |
| 156 | 1 | చెలియలార ! యొక్క చేత మ్రొక్కిన |
| 159 | 1 | నగధీర ! యిది యేటి సద్దురా ? |
| 164 | 3 | అండజవాహన ! — పండితపాలన ! |
| 164 | 10 | అనుచు మ్రొక్కిన సతులతో నంబుజాక్షు |
| 164 | 16 | పూచీవట్లుండు బంగారు — పూలా చీరెరా ! |
| 165 | 4 | లాలితమై పట్టు కలిమి పూ — లా చీరెరా ! |
| 165 | 8 | కోరి కొన్నట్టి క్రప ప — ల్యాకం చీరెరా ! |
| 166 | 3 | ఘనముగ గోపిక లవి గ్ర, కొని |
| 166 | 9 | వ్రతమున్ పూర్తిగ నాచరించి, యట |
| 166 | 17 | సద్వరను సత్ప్రేమంబుతో నీయవే ! |
| 167 | 6 | జలజా నయనా ! గౌరీవ్రతమూ |
| 167 | 11 | గొబ్బ్యానా ఫలామూ యిచ్చేవే ! |
| 167 | 21 | అని గోపికలు బల్క — నా మాట లెల్ల |
| 167 | 21వ పంక్తికి తరువాత 22వ పంక్తికి ముందు | విని కృష్ణదేవుండు — యిక యిక నవ్వి<br>మనము రంజిలజేసి — 'మదవతులార ! |
| 167 | 22 | నను గొల్వ జింతించి — నారు, మేలయ్యె |
| 168 | 5 | నను బొందుదురు గాని — నమ్మి పొందిపుడు |
| 168 | 11 | భూమి పురుషుని విందు — పులి బెట్టె విందూ |
| 168 | 12 | నెరయ నీ మాటలు — నిజమనరాదూ |
| 168 | 16 | యనుమానముగ మాట — లాడనేల ? |
| 168 | 22 | యదిగో ! మా తరిగొండ — హరి సర్వసాక్షి |
| 168 | 23 | నమ్మరే ! నా మాట |
| 169 | 2 | వేడూక గౌరమ్మ — జూడాగ నెదుటా |
| 169 | 3 | నా, ట్లాడుదామా ? వో — చెలియలారా ! |

| పుట | పంక్తి | పాఠాంతరము |
| --- | --- | --- |
| 169 | 4 | శయ్యాల వలె నుండె — వుయ్యాల తీగెల |
| 169 | 9 | రారే వేడ్కను — రమణులారా ! |
| 169 | 10 | పూ బొదరిండ్లకు — పోదాము రారే ! |
| 169 | 16 | చాల మోద మొసగి చక్రధరుడు |
| 169 | 24 | శ్రీమహి నీలునకు — మంగళం |
| 170 | 6 | మహిత చరితునకు — మంగళం |
| 170 | 7 | బహు విధ చేతన — భరితోదరునకు |
| 170 | 14 | అని కృష్ణునకు మంగ — ళారతు లెత్తి |
| 170 | 20 | ఆ మీదటను రాత్రు — లందును గోవ |
| 170 | 27 | వని బూని రుక్మిణీ — ప్రముఖాంగనలను |

# అనుబంధము - (11)

శ్రీకృష్ణునకు 'జగన్నాటక సూత్రధారి' యని, 'లీలామానుషవిగ్రహు'డని పౌరాణిక ప్రసిద్ధి ఆయన లీలలతో ముడివడిన ఘట్టములలో మిగుల ముఖ్యమైనది గోపికల 'జలక్రీడ' ఈ ఘట్టమునకు గల ప్రశస్తిని గుర్తించిన పలువురు ప్రాచీనార్వాచీన కవులు ఈ కథావస్తువుతో వివిధ వాఙ్మయ ప్రక్రియలతో వేర్వేరు రచనలను వెలయించిరి

తెలుగున ఆ ఘట్టమును ప్రధానీకరించుకొని అదే పేరుతో గాని, లేదా ఆ ఘట్టముతో గూడిన భాగవత దశమస్కంధ కథను గైకొని మరేదైన పేరుతో గాని యక్షగానరచన గావించిన కవుల వివరము ఈ దిగువ నీయబడినది

| కవి | కృతి | వివరములు |
|---|---|---|
| *అక్కయ ప్రథముడు (క్రీ శ 16,17 శతాబ్దుల నడిమి కాలము) | శ్రీకృష్ణలీలా విలాసము | శ్రీరంగపతికి అంకితము ముద్రితము 'యక్షగానములు' (4వ సంపుటము), ఆంధ్రవిశ్వ కళా పరిషత్తు, వాల్తేరు (1959) |
| శహాజీ (క్రీ శ 1684–1712) | జలక్రీడలు | శ్రీకృష్ణాంకితము ముద్రితము 'యక్షగానములు' (9వ సంపుటము), ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు, (1973) |
| పరభాద లింగోజీ (క్రీ శ 17వ శతాబ్ది) | జలక్రీడ | అలభ్యము |
| నిముషకవి రామయ్య (క్రీ శ 1758 ప్రాంతము) | జలక్రీడావిలాసము | విష్ణువంచేద్యక్షేత్రమున వెలసిన రామేశ్వరున కంకితము (?) ముద్రితము శర్వాణీ ముద్రాక్షరశాల, అమలాపురము(1908) |

---

* ఈ కవి కాలమును తెలిసికొనుటకు ఇతరాధారములు లేకపోయినను, ఈతని రచనయందలి ప్రాచీనతను బట్టి కాల నిర్ణయము చేయబడినది.

| కవి | కృతి | వివరములు |
| --- | --- | --- |
| — | జలక్రీడ | తిరువళ్ళూరు వీరరఘువునకు అంకితము అముద్రితము SVUOR Inst Library లో క్రింది సంఖ్యలు గల వ్రాత ప్రతులు గలవు D 1839 (b) (P L), D 1881 (P L), R 2421 (Paper), R 2422 (Paper) ఈప్రతులన్నియు అసమగ్రములు |
| — | భాగవతము | సత్యపుర వేణుగోపాలాంకితము అముద్రితము Adayar Library, Madras లో నొక వ్రాత ప్రతి కలదు సంఖ్య 74790 |
| ఆలూరి కుప్పన కవి (18వ శతాబ్ది మధ్య కాలము) | పార్థసారథి విజయము | చోళపురము పాలకుడగు వేంక టాచలవిభునకు అంకితము అముద్రితము SVUOR.I Library లోని వ్రాతప్రతులు D 1908(P L) R 7 58 (Paper), G O M, Library (Madras) లోని వ్రాతప్రతి R 1907(Paper), |
| భారతి రామరాజు (క్రీ.శ 1795 ప్రాంతము) | జలక్రీడలు | పొట్నదుర్తి శ్రీహరి కంకితము ముద్రితము సరస్వతీ నిలయ ముద్రాక్షరశాల, మదరాసు, తృతీయముద్రణ (1883) |
| రాయభట్టువీరరాఘవ కవి (క్రీ శ 1800కు పూర్వుడు) | జలక్రీడా నాటకము | అలభ్యము |

| కవి | కృతి | వివరములు |
|---|---|---|
| పాకనాటి గణపతిరెడ్డి (గణపతి పెద్దన అని నామాంతరము 18వ శతాబ్ది) | గోపాల విలాసము (కృష్ణ విలాసము) | నీలాద్రి నిలయుడగు జగన్నాథు నకు అంకితము (?) ఐదారు తడవలు ముద్రితము అందొకటి రాయపురం రత్నా నాయకర్ శ్రీ సరస్వతీ ముద్రాక్షర శాల, మదరాసు (1886) |
| శీర్నాగు వెంకటరాయ కవి | లేపాక్షి కృష్ణ నాటకము (జలక్రీడలు) | లేపాక్షి శ్రీహరికి అంకితము మూడు తడవలు ముద్రితము విశాఖపట్టణము (1931), వెస్టు వార్డు అండ్ కో, మదరాసు (1947, 1950) |
| కామకోలను వెంకటదాసు (19వ శతాబ్ది పూర్వార్ధము) | శ్రీకృష్ణ నాటక యక్షగానమహా ప్రబంధరాసక్రీడా విలాసము | ఇందు గోపికల 'జలక్రీడల' ఇతి వృత్తము గల ఆశ్వాసము నే డలభ్యము 'రాసక్రీడల' కథా భాగము గల చతుర్థాశ్వాసము మాత్రమే లభ్యమై, రెండు తడవలు ముద్రితమైనది నేషనల్ ప్రెస్, బందరు (1926), వెంకట్రామా పవర్ ప్రెస్, ఏలూరు (1948) |
| మతుకుమల్లి నృసింహ కవి (క్రీ శ 1816–1873) | శ్రీకృష్ణ జలక్రీడా విలాస నాటకము | అలభ్యము |
| మరింగంటి వేంకట నృసింహాచార్యులు (క్రీ శ 1842 ప్రాంతము) | ఇందిరాం భాగవతము | అముద్రితము వ్రాతప్రతి హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధక మండలిలో కలదట |

| కవి | కృతి | వివరములు |
|---|---|---|
| చిలకమర్రి నారాయణాచార్యులు (క్రీ.శ 1865 ప్రాంతము) | భాగవతము (దశమస్కంధ పూర్వ భాగము) | అలభ్యము |
| భారతుల శ్రీ రంగకవి (క్రీ.శ 1879 ప్రాంతము) | శ్రీకృష్ణలీలలు (శ్రీకృష్ణ జలక్రీడలు) | నూచెర్ల చెన్న కేశవునకు అంకితము ముద్రితము వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాల, మదరాసు, (1881) |
| మైసంపాటి వీరరాఘవయ్య (19వ శతాబ్ది ఉత్తరార్ధము) | బాలగోపాల విలాసము | నాలకూరపాటి వేణుగోపాలస్వామి కంకితము ముద్రితము శ్రీ వాణీ వినోద మందిర ముద్రాక్షరశాల, మదరాసు (1887) |
| ద్విభాష్యం పుల్లకవి (19వ శతాబ్ది ఉత్తరార్ధము) | శ్రీ కృష్ణ గోపీ జలక్రీడా భాగవతము | అలభ్యము |
| గరికిపాటి సూర్యనారాయణ శాస్త్రి, (19వ శతాబ్ది ఉత్తరార్ధము) | శ్రీకృష్ణ జలక్రీడా నాటకము | ముద్రితము(1898),అలభ్యము |
| వి వెంకట నారాయణకవి (20వ శతాబ్ది పూర్వార్ధము) | శ్రీకృష్ణ బాల క్రీడా విలాసము | ముద్రితము (1901), అలభ్యము |
| వేదంభట్ల వేంకట రాయ కవి (20వ శతాబ్ది పూర్వార్ధము) | జలక్రీడా విలాసము | పూసపాటి వేంకటపతి రాజునకు అంకితము ముద్రితము శ్రీ శారదా మకుట ముద్రాక్షర శాల, విశాఖపట్టణము (1906) |
| లంబటిపూడి ఆనందయ్య (20వ శతాబ్ది పూర్వార్ధము) | గోపికా వస్త్రాపహరణము | ముద్రితము (1908), అలభ్యము |

| కవి | కృతి | వివరణ |
| --- | --- | --- |
| నాగవేని వెంకటప్ప (20వ శతాబ్ది పూర్వార్ధము) | కృష్ణలీలా నాటకము | ముద్రితము (1914), అలభ్యము |
| బళ్ళ రామరాజు (20వ శతాబ్ది పూర్వార్ధము) | శ్రీకృష్ణలీలలు | ముద్రితము, తొమ్మిదవ కూర్పు శ్రీకాళహస్తి తమ్మారావు అండ్ సన్స్, రాజమండ్రి (1945) |
| చెర్విరాల భాగయ్య (20వ శతాబ్ది ఉత్తరార్ధము) | భాగవతము | తెలంగాణా ప్రాంతమందలి 'చందా' గ్రామమున వెలసియున్న దేవున కంకితము ముద్రితము కొండా శంకరయ్య అండ్ కో, సికింద్రాబాదు (1954) |

Note – పై పట్టికయందు అలభ్య కృతులుగా పేర్కొన్న వాటిలో నొకటి రెండు యక్షగానేతర నాటకము లుండిన నుండవచ్చును

పై పట్టికను బట్టి క్రీ శ 17వ శతాబ్దికిపూర్వమునుండియే తెనుగున 'జలక్రీడా' వస్తుక యక్షగానరచన సాగినట్లు నిశ్చయింప వీలగుచున్నది

పై పట్టిక యందలి 4, 8, 10, 11, 16, 21 సంఖ్యల కవుల రచనలు వెంగమాంబ జలక్రీడా విలాసమువలెనే శ్రీకృష్ణ జన్మ వృత్తాంతముతో మొదలిడి గోపికల జలక్రీడల ఘట్టముతో ముగియుచున్నవి అందులోను 4, 8, 11 కవుల రచనలకు వెంగమాంబ రచనకు కథా విస్తృతిలో సన్నిహిత సారూప్యము గోచరించుచుండుట యొక విశేషము

పై పట్టికను సమకూర్చుటలో ఉపకరించిన గ్రంథములు

1 ఆంధ్రవాఙ్మయ సూచిక (1929) ప్రకా శ్రీ శే కాశినాథుని నాగేశ్వరరావు
2 ఆంధ్రకవి సప్తశతి (1956) బులుసు వేంకటరమణయ్య
3 ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర (1961) డా యస్వీ జోగారావు ఎమ్ ఏ, పి హెచ్ డి
4 మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయమువారి డిస్క్రిప్టివ్ కేటలాగులు